# ఈ సంచికలో



ముఖచిత్రం : చంపక వైశాఖి

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య


యువ సాలు చందా రు. 12-00

దీపావళి ప్రత్యేకసంచికతో రు. 17-00

యువ, సైఫాబాద్, హైదరాబాద్-4.

చూచి ఆనందించండి!

AVM ప్రొడక్షన్సు

రత్నశ్రీ ప్రొడక్షన్స్ సమర్పించు

# ప్రేమ మనసులు

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: A.C. త్రిలోకచందర్ M.A.,

మాటలు, పాటలు, నిర్వహణ: అనిసెట్టి

నిర్మాత. K. సత్యనారాయణమూర్తి

ఆంధ్ర, నైజాం
లక్ష్మి రిలీజ్





మార్చినెల యువ సంపాదకీయములో కేంద్రప్రభుత్వము ఆంధ్రపై చూపుతున్న వైఖరినిగూర్చి చక్కగా వ్రాసినందులకు అభినందనలు. కథలు ముఖ్యంగా "మారనిదూరం తీరని మమత" చక్కగా వాస్తవానికి దగ్గరగావుంది.

'మీనా' సీరియల్ నవల యువకు, వెన్నెముక. కార్టూనులు కడుపుబ్బ నవ్విస్తున్నాయి.

సి. నారాయణనాయుడు, ఉద్దనపల్లి.

ఈ నెలలో కథలన్నీ బావున్నాయి. మంచి, 'సిన్సియర్' కథలకు మీ 'యువ' పెట్టింది పేరు. 'సాహిత్యపాకశాల'లో చేరి మాంచి 'డిగ్రీ'లు తీసుకోవాలని వుంది. 'గణితశ్రీ' గారెవరో వివరిస్తే బావుంటుంది. శ్రీ గోపాలచక్రవర్తి గారి 'అనెక్‌డోట్స్' వింతగా, తమాషాగా వుంటున్నాయి.

మిసెస్. సంగీతరామనాథరావ్.
హైదరాబాద్ - 1.

యువ ఏప్రిల్ సంచికలో ప్రచురింపబడ్డ రగులుకొనే రాక్షసిబొగ్గు చదివాను. రామవరపు వేణుగోపాల రావు గారి ఇతర కథల్లా - ఇందులో కూడ చాలా ఫోర్సూ ఆవేశమూవుంది మధ్యతరగతి హిందూ స్త్రీకి సమాజంలో ఏ విధమైన రక్షణ లేదు. రచయిత చెప్పినట్టు చట్టప్రకారంగా పునర్వివాహ ప్రసక్తివున్నా చేసుకోలేని అశక్తత, దానికి తోడైనదారిద్ర్యం · వీటన్నిటిన్నీ కళ్ళకి కట్టేలారాసేరు. ఆ కథలో సమాజంలోని కుళ్ళువుంది. దీనుల దీనారావాలు వున్నాయి. ఇవి మమ్మల్నెంతగానో కదిలించేయి. వరాలు, సుబ్రమణ్యం చిరకాలం నామనస్సులోవుండిపోతారు. రచయితకి మీకు నా ధన్యవాదాలు.

ఎ. సావిత్రి, వాల్తేరు

1969 ఏప్రిల్ నెల ముఖచిత్రము చాల బాగుంది. దాదాపు అన్నికథలు బాగున్నాయి. ముఖ్యంగా "రగులుకొనే రాక్షసిబొగ్గు" చాలబాగుంది. రచయిత వేణుగోపాలరావుగారికి నా అభినందనలు తెలుపుకొనుచున్నాను. ఇటువంటి కథ మాకు అందించినందులకు మీకు అభినందనలు తెలుపవలసిందే.

సీరియల్ "మీనా" చాలా డల్‌గా సాగుతూంది

పి. మధుసూదన్,
హనుమకొండ.

# చందమామ
## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 19 | మే, 1969 | సంచిక 5


నాలుగు సంవత్సరాల తరువాత మళ్ళీ యీ సంవత్సరం, దేశానికి కరువు భయం ఏర్పడింది. గోధుమ పంటమీద ఆధారపడే ఉత్తరాది వారికి యీ ప్రమాదంలేదు; కాని, బియ్యం ప్రధాన ఆహారంగా గల దక్షిణ రాష్ట్రాలు, యీ సంవత్సరం నిజంగానే ప్రమాద స్థితిలోపడ్డాయి.

కొన్ని సంవత్సరాలు పంట ఎక్కువగా పండటమూ, ఒకొక్కప్పుడు వానలు లేకపోవడంవల్ల పంటలు నాశనమైపోవడమూ మనకు కొత్తకాదు; కాని, ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు దెబ్బతిన్న తరువాతకూడా, ముందు జాగ్రత్త తీసుకునే శ్రద్ధా, జ్ఞానమూ మన ప్రభుత్వానికి లేకపోవడం, చాలా చిత్రమైన విషయం. విదేశాలనుంచి ఎంతోమంది వ్యవసాయ శాస్త్ర నిపుణులు ఎన్నోసార్లు మన దేశానికి వచ్చి, మన భూముల్నీ, పంటతీరుల్నీ చూసి, మన నదీజలాల సమృద్ధినీ చూసి, సరియైన పద్ధతులలో నీటిసాగు, ఎరువులు వెయ్యడం, ఆధునిక

పద్ధతులలో సేద్యం చెయ్యడం జరిగినట్లయితే, మనదేశం, తిండిగింజలకు విదేశాలమీద ఏమాత్రం ఆధారపడనక్కరలేదని చెప్పి వెళ్ళారు. అయినా, మనం సరియైన పద్ధతులను అవలంబించనూలేదు. ఆహార ధాన్యాల ఉత్పత్తిని ఎక్కువ చెయ్యడానికి అవసరమైన కార్యక్రమా లను అమలులో పెట్టుకోనూలేదు. దీనికి కారణం, మనదేశంలో మేధా సంపత్తి లేకకాదు. కరువు. కాటకాలను తొలగించుకుందామనే దీక్ష లేకపోవడం; కోట్లకొలదిగా రూపాయలు విదేశాలకు పోతున్నా, ఆహారధాన్యాల విషయంలో స్వయంపోషకత్వాన్నైనా సాధించుదా మనే పట్టుదల లేకపోవడం; రాజకీయాలకూ, ప్రాంతీయ దురభిమానా లకూ తావు ఇవ్వకుండా, ఆహారధాన్యాల ఉత్పత్తికి అవసరమైన ప్రాజెక్టులకు ప్రాధాన్యత ఇచ్చి వున్నట్లయితే, స్వాతంత్ర్యం వచ్చిన ఇరవై ఏళ్ళ తరువాతకూడా తిండిగింజలకు కటకటలాడే పరిస్థితిలో మనం వుండేవాళ్ళము కాదు.

దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చెయ్యాలనే కోరికమంచిదేకాని, అవసరమైనవీ, అనవసరమైనవీకూడా పరిశ్రమలను స్థాపించడంకోసం గత పదిహేను సంవత్సరాలలోనూ సుమారు 2000 కోట్ల రూపాయలను వెచ్చించి, ప్రభుత్వం పారిశ్రామిక ప్రాజెక్టులను స్థాపించింది. ఆ పెట్టు బడి అలాగే వుండిపోయిందిగాని దానిమీద రాబడి ఏమాత్రం కనబడ లేదు. అవసరానికి మించిన ఉక్కు ఫాక్టరీలు, అనవసరమైన వైద్య పరికరాల ఫాక్టరీలాంటివి ఎన్నో కోట్ల రూపాయలను మ్రింగివేశాయి; వాటివల్ల ఫలితం ఏమీరాలేదు. ఇలా వృధాఅయిన డబ్బులో సగం ఖర్చు పెట్టినా, నాగార్జునసాగర్ నిర్మాణం పూర్తి అయి, కావలసినంత బియ్యంపంట లభ్యమవుతూండేది. భారతదేశంలో బియ్యంకొరత తీరాలంటే, నాగార్జునసాగర్ ప్రాజెక్టు, పోచంపాడు ప్రాజెక్టు,

సోమశిల ప్రాజెక్టుల నిర్మాణం పూర్తికావలసిందే. దక్షిణ దేశంలో, తమిళనాడు, కేరళ రాష్ట్రాలలోని నదీజలాలను పూర్తిగా వినియోగించడం ప్రస్తుతం జరుగుతున్నది. అంచేత, ఈ రెండు రాష్ట్రాలలోనూ నదీజలాల విషయంలో కొత్తగా నిర్మించడానికి ప్రాజెక్టులు ఏమీ లేవు. సరియైన ఉపయోగంలోకి రాకుండా వృథా అయిపోతున్న కృష్ణా, గోదావరీ జలాలను సక్రమంగా వినియోగించినట్లయితే, భారతదేశానికి కావలసిన బియ్యం పూర్తిగా లభించేటట్లు వ్యవసాయం చెయ్యవచ్చును. కాని, నాగార్జునసాగర్ లాంటి ఆంధ్రప్రదేశ్‌లోని వ్యవసాయ ప్రాజెక్టులకు కేంద్ర ప్రభుత్వం సరియైన సహాయాన్ని ఇవ్వలేదు.

కేంద్రప్రభుత్వం అవలంబించిన యీ పక్షపాత బుద్ధికి కారణం, కేవలం రాజకీయాలే. దేశక్షేమంకన్నా, రాజకీయాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం చాలా శోచనీయం.

ప్రస్తుతం, మన కేంద్రప్రభుత్వం లోటుబడ్జెటు విధానాన్ని అనుసరిస్తున్నది. విరివిగా కరెన్సీ నోట్లను అచ్చువేసి, వాటిని చెలామణీలోకి తేవడంవల్ల ద్రవ్యోల్బణం పెరిగి, అన్ని వస్తువుల ధరలూ ఆకాశానికి అంటుతున్నవి. ఈ కారణంచేత, నాగార్జునసాగర్ వ్యయం కూడా అంచనాలను దాటి, చాలా ఎక్కువ అయిపోయింది. ఎలాగా లోటు బడ్జెటే కనుక, ఎలాగా ద్రవ్యోల్బణం వుండనే వున్నది కనుక, యీ ప్రాజెక్టుకు కావలసిన డబ్బును యీ సంవత్సరంలోనైనా పూర్తిగా యిచ్చినట్లయితే, యీ ప్రాజెక్టు పూర్తిఅయి వచ్చే ఏటికైనా బియ్యం కరవు వుండకుండా వుంటుంది.

కేంద్రప్రభుత్వం యీ విషయాన్ని శ్రద్ధగా పరిశీలించేటట్లు మన రాష్ట్రప్రభుత్వమూ, పార్లమెంటులోని ఆంధ్రసభ్యులూ పట్టుపట్టగలరా!

# క్షణం లో - పగ

ఎర్రగా పండిన టొమోటో చితికినట్టుగా రోడ్డుమీద సాయంత్రపు ఎండ పడుతోంది.

అప్పుడే కాలేజీ వొదిలారు. అందరికంటె చివరివాడుగా సురేష్‌కుమార్ బయటికొచ్చాడు. స్టాటిస్టిక్సులో కలిగిన ఒకసందేహాన్ని లెక్చరర్ని అడిగి తెల్సుకోవడంలో ఆలస్యమైంది. అతను బి. కామ్. ఫైనల్ ఇయర్ చదువు తున్నాడు.

'సురేష్‌కుమార్ మంచివిద్యార్థి. అన్ని సబ్జక్టుల్లోనూ ఫస్టుమార్కులు తెచ్చు కుంటాడు.' అంటారు లెక్చరర్లు. 'సత్ప్రవర్తనలోకూడా అతను ఫస్టుక్రిందే వస్తాడు' అంటాడు ప్రిన్సిపాల్. 'వాడు పుస్తకాల పురుగు. పుస్తకాలూ, కాలేజీ, క్లాసూలూ - తప్ప మరో ప్రపంచం తెలియని బావిలోని కప్పలాంటి వాడు' అంటారు తోటి విద్యార్థులు. అట్లాంటి సురేష్‌కుమార్ ఆ సాయంత్రం అయిదుగంటలవేళ కాలేజీనుంచి ఇంటికి బయలుదేరి కాచిగూడా స్టేషనురోడ్డు ఎక్కాడు.

హఠాత్తుగా రోడ్డుమీద నడిచిపోతూన్న ఓ వ్యక్తిని చూశాడు. వయస్సు యాభై యేళ్లు వుంటాయి. కొంచెంగా నెరిసినగడ్డం, బుర్రమీసాలు, క్రూరమైన మొహం, సామాన్యమైన దుస్తులు. ఆ వ్యక్తి కేసి దృష్టినిలిపి కొన్ని క్షణాల పాటు తీవ్రంగా చూశాడు సురేష్‌కుమార్. వెంటనే అతని మొహంలో రంగులు మారాయి. మొహం జేవురించింది. కళ్లు చింతనిప్పులైనాయి. పెదవులు వొణి కాయి. వొళ్ళు కంపించింది. తల వెంట్రుకలు నిక్కపొడుచుకున్నాయి. రక్త నాళాలు కదంత్రొక్కసాగాయి. కాళ్ళక్రింద భూమి రెండుగా విచ్చిపోతూన్నది. శరీరమంతా కోపోద్రేకాల ద్వేషంతో, కసితో, ఆవేశంతో కుతకుతలాడిపో తోంది. ఏదో అవ్యక్తమైన ప్రేరణ ఉవ్వెత్తుగా లేచి మనస్సునంతా అగ్ని గుండంగా మార్చింది.

---

తాళ్లూరు నాగేశ్వరరావు

దగ్గర్లోవున్న సైకిలుషాపులోకి వెళ్ళి ఓ ఇనపకడ్డీ తీసికున్నాడు సురేష్ కుమార్. పరుగెత్తుకుంటూ వెళ్ళి రోడ్డుమీదపోతూన్న ఆ వ్యక్తి తలమీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు ఆ వ్యక్తి తల రెండుగాచీలింది. మెదడు బయటికొచ్చింది. రక్తం ఎర్రగా విరజిమ్మింది. రోడ్డుమీద వొరిగిపోయాడు. ఆ మరుక్షణంలోనే మరణించాడు.

సురేష్‌కుమార్ ఆ శవంప్రక్కనే నిలబడ్డాడు గంభీరమైన భ్రాంత్యావేశుడై, అయిదు నిముషాల తర్వాత పోలీసులు అతన్ని పట్టుకొని స్టేషనుకు తీసికెళ్లారు

* * * *

కోర్టులో హత్యావిచారణ ప్రారంభమైంది.

హత్యకుగల కారణాల్ని పోలీసులు తీవ్రంగా పరిశోధించారు. కాని వాళ్ళకేమీ లంగరందలేదు. కొండను సాంతం త్రవ్వినా ఎలుకకూడా బయటపడలేదు. గవర్నమెంటు హాస్పటల్‌కు చెందిన మానసిక విశ్లేషణావేత్తలు ఆ కేసును చేపట్టారు. విపరీతమైన పరిశోధన చేయసాగారు.

కోర్టులో కేసు విచారణదశలోనే ఉంది.

ఓ నెలరోజుల తర్వాత మానసిక విశ్లేషణవేత్తలు కోర్టువారికి తమ నివేదిక సమర్పించారు. అందులోని సారాంశం: "దాదాపు పదిహేనుసంవత్సరాల క్రితం సురేష్‌కుమార్ తండ్రి హత్యగావింపబడ్డాడు. అప్పుడు సురేష్ కుమార్ వయస్సు ఏడేళ్లు. ఆ హత్య సురేష్‌కుమార్ కళ్ళముందే జరిగింది. హంతకుని భీకరమైన ముఖం ఇన్నేళ్ళూ అతని మనసులో చెరగనిముద్రలా వుండిపోయింది. వయస్సు ముదరటంతో అతని గుండెల్లో అతనికి తెలీకుండానే ప్రతీకార వాంఛకూడా ముదిరిపోయింది. సురేష్‌కుమార్‌కు ఆరోజు సాయంత్రం రోడ్డుమీద తటస్థపడ్డ వ్యక్తి ముఖానికీ, నాటి హంతకుని ముఖానికీ తేడా లేకుండా కనపడేసరికి హఠాత్తుగా అతనిలో ప్రతీకారద్వేషం, పగా ప్రజ్వరిల్లి ఆ వ్యక్తిని హత్య చేయడానికి పురిగొల్పాయి. హంతకుడూ, హత్యకాబడ్డవ్యక్తీ కవలలని ఋజువు కావడం, ఈ కేసులో ప్రధానమైన విశేషం."

# "కార్యాలయ భూషణ్"

గెజెటెడ్ ఆఫీసర్ శఠగోపరావు రోజూ ఉదయం ఏడు గంటలకే ఆఫీసుకు వెళ్ళిపోతాడు. అప్పటికి ఎవరూ రారు. ఏం తోచదు కాబట్టి తన గదిలో దుమ్మంతా తనే దులుపుకొని, తన కూజాల్లో నీళ్లు నింపుకుని, ప్యూన్ వొచ్చేటప్పటికి అన్నీ సిద్ధం చేసుకుని వుంటాడు. గత రాత్రి ఇంటికి వెళ్ళిపోతూ తన సెక్షన్లో గుమాస్తాలు ఇచ్చిన కాగితాలకు హాయిగా పంకా కింద కూర్చుని సమాధానాలు రాసేస్తాడు. తన రూములోనే టైపుమిషను పెట్టుకుని ఉత్తరాలన్నీ తనే టైపు కొడతాడు.

అతనంటే పై ఆఫీసర్లకు బోల్డంత ఇష్టం. ఎంచాతంటే ఏ కాగితమూ అతని దగ్గర అడుగున పడిపోదు. అతని సెక్షన్లలో పనిచేసేవాళ్ళకూ అతనంటే ఇష్టమే. ఎందుకంటే అతను వాళ్ళకు ఏ పనీ చెప్పడు. వాళ్ళంతా హాయిగా రూముల్లో కూర్చుని ధూమపానం చేసుకోవచ్చు.

అతని సేవలకు మెచ్చిన ఆఫీసుచేత "కార్యాలయ భూషణ్" అనే బిరుదు అతనికి ఒక సుముహూర్తాన ప్రసాదించబడింది. ఆ సందర్భంలో జరిగిన అభినందన సభలో అందరూ అతన్ని విపరీతంగా పొగిడారు. అతను లేకపోతే ఆఫీసు పడిపోతుందన్నారు అందరి పొగడ్తలూ అయ్యాక గెజెటెడ్ ఆఫీసర్ శఠగోపరావు మాట్లాడుతూ ఇలా అన్నాడు;

"ఇల్లు కన్న గుడి పదిలం అనే సామెత నాకు వర్తిస్తుంది. నాకు పెళ్ళయిన దగ్గర్నించీ ఇంతవరకూ నాకు మా ఆవిడంటే చచ్చేటంత హడలు. అంచాత ఉదయం త్వరగా వొచ్చి సాయంకాలం ఆలస్యంగా వెళ్తాను. ప్రజాసేవచేస్తున్నానని మీరు పొరబడుతున్నారు కాని నా ఏకైక ధ్యేయం భార్యకు సాధ్యమైనంత సమయం దూరంగా వుండటమే!"

---

"గోపశ్రీ"



పవని నిర్మల ప్రభావతి

# తేరు తిరిగింది...

"వద్దు. వద్దు అది భగవంతునిసొమ్ము. అది దేవుడికే చెందాలి. ఆలయానికి సంబంధించిన వసతులకు ఉపయోగింపబడాలి. మనం దాన్ని హరాయించుకోలేం. దాన్ని మన స్వంతం చేసుకుని కోరి పాపపంకిలం పట్టించుకో వద్దు. నామాట వినండి. మనకు భగవంతుడిచ్చినదాంతో తృప్తి పడదాం!" వెనకనుంచి గోలగా అరుస్తున్న అన్నపూర్ణ కంఠస్వరం అంతకంతకూ పెద్దదై, వరండా మెట్లు దిగుతున్న ఆచారికాళ్ళకు సంకెళ్ళు వేసింది.

"ఏమిటా వెధవ్వాగుడూ? అట్టే పేలక! ఆడపీనుగవి. నీకేం తెలుస్తుంది మగాడి సంపాదన? అసలు నీకు సుఖపడేయోగం వుంటేకదూ? నీ ఖర్మ! నా బంగారుతల్లికి... లలితకు... చేయిస్తాను నగలన్నీ!" అన్నాడు చిరాకుగా, కోపంగా, పంతంగా.

"లలితకా? మన చిట్టితల్లికా? ఒద్దు. ఒద్దు... ఎందరో నిలువుదోపు లిచ్చిన సొమ్ము... ఎన్ని ఆపదల తాలూకు

మొక్కలదా సొమ్మ... ఆ పీడలన్నీ మన ఒక్కగానొక్క బిడ్డకు చుట్టబెడతారా? ఇక నాకు పిల్లలుపుట్టే అవకాశం కూడా లేదని మీకు తెలుసు. భగవంతుడు చల్లగా చూస్తే అంతేచాలు... నా బిడ్డకేమీ వద్దు!" ఆవేశంగా అరుస్తున్న అన్నపూర్ణ, ఆయాసంతో, మంచంమీద వెనక్కువాలింది మరి మాట్లాడలేక.

అన్నపూర్ణ పీక నులిమేయాలన్నంత కోపం వచ్చింది ఆచారికి. గబగబ వెనక్కి వచ్చి ఆమెవేపు మిర్రిచూస్తూ, అరిచాడు "నువ్వు నోరుమూసుకుంటావా లేదా?"

అన్నపూర్ణ నీరసంగా కళ్ళు మూసుకుంది. అస్పష్టంగా ఆమె పెదవులు గొణిగాయి. "నా నోరు మూయగలరు. కానీ దేవుడికళ్ళు మూయలేరు!"

"సర్లె.... వెధవపీడ!" చీదరించుక, గబగబ వీధిలోకి వచ్చాడు ఆచారి కంసాలి బ్రహ్మయ్య ఇంటివేపు అడుగులు పడుతున్నాయేగానీ, ఆలోచనంతా అన్నపూర్ణ మాటలమీదే వుంది.

"ఏం మనిషి? ప్రతిదీ భయమే... అలా అడుగడుగునా తనూ భయపడ్తూ కూర్చునివుంటే, ఈ నాడింత ఉచ్చస్థితిలోకి తను రాగలిగివుండేవాడా?"

అడుగులు ముందుకూ, ఆలోచనలు వెనక్కు... గతంలోకి పరుగులు తీసాయి...!

* * *

మొదట్లో, పాడుబడ్డ గోడలతో, విరిగిన మంటపాలతో, ఎండిన చెట్లమ్రానులతో, నానాగాభరాగా వుండేదీ ఆలయం! ఆచారి పేరుకు పూజారేగానీ, అర్చన అవసరం ఏనాడూ ఏర్పడింది కాదు... గర్భగుడి వెనకాల మంటపంలో తనూ, సుబ్రహ్మణ్యం, రాములు, అయ్యంగారు ఇంకా మరికొందరు కుర్రకారూ పేకాట ఆడుతూండేవారు అస్తమానూ!

కొత్తగా కాపురానికి వచ్చిన అన్నపూర్ణకు మాత్రం ఆచారివరసేం నచ్చలేదు.

"ఎందుకలా అస్తమానూ పేకాటలో మునిగిపోయి, ఆలయాన్ని మరింత పాడుపెడ్తున్నారు. కాస్త నలుగురినీ కూడవేసి ఆలయం బాగుచేయించండి. నిత్య పూజావిధులు నియమంగా నిర్వహించండి. ఇహమూ, పరమూ కలసి వస్తుంది!'' అని శత పోరటం మొదలెట్టింద. "నిత్యపూజావిధుల"న్న మాట అంతగా నచ్చకున్నా, అన్నపూర్ణమాటలతో ఓ మెరుపులాటి ఆలోచన వచ్చింది ఆచారికి! ఆనాటి అదృష్టంబావుండి, రోజు రోజుకూ గ్రామం పెరిగింది. పంచాయతీ వచ్చింది! గ్రామస్థాయిలో జరుగవలసిన న్యాయవిచారణ మాటెలావున్నా పార్టీలూ, పంతాలూ, పౌరుషాలూ, తెగింపులూ, పెరిగిపోయాయి. అది ఆచారికి, అతగాడి ఆలోచనకూ చక్కటి రాజమార్గమైంది.




నాయుడుగార్ని రెచ్చగొట్టి మంద పాలు బాగుచేయించాడు. అందులో బాగా కలిసొచ్చింది! రెడ్డిగారిని దువ్వి ఆలయంలో ఓ మూలగా శివలింగం ప్రతిష్ఠింప చేయించాడు. దాంతో బాగా విల దొక్కుకున్నాడు! వైశ్యులను ఉదర పెట్టి అదే ఆలయప్రాంగణంలో ఓ చిన్న రామాలయమూ, ఆంజనేయస్వామి గుడి, విష్ణ్వాలయమూ ఇంకోవేపుగా నవగ్రహకూటమి, పార్వతీమందిరం ... సుబ్రహ్మణ్యస్వామి–ఒకటేమిటి అప్పటి ఆలయప్రాంగణం స్మశానవాటికలా వుంటే, ఐదేళ్ళలో అది, అడుగుకో గుడి గుడికో దేవుడుగా పెరిగిపోయింది. సుబ్రహ్మణ్యం, రాములు, అయ్యంగారు, శఠగోపం, తన క్రిందనే–తనకు అనుకూలంగా వుండే వాళ్ళందర్నీ పూజారులుగా, నౌకర్లుగా, గుడికి సంబంధించిన పనివారలుగా మార్చేశాడు ఆచారి! గవర్నమెంటు అనాధీనం కొంత దేవాలయ మాన్యంగా మార్పించాడు మంచి ఆసాములను పట్టుకుని. గవర్నమెంటు గుర్తింపూ, గ్రాంటూ కూడా వచ్చాయి ఆలయానికి! ఓ హుండీ–క్యూ సిస్టమ్

కూడా ఏర్పాటయింది। పదేళ్ళ తిరిగే సరికి ఆలయంతోబాటు ఆచారి కూడా బాగా పెరిగాడు_గ్రామం టౌన్‌గా మారి నట్లు. రెండుమేడలూ, పదెకరాల మాగాణి పదిలపరచాడు.

పనిలో పని, గర్భగుడి వెనుకగా ఓ పెద్ద మంటపాన్ని మాంచి గది ఆకారంలో చేయించాడు ఆచారి. ఆ గదిలో రాత్రి పది దాటాక ఓ చిత్రమైన కోలాహలం బయల్దేరుతుంది.

పగలంతా "ఊర్ధ్వాయనమః ఓం
ఊర్ధ్వలింగాయనమః ఓం।"

అన్న కంఠాలన్నీ రాత్రి పదిదాటాక
"ఆసూనమః ఓం
కాసూనమః ఓం।" అంటూంటాయి।

అది మాంఛి లాభసాటి వ్యాపారమయ్యింది ఆచారికి। ఈమధ్య పెట్టిన కాలేజీతాలూకు లెక్చరర్లు కొందరూ, హైస్కూలుమాస్టార్లు కొందరు, ఊరిలోని మోతుబరులు, కుర్రకారు అంతా రాత్రయ్యేసరికి అక్కడ పోగవుతారు। ఈ చతుర్ముఖ పురాణపారణ దురంధరులందరికీ, లైట్లు, సిగరెట్లు, లైటర్లూ వెలిగించి ఇవ్వటానికి, చాపలూ, జంపకానాలూ పరవటానికీ చిన్నచిన్న కుర్రాళ్ళని, తను నెలజీతాలు ఏర్పాటుచేసి మరీ నియమించాడు ఆచారి। ఒక కొత్త పేక సప్లయి చేయిస్తాడు ఆచారి_ఆ కుర్రాళ్ళ చేత ఓ జట్టుకు. జట్టులోని వారందరూ తలకోరూపాయి ఇవ్వాలి పేక సప్లయి చేసిన కుర్రాడికి ... అలాగే పదిజట్లవారికీ। పది ఆటలు ఆడాక పేక నలిగిపోగానే, అది ఆచారి తీసుకుంటాడు. సగంధరకు చిన్నసైజు పేకాటరాయుళ్ళకి (రిక్షా కుర్రాళ్ళూ_వగైరాలకు) అమ్మేస్తాడు. కొత్త పేకల తాలూకు పై సంపాదన రోజుకు సగటున నాలుగు రూపాయలపైగానే వుంటుంది। ఆ పని కుర్రాళ్ళ జీతాలు పోను పైదంతా తనకే।

మరో కొత్తరకం "హుండీ" తయారుచేశాడు ఆచారి ఆ గదిలోనే। "రమ్మీ" లో గెలిచిన ఆసామీ ఆ హుండీలో (దేవుడికిగానూ।) ఐదు రూపాయిలు వేయాలి. "బ్రిడ్జి" అయితే మూడు। ఒక్కోరోజు తెల్లారుఝాము అయ్యేసరికి హుండీలో ఏభై, అరవై కూడా పడటంకద్దు। సుబ్రహ్మణ్యం, శఠగోపం, అయ్యంగారు వగైరాలు పడగఎత్తకుండా, నోరు మెదపకుండా వాళ్ళనోళ్ళు నేర్పుగా మూయించాడు ఆచారి. ఎక్జిక్యూటివ్ ఆఫీసర్ని మంచి చేసుకున్నాడు. ఎలా అయితేనేం, ఆ ఆలయానికి ఆచారి ముకుటంలేని మహారాజు అయిపోయాడు।

రోజురోజుకూ భర్తలోని మార్పూ, భర్త సంపాదనలోని రహస్యాలూ తెలుసుకుంటున్న అన్నపూర్ణ గుండె బేజారెత్తిపోవటం మొదలెట్టింది।

"ఆలయం బాగుచేయించారు _ అది నాకు సంతోషం। కానీ ఆలయంలోనే_




పవిత్రమైన భగవంతుని సాన్నిధ్యం లోనే మీరు చేస్తున్న ఘోరా లేమిటి ?" అంటూ నిలవెయ్యటం మొదలెట్టింది। మొదట్లో ఆమె ప్రశ్నలకు సమాధానంగా చిరునవ్వు నవ్వేవాడు. తర్వాత విసుక్కునేవాడు. రానురాను తాడి ప్రమాణాన లేవటం అలవర్చుకున్నాడు. లలితను ప్రసవించగానే అన్నపూర్ణకు బ్లడ్ ప్రెషర్, ఆయాసం, గుండెపోటు పట్టుకున్నాయి. ఇక కాన్పులురాకుండా చేసేసారు డాక్టర్లు ...

'అసలిలాంటి విషయాల్లో ఆడవాళ్ళు తలదూర్చకూడదు. దూర్చారో — వాళ్ళకు అనవసర ఆందోళన ఎక్కువౌతుంది। ఆరోగ్యం చెడుతుంది।' అన్నదే ఆచారి సిద్ధాంతం।

ఎందరో భక్తులు శేర్లకొద్దీనెయ్యి తెచ్చి దీపారాధన సెమ్మెలలో దిమ్మరిస్తారు. అది దీపారాధన కొండ కెక్కేంత వరకూ వుంచుతాడా చయనులు? వూహూఁ! ఒక జట్టు భక్తులలా కదిలి వెళ్ళగానే మూలనున్న తన సత్తు కారియర్ లోకి ఆ నెయ్యంతా వంచేసుకుంటాడు నూనే అంతే।

కొట్టిన కొబ్బరికాయ గిన్నెలన్నీ దేవస్థానం వారికి అప్పచెప్పాలన్న నియమం అవధానికి అసలే లేదు। తనకూ, అక్కడి నౌకర్లకూ — పోను మిగతావే మిగుల్చుతాడు। హారతిపళ్ళెం పట్టి — "హుండీలో వేయకండి... ఈ పళ్ళెంలో వేయండి కానుకలు!" అవి గుసగుసగా మంత్రాలలానే చెప్పి, వారు

వేయదల్చుకున్న పైసలు పళ్లెంలోనే వేయించుక రొండిని దోపుకుంటాడు పొంబళివం! ఇక సీతన్న, సుబ్బులు, యాదయ్యలాటి నౌకర్లు మాత్రం తక్కువా! "ఇటువేపు రాండిబాబూ! త్రోవ చూపుతాం! పిల్లలు జాగ్రత్త... కొబ్బరినీళ్ళు పడ్డా యిక్కడ! పాకుడుగా వుంది... అడుగు జాగ్రత్తగా వేయండి!" అంటూ మహా వినయంగా, పరోపకారమే తమ జీవన ధ్యేయమన్నంత తియ్యగా మాట్లాడుతూనే మరోవేపు "మీ శక్త్యానుసారం... ఇహిహీ...!" అంటూ చేయిజాపుతుంటారు! మరి వాళ్ళందరి భార్యలూ అన్నపూర్ణలా, లేనిపోని ఆలోచనలతో మంచం, మరణం అవుతున్నారా? ఆచారికి అందుకే అన్నపూర్ణంటే తగని చిరాకు... అన్నపూర్ణంటే ఎంత కోపమో ఒక్కగానొక్క పిల్ల లలితంటే అంత ప్రాణం.... ఆరేళ్ళ లలిత "బాలాంబిక"లా వుంటుంది!

మొన్నను - ఎక్జిక్యూటివ్ ఆఫీసర్ - పాపం ఈయన జాలి గుండె కలవాడు, ఎదుటివారి కష్టసుఖాలు ఆలోచించగల మంచి హృదయమున్నవాడు, స్వపర భేదం లేనివాడూ కాబట్టి - తనూ, ఆయనా గుంభనగా సాగిస్తున్నారు వ్యవహారం! ఎవరో గొప్పవారు నిలువు దోపు ఇచ్చిన నూటఇరవై నవరత్నాల సొమ్ములో-ఏభై నవరత్నాలు చెరిసగంగా పంచి - మిగతాది దేవస్థానం ట్రస్ట్‌కు జమ కట్టాడు. మహానుభావుడు! ఎవరైతేనేం? దేవుడులాటివాడు! ఆలాగే మరో సారి... మరోసారి... అయితే నేం? ఇంట్లో అన్నపూర్ణ ఆ సొమ్ము వేలేసి ముట్టదుకదా? ఆ మటుకూ భగవంతుడి సొమ్ము అపహరంగా ధరించటం అపరాధమని, తనకు నమ్మకస్తుడైన కంసాలి బ్రహ్మయ్యచేత అవి చెరిపించి క్రొత్త రూపాలలో తయారుచేయిస్తాడు. లేదా, భూమిగానో, ఇళ్ళగానో రూపాంతరం చెందిస్తాడు! అయినా అన్నపూర్ణ దదో మూర్ఖపు పట్టుదల...తను తాకదు, లలిని తను ముట్టుకోనివ్వదు.

* * *

"ఏమిటయ్యా బావా! అంత దీర్ఘాలోచనతో నడుస్తున్నావ్? కంసాలి బ్రహ్మయ్య యిల్లు దాటిపోయావు కూడా?" ప్రశ్న విని త్రుళ్ళిపడి గతస్మృతులలోనుంచి బయటికి వచ్చాడు ఆచారి. ఎదురుగా సోమయాజులు నిల్చొని నవ్వుతున్నాడు. ఆ సమయంలో సోమయాజులుపై లోలోపల మండిపడ్డాడు ఆచారి. 'వెధవ! అవులిస్తే పేగులెక్క పెడతాడు!' అనుకున్నాడు కసిగా. తడబాటు అణుచుకుంటూ "ఆహా! ఏంలేదు యాజులూ! పది రోజుల్లో రథోత్సవం జరిపిస్తానంటున్నాడు రామిశెట్టి. ఆ విషయమై



ఏర్పాట్లుగురించి, ఇలా ఆఫీసర్ గారింటి వేపు వెడుతున్నా... !"

"రామిశెట్టికూడా నీలానే అసాధ్యుడయ్యా బావా ! దేవుణ్ణికూడా వలలో వేసుకున్నాడు. కోస్తాలో వున్న కొడుకు బ్లాక్‌మార్కెట్ వ్యాపారం, లక్ష లాభం వస్తే పోయినేడాది తెప్ప తిరుణాల చేయించాడు. ఈ మారు రెండు 'లకారాలు' పలికింది కాబోలు రథోత్సవం ఎరగా వేశాడు ! మొత్తానికి నీ చేతినిండా పని _ చేతినిండా తడి..." నవ్వాడు సోమయాజులు.

"సర్లే...అవతల నాకు పనుంది. ఏమిటి విశేషాలు ?" మొహమాటం తోసివేయలేక నిల్చున్నాడు అచారి చిరాగ్గా !

"విశేషాలు నాకేమున్నాయి? వుంటే నీ కుండాలి. అన్నట్టు గర్భగుడి వెనకాల భజనమందిరంలో (పేక) భజన పెరిగి పోతోన్నట్లుందే ? మొన్న నెవరో ఓ కొత్త ఆసామీ రాత్రివేళా దైవ దర్శనం చేసుకుపోదామని వస్తే, గాలి గోపురద్వారం దగ్గర కాపలావున్న సీతిగాడు ఏమన్నాడో తెలుసా ? 'స్వామి

వారికి ఏకాంత సేవ జరుగుతోంది! పూజారులు తప్ప మరెవర్నీ లోపలికి వెళ్ళనివ్వం!" అని రంగున చెప్పేశాడు!' ఎంచక్కా తర్ఫీదు ఇచ్చావయ్యా స్వామీ! అది సరేగానీ బావా... నిన్ననే గుడికొచ్చాలే నేను. కొత్తగా వుంది విగ్రహం ముఖం ఏమిటి చెప్మా అని తికమక పడ్డాను కాస్సేపు...తర్వాత తెలిసింది ఈ విగ్రహా లన్నిటికీ కళ్లు కనిపించకుండా కళ్ళమీదుగా నామాలు దిద్దినట్లున్నావు?" కుతూహలంగా అడిగాడు సోమయాజులు!

"ఆ...ఆ! రాముడికీ, విష్ణుమూర్తికీ, ఆంజనేయ స్వామికీ – అందరికీ కళ్ళ చివరలు మాత్రం వదిలి. కళ్ళమీదుగా దట్టంగా నామాలు పెట్టాను–వేంకటేశ్వర స్వామిలా అందంగా, గొప్పగా వుంటుందని!" అన్నాడు ఆచారి గర్వంగా. నిజానికీ కొత్త అలంకరణ అతగాడి మనసు కెందుకో బాగా నచ్చింది!

సోమయాజులు పకపక నవ్వాడు.

"భలేభలే! మీరంతా చేసే వెధవ పనులన్నీ దేవుడు చూడకూడదనీ – ఇక ముందు చూడటానికి వీలు పడదనీ, దేవుడికళ్లు మూసేసావన్న మాట నామాలతో!" యాజులు అలాగే పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతూంటే, ఆచారికి కళ్లు మండిపోయింది

"యాజులూ, ఏమిటా పొగరు మాటలూ? దేవుడి చూపు నేరుగా ప్రపంచంమీద పడకూడదని అలా కళ్లు నిండిపోయేలా పెడతారు నామాలు..." ఆచారి మాట పూర్తికాకముందే అందుకున్నాడు సోమయాజులు.

"నీ విషయంలో మాత్రం నేను చెప్పిందే కరెక్టు. సర్లే...దేవుడి కళ్ళకు నామాలు దిద్దేంత ఘనుడివయ్యావ్! అవతల పనుంది వెళ్ళొస్తా!" సోమయాజులు వెళ్ళిపోయాడు. ఉడికిపోయాడు ఆచారి. ఈజడ్డివెధవ... ఈ సోమయాజులను మొదట్లో శివాలయంలో అర్చకుడిగా నియమించాడు తనే... నయానా, భయానా తన మార్గానికి తెచ్చుకోవాలని చూశాడు. వూహూం లొంగిరాలేదు. చివరకు విసిగిపోయి "నీకూ ముగ్గురు పగవెధవ లున్నారు యాజులూ! ముందుచూపు చూడు. కాస్త వెనక వేసుకుంటే, కుర్రవెధవల చదువులకు అక్కరకు వస్తుంది" అని బోధించాడుకూడా!

యాజులు నిర్లక్ష్యంగా నవ్వి – "బావా! నా బిడ్డల భవిష్యత్తు వాళ్ళ నుదటిమీదే వ్రాసివుంటాడు దేవుడు. కొత్తగా నేను తిరగరాసేదేమిటి? అందుకు దేవుణ్ణి దోచేదేమిటి? నాకీ వుద్యోగం వద్దు – ఎప్పుడో ఓనాడు గుడికి వచ్చివెళ్తుంటే భగవంతుడిమీద మనసు నిలిచేది. ఇక్కడ కొలువు కుదిరాక నీ బోధలూ, నీ అనుచరుల 'పూజలు' వినటం, దుర్భరంగావుంది. నా మానాన నన్ను




"పోనీ" అంటూ బయటికి వెళ్ళిపోయాడు. వాడి ఖర్మ! ఈనాడు వాడి ముగ్గురు కొడుకులూ వారాలు చేసుకుంటూ బి.ఏ., బి.ఎస్సి, ఎం.ఏ. చదువుతున్నారు. మరి వాళ్ళముఖాన అది వ్రాసివుంది. ఏం చేస్తాం. ఎవరిరాత వాళ్ళది. కసిగా అనుకున్నాడు ఆచారి కంసాలి ఇంటికి, వెనక్కి తిరిగివస్తూ.

* * *

"కనీసం ఈ రోజయినా అన్ని సొమ్ములూ పెట్టుకోండి నువ్వూ, లలితా. రథోత్సవం మన వీధిగుండా కూడా వస్తుంది. చూద్దాగానీ..." అన్నాడు ఆచారి ఆఖరుప్రయత్నంగా.

అన్నపూర్ణ కళ్ళు అగ్నిగోళాల్లా కణకణలాడాయి క్షణకాలం. "ఎందుకూ, తెరమీద వూరేగే దేవుడికి, తెరవెనుక భాగోతం తెలీదనీ, 'నీ సొమ్ము ఇదిగో మా దగ్గరుంది!' అని గొప్పగా తెలుపకోవాలనీనా మీ వుద్దేశ్యం?" అంది విసురుగా. మరీ ఈ పదిరోజుల్లోనే ఆమెలో ప్రేతకళ బయటపడినట్లనిపించింది ఆచారికి.

"నీ ఖర్మ! నీ కెలాగూ అనుభవించే రాత లేదు. నువ్వొద్దన్నా పిల్లదానికి పెడతాను సొమ్ము." పట్టుదలగా అరిచి, ఏడుస్తున్న లలితను బుజ్జగించి మరీ అలంకరించాడు నగలన్నీ. మెరిసిపోతున్న రాళ్ళనగలతో, వెలిగిపోతోంది లలిత 'బాలా త్రిపురసుందరి'లా.

"ఒద్దు...ఒద్దు... ఆ సొమ్ము తీసే యండి. మన బిడ్డ క్షేమంకోరి చెబుతున్నాను..." అరుస్తున్న అన్నపూర్ణ మాటలు వినిపించుకోకుండా, లలితను పిల్చుక వెళ్ళిపోయాడు ఆచారి.

తేరుమీద ఉత్సవ విగ్రహాలు జాగ్రత్తగా అమర్చబడ్డాయి. పూజారులు కూర్చోవటానికి దేవుడికొక్కస్త క్రిందుగా రథంలో చుట్టూరా 'మంచె' ఏర్పాటు చేయబడింది. రథమూ, ఇనుపచక్రాలూ రంగురంగుల పూలమాలికలతో, రంగురంగుల ముగ్గులతో అలంకరింపబడి వున్నాయి. పెద్దపెద్ద మోకులు పట్టుకుని రథాన్ని లాగటానికి సిద్ధంగా వున్నారు కొందరు కండలుతిరిగిన వ్యక్తులు.

ఈలోగా ఓ వేపు 'క్యూ'లో వస్తున్న జనాన్ని అదుపులో పెడుతూనే, మరో వేపు వాలుగుడబ్బులు చేతిలో పెట్టిన వారిని 'క్యూ'లో ముందుకు పోయి వుండేలా నేర్పుగా నెట్టేస్తున్నారు సీతన్న, రాములు వగైరా బంట్రోతులు.

"నాన్నా! నేను రథంలో నీ పక్కన కూర్చుంటాను" అంది లలిత తండ్రి వేపు చూస్తూ.

"కూర్చోమ్మా." అని పైకి అని – "నాకు అడ్డుచెప్పే దెవరు?" అనుకున్నాడు ఆచారి.

రథం కదిలింది. జనంలో భగవన్నామ స్మరణ అధికమైం దొక్కసారిగా! తనప్రక్కనే కూర్చోబెట్టుకున్నాడు లలితను జాగ్రత్తగా. టెంకాయలు, హారతులు, సాగిలబడి మ్రొక్కటాలూ, జనం త్రొక్కిసలాడిపోతున్నారు! ఆచారికీ, సుబ్రహ్మణ్యానికీ, అయ్యంగారికీ, శఠగోపానికీ క్షణం వెసులుబాటు చిక్కటంలేదు. టెంకాయలు అందుకోవటం, కొట్టడం, హారతి వెలిగించటం, ప్రసాదం తిరిగి ఇవ్వటం...

ఇంత చేస్తున్నా ఆచారి మెదడులో ఓ మూల ఆలోచన సాగిపోతూనేవుంది. ఈ ఉత్సవం పూర్తయితే, ఇక రామిశెట్టి చెయిచిక్కడు. అంచేత రథోత్సవం పూర్తికాగానే, ఎంత పొద్దుపోయినా సరే, రామిశెట్టిని ఒంటరిగా కలుసుకుని ఎవ్వరికీ తెలియకుండా తనకు ఒప్పుకున్న అయిదువందలూ వసూలు చేసుకోవాలి. ఇందులో ఆఫీసరుకూ వాటా వుండకూడదు.

తేరు తన వీధిలోకి వచ్చింది. అన్నపూర్ణ ఇప్పుడయినా బయటికి వచ్చి చూస్తుందో చూడదో? ఆలోచిస్తున్న ఆచారి భుజంమీద మెల్లిగా తట్టాడు సుబ్రహ్మణ్యం.

"గురువుగారూ! ఈ కాస్తదూరం మీ ముగ్గురూ అందుకోండి హారతి పళ్ళాలు. నేను తేరుదిగివెళ్ళి, దేవుడి అలంకరణ సరిజూస్తాను ఆలయంలో."

ఆచారి తలవూగించాడు. "ఆ... వెళ్లు...ఇదుగో చూడు 'నామం గడ్డ' బాగా అరగదీసి, తెల్లగా, మందంగా,

పెట్టు నామాలు. కంటిచివరలు మాత్రం కనిపించాలి విగ్రహానికి..." చెబుతున్న ఆచారి మాటలు గొంతుకలో వుండగానే......ఏదో కుదుపు......జనంలో హాహాకారాలు... అనుకోని సంఘటన. చిన్నగతుకులో రథచక్రం ఒరిగింది. చక్రంఒరగటంతో తేరుఒరిగింది కొద్దిగా.

"జాగ్రత్త జాగ్రత్త..." జనమూ, రథం లాగేవారూ గోలగోలగా అరుస్తున్న కేకలు...కనుమూసి తెరచేంతలో ఒరిగిన రథంలోనుంచి ప్రక్కకు జారి, క్రిందపడిన లలితనుగానీ, ఆ పిల్లను పట్టుకోబోయి తనూ దొర్లిన ఆచారిని గురించిగానీ ఎవరూ గమనించలేదు. గమనించేసరికి, రథచక్రాలు లలిత మీదగా, ఆచారి కాళ్ళమీదుగా దొర్లిపోయాయి. కబురుతెలిసిన అన్నపూర్ణ మరి కళ్ళుతెరవలేదు. కానీ ఇక్కడ తేరు ఒరిగిన సంగతి తెలియని సుబ్రహ్మణ్యం...తను పనిలోపనిగా తన్మరించిన పక్షిరూపాయులూ ఆ సందంగా రాండిలో దాపుకుని, దేవుడి విగ్రహానికి కళ్ళచివరలు మాత్రం వదిలి, మిగతా కళ్ళు మూసుకుపోయేలా చక్కగా, మందంగా, అందంగా, నామం గడ్డతో నామాలు దిద్దుతున్నాడు.

*     *     *

నీతి : దేవుడి కళ్ళకు నామాలు దిద్దే ఆచారికేకాదు, దేశమాత కళ్ళకూ సాటి ప్రజల కళ్ళకూ నామాలు దిద్దుతున్న, ఒద్దనున్న ఎవరి 'తేరు' అయినా ఏనాడో ఓనాడు 'ఒరిగి' తీరుతుంది.



# "లిటిగేషన్"

"సే కోర్ట్స్!" అంటూ గిరీశంగారు అందించినప్పటికీ, 'దేవుడు సృజించిన ప్రపంచములో యేమి వస్తువులున్నవి?' అనే ప్రశ్నకు, వెనకటికి పరధ్యానంలోపడ్డ వెంకటేశం "వెధవలు!" అనేశాడు. వెధవల్ అన్నది లాటిన్ మాటనీ, ఆ మాట కర్థం కచేరీ ఏనీ తరవాత గిరీశంగారు సమర్థించుకున్నా రనుకోండీ - పోతే, లిటిగేషనంటే ఒక్క కోర్టులలో వచ్చే తగాదాలే కాకపో వచ్చు. పెద్ద లిటిగేషనులో పడ్డానంటే, పెద్ద ఇబ్బందిలో పడ్డాననికూడా అర్థం చెప్పుకోవచ్చు.

వ్యవహారమైతే కోర్టుకి - లేదా కోర్టులో తీర్పుకొచ్చిన గొడవకి సంబంధించినదే - ఐనా, జూరీ పెద్దగా వ్యవహరించటమే సాంప్రదాయంగా ఉన్న సంశయాత్రావు. గొప్ప లిటిగేషనులోనే పడ్డాడు.

క్రిమినల్ కేసు, జడ్జీగారు వినడం పూర్తయింది. జూరీ అభిప్రాయం అడిగారు. జూరీ సభ్యులు వేరే గదిలోకి పోయి తలుపులు బిడాయించుకున్నారు.

అరగంట గడిచింది. సంశయాత్రావు. బయట కొచ్చాడు.

"మీ నిర్ణయం ఏమిటో చెప్పండి!" అన్నారు జడ్జీగారు.

సంశయాత్రావు ఒకసారి గొంతు సరిచేసుకున్నాడు.

"వాది చెప్పిందీ, వాది తరపు న్యాయవాదిగారు చెప్పిందీ విన్నాక ఏమనిపిస్తున్నదంటే, వాదిగారి కథనమే సరియైన దనిపిస్తున్నది, యువరానర్! అయితే, ప్రతివాదులు చెప్పిందీ, ప్రతివాదుల తరపు న్యాయవాదులు చెప్పిందీ కూడా విన్నాం గనక, ఏమనిపిస్తున్నదంటే, ప్రతివాదులు చెప్పిందే రైటనిపిస్తున్నది యువరానర్!" అన్నాడు సంశయాత్రావు.

వాది ప్రతివాదుల న్యాయవాదులంతా ఒకే మోస్తరుగా చకితులైనారు.

జడ్జీగారు తమ సందేహాన్ని సలహారూపంలో బయటపెట్టారు.

"మీ రిచ్చే తీర్పులో నేను జోక్యం కలిగించుకోకూడదనే అనుకోండి. అయినా, తెలీకడుగుతాను - మన్లో మాట. ఉభయపక్షాలవారూ రైటే అంటున్నారు కదా మీరు, అదెట్లా సాధ్యం, మిస్టర్ సంశయాత్రావ్?"

సంశయాత్రావు మరో పొడిదగ్గు దగ్గేశాడు.

"యువరానర్! ఇప్పుడేమనిపిస్తున్నదంటే, మీరే రైటని, పూర్తిగా నమ్మకం కలుగుతున్నది - యువరానర్!" అనేశాడు సంశయాత్రావు.

"బెనిఫిట్ ఆఫ్ డౌట్!" అనేస్తూ, ఒక నిట్టూర్పు విడిచారు జడ్జీగారువి. ✲

'శేఖర్'




# రేపు రాని కలలు..

ఇచ్ఛాపురపు జగన్నాథరావు

ఇరవై నిమిషాలనించి ప్రకాశరావు సరోజినిని గురించి చెప్తున్నాడు. పాతిక ఇప్పుడే నిండిన వయసులో, కొత్తగా మంచి ఉద్యోగం దొరికిన ఆనందంలో, చిరకాలంనించి పెరుగుతోన్న స్నేహితుడిగా నా దగ్గిర ఉన్న చనువులో, ఈ అమ్మాయి అనుకోకుండా అతన్ని జీవితాంతం భాగస్వామిగా స్వీక

రించిన విషయం అతను విపులంగా నాతో చెప్పడంలో ఆశ్చర్యం ఏం లేదు.

"ప్రతీ చిన్న విషయానికీ నొచ్చుకుం టుంది – ఎంతో సెన్సిటివ్‌గర్ల్ ... కిందటివారం ఆమె బర్త్ డే పార్టీకి పన్నెండు నిమిషాలు ఆలశ్యంగా వెడితే, ఆమెకి కన్నీళ్ళపర్యంతం ఐంది..."

ఎవరికీ చెప్పుకోలేని నా జీవితంలోని కొన్ని సంఘటనల్లోని రహస్యాలు అతనికి తెలీకపోవడంకూడా ఆశ్చర్యంలేదు. దెబ్బలుతిన్న మనస్సుకి తన సంభాషణ ఎలాంటి జ్ఞాపకాలు తెస్తున్నాయో, ప్రణయంలో అనుభవం లేకుండానే సఫలత పొందిన ఆనందంలో ప్రకాశరావు ఏమిటి గమనించగలడు? అతనికీ, నాకూ వయస్సులో వ్యత్యాసం తక్కువే అయినా, అనుభవాల్లో ఎంతో తేడా ఉంది. బాధ పడిపడి. హృదయంలో ఉన్న మార్దవం ముత్యాలలాగ గట్టిపడి ఆ బాధ ఇంక తెలియకుండా అయిపోయింది నాకు. వేదితగలకుండా, వెచ్చ వెచ్చగానే, సుఖంగా, ఆనందగా గమ్యస్థానం చేరుకున్న సంతోషంలో మరీ మార్దవం ఐపోయింది అతనిమనస్సు.

"...సిగరెట్లు కాలిస్తే క్షయో, కాన్సరో వొస్తుందని మహా భయం పిచ్చిపిల్లకి... దేనికీ కన్నీరుపెట్టని సరోజిని ఆ ఒక్క విషయంలోనూ మాత్రం ఆత్రుత దాచుకోలేకపోయింది...."

బ్రదర్! ఇది అపురూపంకాదు; సృష్టి ప్రారంభించాక నీ విషయంలో మాత్రమే తల ఎత్తుతూన్న విచిత్రంకాదిది ... పాదదాసిగా కలల్లో కనిపించి, భాగస్వామిగా దగ్గరికి వొచ్చి, భార్యగా జీవితంలో ప్రవేశించి యజమానిగా నిన్ను సుఖపెట్టే శిల్పంలో ఇది గతితప్పని సూత్రం అని ఎలాగ చెప్పేది?

"అందుకే సినీమాలు చూడ్డం మానేశావా?" అన్నాను దాచుకోలేని చిరునవ్వుతో. వారానికి మూడు సినీమాలు చూసే ప్రకాశరావు ఈ మధ్య బ్రతిమాలినా సినీమాలకి రావడంలేదు–ముఖ్యంగా అమెరికన్ సినిమాలైతే.

"నువ్వెంత చెప్పు, జగన్! అసలు సినీమాలే మరీ అసహ్యం ఐపోయాయి – అందులో ఇంగ్లీషువి మరీని... కళ్ళతో పాటు మనస్సునీ పాడుచేసేస్తాయి."

"ఆ మాట సరోజిని చెప్పిందా?"

"ఛా! ఆ అమ్మాయి అలాటిదికాదు... నువ్వు..."

ప్రకాశరావు ఆగిపోయాడు కొంచెం సందేహంతో.

"చెప్పు బ్రదర్!–నేను–?" అన్నాను సానునయంగా – నా చిరునవ్వు నేను ఎదురుచూస్తోన్నమాట నాలోకలిగించిన భావాలని దాచగలదనే విశ్వాసంతో.

"నువ్వు – సినిక్‌వి" అన్నాడు ప్రకాశరావు.

అబద్ధం కోపం తెప్పిస్తుంది.

నిజం–ఇలాటిది–బాధకలిగిస్తుంది.




నా చిరునవ్వుని పెద్దదిచేసి రెండూ దాచుకున్నాను. అత నన్నది నిజం – కాని, అతనే నమ్మడు.

నాతో అతనూ నవ్వేడు.

"సరోజినికి ఆరకం సినీమాలు అంటే విపరీతమైన అసహ్యం" అన్నాడు మళ్ళీ తనలోకాల చల్లదనాల్లోకి జారుకుంటూ, ప్రకాశరావు.

"ఇప్పుడు నీకూ సినీమా లంటే–"

"విపరీతమైన అసహ్యంలేదు బ్రదర్! కాని, ఆమెదీ నాదీ ఆ విషయంలో అభిరుచి ఒక్కటే..."

"గుడ్!" అన్నాను.

"నువ్వెన్ని చెప్పు – భార్యాభర్తలుగా జీవించదలుచుకున్న వాళ్ళకి అభిరుచులు ఒకటిగా ఉండాలి. ఏం?" అన్నాడు ఆశగా, ప్రకాశరావు.

నీరసంగా, "అవును – నా మాటలు లక్ష్యపెట్టకు. అవన్నీ హాస్యంగా అన్నవి" అన్నాను. ఆ విషయం చర్చించాలని కాదు. కారణం ఎప్పుడో జరిగిన ఒక విషయం జ్ఞాపకం చేసుకోవటం నాకు మరీ ఇష్టంలేదు. కోపం, పిరికితనం కలిసిన ఒక ప్రవర్తనలో జరిగిన ఆ ఉదంతం మరిచిపోయే ప్రయత్నం ఎంతో చేశాను.

ప్రకాశరావు మరేదైనా విషయం గురించి మాట్లాడితే బాగుండును...

కాని అతను హఠాత్తుగా వాచీ చూసుకుని, కుర్చీలోంచి ఒక్కసారి లేచి, "టైమయింది బ్రదర్! పోస్టాఫీసుకి వెళ్ళవస్తాను. సరోజిని ఉత్తరం రావాలి," అంటూ త్వరత్వరగా వెళ్ళిపోయేడు.

అప్పుడే వొచ్చిన ఇలస్ట్రేటెడ్ వీక్లీ

కాగితాల తిరగెయ్యడం మొదలుపెట్టేను- ప్రకాశరావుని గురించి జాలిపడాలో, అసూయపడాలో నిర్ధారణ చేసుకోలేక.

నూతన వధూవరుల చిత్రాల్లో హఠాత్తుగా కనిపించింది ఆమె చిత్రం ... హృదయం ఒక్కసారి ఆగినంత పని చేసింది ఆశ్చర్యంతో. కిందని పేరు చదివేను. అవును - ఆమె నిజంగా రాధ ...

* * *

రెండేళ్ళయింది నేను రాధని కలుసుకుని. అప్పటికి కలకత్తా వచ్చి మూడేళ్ళైపోయింది. ఆ మహానగరంలో కాలం ఎంతో చక్కగా గడిచిపోతూన్నా, దక్షిణదేశం రావాలని అనిపించడం ప్రారంభించింది.

ఆ రోజుల్లో తరుచు మాయ నాఇంటికి వొస్తూ ఉండేది. ఆమె వచ్చినప్పుడల్లా రసగుల్లా, పెసరట్ కావాలనేది. రసగుల్లామీద ప్రభుత్వం యుద్ధం ప్రకటించడాన్ని రిజెంట్ పార్క్ దగ్గరికి వెడితే కాని అవి దొరికేవికాదు. కాని, అంత దూరం డ్రైవ్ చెయ్యడం ఆమెకోసం పెద్దకష్టంగా అనిపించేదికాదు. స్నేహితురాలిగా, ఆప్యాయతలో అంతగా ముంచేది మాయ.

ఒకరోజు - నాకు ఆ రోజు ఇప్పటికీ నిన్నలాగ ఉంటుంది - బాగా వర్షం పడింది. నేను ఆఫీసునించి ఇంటికి వెళ్ళే ప్రయత్నంలో లేపబోతోంచే మాయ టెలిఫోన్ చేసింది - ఆ సాయంత్రం వొస్తున్నానని చెప్పడానికి.

ఆఫీస్‌నించి ఇంటికి వెళ్ళకుండానే తిన్నగా రిజెంట్‌పార్క్‌కి వెళ్ళేను. ఉదయం బాగా వర్షంకురిసి ఉందేమో, చాలాచోట్ల వర్షపునీరు కొంచెం కొంచెం ఇంకా రోడ్లమీదా, ట్రామ్ లైన్లమీదా కనిపిస్తూనే ఉంది.

నేను మాధురి - అది ఆ స్వీట్ షాప్ పేరు - చేరుకునేసరికి ఆరుదగ్గర కావొచ్చింది. వర్షం మూలాన కాబోలు, అక్కడ ఆట్టేమంది లేరు.

"రసగోలా కావాలి" అన్నాను.

దుకాణదారు కొంచెం సందేహంగా, "ఎన్నో లేవు-ఈ రోజు వర్షంమూలాన సరుకులురాక వస్తువులు తయారుకాలేదు. మీ కెన్ని కావాలి?'' అన్నాడు.

"కనీసం ఒకడజను...''

అతను ఒకకుండలో వెతికి, "పదే ఉన్నాయి...'' అన్నాడు.

"సరే" నన్నాను.

కుల్లడీలోవేసి మీదని ఆకుతోకట్టి నాకిచ్చేడు దుకాణదారు. నేను డబ్బుతీసే లోపున రాధ వొచ్చింది లోపలికి.

అందంగా, ఆర్ద్రంగా మాధుర్యం విరజల్లుతూ హృదయాలని కట్టిపడేసే కళ్ళు ఎన్నోపొందలు చూశాక కొంత స్థిరపడ్డాను - అప్పటిదాకా అలాగ అనుకున్నాను. రాధని చూస్తూనే మనస్సు విపరీతంగా చలించిపోయింది - అవయ




వాలలో చలనమేలేకుండా పోయింది. ఆమెది కేవలం సౌందర్యం కాదు. సర్వాంగాలనీ అతిక్రమించి చల్లగా, వెచ్చగా, అతిసున్నితంగా, మహాబలంతో అదృశ్యంగానే మనిషిని లొంగదీసుకునే శక్తి అది.

ఆమె రసగోలాలు కొనడానికి వొచ్చింది. తియ్యటి ఆ కంఠస్వరం ఆమె పరిపూర్ణతకే మెరుగులు పెడుతూంది.

సరుకులేదని విని, చాలా బాధపడ్డాను. ఈ విలాసినికి లేదని చెప్పే నీచత్వం వాడిలో ఎలా రాగలిగింది? కాని, నిస్సందేహంగా మాటలతో, చేతుల్తో, దుకాణదారు ఆ విషయమే చెప్తున్నాడు.

క్షణమాత్రం ఆమెలో లీనం అయిపోయిన నేను మళ్ళీ ఎదురుగా జరుగుతూన్న వాస్తవంతో మళ్ళీ ప్రపంచంలోకి ఒచ్చాను. డబ్బు ఇస్తూ నా పేకెట్ తీసుకోబోయాను.

"అమ్మ జన్మదినం ఇవేళ. రసగోలా లేకుండా ఎలాగ?"

ఎవర్నీ ఉద్దేశించకుండా సున్నితంగా వాపోయింది ఆమె.

హఠాత్తుగా బయట వర్షం ప్రారంభించింది.

"ఐదారైనా లేవా?"

నీరసంగా మళ్ళీ అడుగుతోంది.

"లేవు. ఉన్నవి ఆయన కిచ్చేశాను" అంటున్నాడు దుకాణదారు, నా చిల్లర లెక్కపెడుతూ.

"నేనెప్పుడూ ఇక్కడే అన్నీ కొంటాను..."

"ఆయనా అలాగే!"

దుకాణంలోకి వర్షపుజల్లు వొస్తూంటే కిటికీ మూసి, గదిలో రెండోదీపం వెలిగించాడు అతను.

"ఏం చేసేది ?..."

ఆమె దుకాణపు గాజుపెట్టెల్లో ఉన్న కొద్ది మిఠాయిల వొంక అనిష్టంగా చూసింది. సందేష్‌కూడా లేదు ఎక్కడా. రసగోలాతోబాటు సందేష్‌కూడా శత్రువర్గంలో చేర్చబడింది.

నిస్పృహగా ఆమె బయటికి నడవబోయింది. "అరే! వర్షం పడుతోంది. బస్‌కూడా దొరకదు" అంది.

ఎంత ప్రయత్నించినా నేను ఊరుకోలేకపోయాను. ఇంత చిన్న కాలంలో ఇన్నిబాధలు పడే అర్హత ఆమెకిలేదు.

"నా కారు ఉంది. ఎక్కడికి వెళ్లాలి మీరు ?" అన్నాను.

"భవానీపూర్...కాని, మీకు శ్రమ ఇవ్వాలనిలేదు." అంది ఆమె.

"శ్రమ ఏంలేదు. పదండి" అన్నాను.

"మీ రెక్కడికి వెళ్ళాలి ?"

"బాలీగంజ్..."

ఏదో అనబోయి ఆమె ఆగిపోయి, నా వెనకాలే వొచ్చింది. నేను కారు తలుపులు తీసేలోగా కొంచెం తడిసేను. ఆమెకూడా కొంచెం తడిసింది. వర్షం చాలా ఉధృతంగా వుంది.

అప్పుడే రోడ్డుమీద బాగా నీరు నిలిచిపోయింది. నెమ్మదిగా కారు వెనక్కి తిప్పి రోడ్డు పట్టేను.

"మీ పేరేమిటి ?" అంది హఠాత్తుగా ఆమె. నా ఆలోచనలు ముందరి రోడ్‌మీద ఉన్నాయి.

చెప్పేను.

"నా పేరు రాధ" అంది.

"చక్కటి పేరు" అన్నాను.

రాధ నవ్వింది.

"మీ రలాగ అంటారని అనుకున్నాను !" అంది.

ఆమె సాన్నిహిత్యం వెన్నెలవర్షంలాగ ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. ఇంద్రియాలు వేటికవి ఉద్రేకంగా నన్ను బాధిస్తున్నాయి. బయట వర్షం—డ్రైవింగ్ కష్టంగా ఉంది. రోడ్డుమీద బస్సులూ, ట్రాములూ నడవకపోయినా.

విండ్‌షీల్డ్‌మీద నీళ్ళు అనంతంగా నదుల్లాగ ప్రవహిస్తున్నాయి. వైపర్స్ శక్తికొద్దీ శుభ్రంచేసినా, లోపల గాలి లేక అద్దంనిండా తెల్లటి పూత మాటిమాటికీ శుభ్రం చెయ్యాల్సి ఒస్తోంది.

"ఆ పని నేను చేస్తాను" అంది రాధ.

రుమాలు ఇచ్చేను.

భవానీపూర్ చేరేసరికి నలభై నిమిషాలు పట్టింది. ఆమె ఇల్లు చూపింది. కారు ఆగగానే, "ధన్యవాదాలు – మీరు సహాయం చెయ్యకపోతే ఏమౌనో !" అంది.

ఆమె దిగి వెళ్ళిపోతుందనే విషయం ఒక్కసారి నన్ను కృంగదీసింది.



ఈ సలభై అయిదు నిమిషాల్లో ఆమె ఎంతో పాత స్నేహితురాలై పోయింది.

ఆమె దిగబోతుంటే చెయ్యిపట్టుకుని ఆపేను. ఆమె చెయ్యి విడిపించుకో కుండా కొంచెం ఆశ్చర్యంగా "ఏమిటి?" అంది.

"రసగోలా – మీరు పట్టుకెళ్ళండి."

"మీకు?"

"అంత అవసరం లేదు..."

"మీకు స్వీట్స్ అంత ఇష్టంకాదా?"

"చాలాచాలా ఇష్టం...కాని, మీరు అవి తీసుకుంటే ఇంకా తియ్యగా ఉంటుంది."

నవ్వి, "బాగా మాట్లాడతారు మీరు!" అంది రాధ.

ఆ కాంప్లిమెంట్ ఎంత సంతోషం తెచ్చిందో ఇప్పటికీ మరచిపోను నేను.

"అవి తీసుకోండి," అన్నాను.

"థేంక్స్..." అని పర్స్ తీసుకో డానికి చెయ్యి వొదిలించుకోబోయింది.

"అదేం పీల్లేదు-మీ అమ్మగారి జన్మ దినానికి నా శుభాకాంక్షలతో..."

ఏదో అర్థం అయినట్టుచూసి, "మరయితే... ఒక్క షరతు" అంది రాధ.

"ఏమిటి ?" అన్నాను. ఆమె చెయ్యి ఎంతో మెత్తగా, వెచ్చగా ఉంది.

"లోపలికి ఒచ్చి టీ తాగండి."

అలాగ పరిచయం అయింది రాధ. ఆమె రిజెంట్ పార్క్ దగ్గర ఏదో ఆఫీసులో పని చేస్తూవుండేది. రెండుమూడు నెలలు ప్రతిరోజూ ఆమెని కలుసుకుంటూ వుండేవాణ్ణి. అప్పుడు జీవితం అంతా ఆమెకోసం ఎదురుచూడ్డం. రోజంతా సాయంత్రంకోసం కలలు.

ఆమె కేవలం దైహికంగానే నన్నాకర్షించిందేమోనని నాకు సందేహం ముందర వచ్చినమాట నిజమే. కాని, ఆత్మ పరీక్ష చేసుకున్నాక ఆమె వ్యక్తిత్వం, ఆమెలోని అనేక విషయాలు నన్నాకర్షించాయని గ్రహించగలిగాను. ఆమెతో నా స్నేహం ఒక సాయంత్రపు వెన్నెలవర్షంకాదు. ఆమె నాకు గృహిణిగాకావాలి. ఆమె పరిపూర్ణత నాకూ శాశ్వతంగా, దగ్గరగా కావాలి. ఆమె నాకు కావాలి.

ఆ నిర్ణయానికి త్వరలోనే వొచ్చేను కాని, తొందరలో పనులు చేసే స్వభావం కాదు నాది. సృష్టిలో నిజంగా పూర్ణత్వం చెందిన మానవుడు లేడని నా నమ్మకం. ఆమె అంతా కాంతిలాగ నా కళ్ళకి కనిపించినా, ఆ కాంతికి అవతల దాచుకున్న చీకట్లనీ చూసి మరీ నిర్ణయించుకోవాలని నా నమ్మకం. హఠాత్తుగా ఇలాటి మచ్చలు చూడడంకన్న వాటి ఉనికిని అంగీకరించడం మంచిదని నా నిర్ణయం.

అందుకే ప్రచండంగా నన్ను ముంచెత్తుతోన్న ఈ వ్యామోహపు కెరటాల్లో మునిగిపోకుండా జాగ్రత్త తీసుకున్నాను. హఠాత్తుగా నన్ను జయించడానికి రాధ ప్రయత్నించిందని కాదు. ఆమె సాన్నిధ్యమే అలాటి ప్రభావం కలది.

ముందర రాధ నా సిగరెట్స్‌మీద దాడితీసింది.

"మగవాళ్ళెందుకు సిగరెట్ కాలుస్తారో అర్థంకాదు" అంది.

"తప్పేమిటి ?'' అన్నాను.

"వాసన- అశుచి" అంది రాధ.

నాకు కోపం వచ్చేలోపున రాధ నా కళ్ళల్లోకి చూసి లోపలి కోపాన్ని చల్లగా హరించేసింది. "నీ ఆరోగ్యం పాడైతే నాకు బ్రతుకెలాగ ? నా కోసం మానెయ్యవూ ?" అంది.

ఆమెని కాదనే శక్తి ఎక్కడిది ?

నేను ఓడిపోయాననే చిన్నతనాన్ని నానుంచి దాచింది రాధ. కాని, ఆమెలో ఒకటయినా చీకటితెర చూడగలగడం నాకు సంతృప్తిని ఇచ్చింది. ఆమె మానవులకి మరీ దూరంగా లేదు.

ఒక సాయంత్రం లేక్సకి వెళ్ళేం. షికారుగా నడుస్తూంటే "ఆదివారం డైమండ్ హార్బరుకి వెళదాం" అంది రాధ.

"సారీ - ఆ రోజు బ్రిడ్జి ఆడడానికి మాట ఇచ్చేను," అన్నాను.

చిన్నబుచ్చుకుని, "పేకాట అంత మంచి అలవాటు కాదు" అంది రాధ.

నేను ఆగిపోయాను. ఈమాట నాకేం నచ్చలేదు.

"నేను ఆడేది జూదంకాదు రాధా!" అన్నాను.

"అవును. జూదం అయితే నువ్వు ఆడవు" అంది రాధ.

"నీ కెలాగ తెలుసును?"

"సిల్లీ! నాకు నిన్ను గురించి తెలుసును. చెడు అలవాట్లు లేవు నీకు."

"నీ కన్నీ తెలీవు"

సవాలు చేస్తున్నట్టుచూసి, "నాకన్నీ తెలుసును" అంది రాధ.

ఈసారి నీరలు బాగా కవిపించాయి. నేను ఓడిపోదలుచుకోలేదు. కాని, ఆ క్షణంలోనే మా అత్యంత సాన్నిహిత్యం తగ్గడం ప్రారంభించింది.

మరికొన్ని చిన్నచిన్న విషయాలు క్రమంగా మా యిద్దరిమధ్యా దూరాన్ని ఎక్కువచేశాయి. అవన్నీ జ్ఞాపకంలేవు.

కాని, మా మధ్య విముఖత తెచ్చిన సంఘటన ప్రతిసెకనూ నా జ్ఞాపకాల్లో నిలిచిపోయింది.

ఆ రోజూ చిన్నవర్షం పడుతూంది.

"మాధురికి తీసికెళ్ళు" అంది రాధ.

వెళ్ళేము. ఆమె స్వీట్స్ తింటూంది. నేను సమోసా తింటున్నాను.

"సందేష్ తిను" అంది రాధ.

"వొద్దు - నాకు స్వీట్స్ అంత ఇష్టం లేదు," అన్నాను.

బాధగా, కొంచెం కోపంగా, నావొంక చూసి, "నీకు అబద్ధాలాడడం బాగా వొచ్చును," అంది.

నే నేం అనలేదు. ఒక్క అబద్ధం మాత్రమే ఆడేనని ఆమెకి చెప్పి ఏం ప్రయోజనం?

"మరి, ఇక్కడ స్వీట్స్ ఎందుకు కొంటావు?"

"ఒక ఫ్రెండ్‌కోసం."

"ఎవ రావిడ?"

"మాయ."

"ఎలాగ ఉంటుంది?"

"బాగానే వుంటుంది."

"నీ కెలాగ తెలుసును?"

"ఒకసారి పార్టీ ఏదో జరిగితే అక్కడ పరిచయం అయింది"

"నీ ఇంటికి తరచువొస్తుందా?"

"బుద్ధి పుట్టినప్పుడల్లా."

"ఆమెకి పెళ్ళి అయిందా?"

"ఆఁ."

"మరి?"

ఆశ్చర్యంగా చూశాను.

"ఏమిటి, మరి?" అన్నాను.

"ఆయన ఏమీ అనడా?"

"ఎందుకని?"

"అలాగ పదేపదే నీ ఇంటికి ఒస్తే"

తాగుతున్న టీ టేబిల్ మీద పెట్టి రాధ ముఖంలోకి పరీక్షగా చూశాను.

"నీ ఆలోచనలు బాగులేవు రాధా!" అన్నాను. లోపల ప్రజ్వరిల్లుతోన్న కోపం జీర నా గొంతుకలోకి వొచ్చి ఉండాలి.

"నీ పనుల్లాగే, జగన్!"

నా కోపాన్ని ఎలాగ ఆపుకున్నానో నా కిప్పటికీ ఆశ్చర్యమే. ఈమెతో నా ప్రణయాన్ని ఆశీర్వదించి, తల్లి లాగ సంతోషపడ్డ మాయ ఒక్కసారి నన్ను ఎక్కడినించో ఆపి ఉంటుంది।

రెండునిమిషాలు మాట్లాడలేదు నేను. కోపం కొంచెం తగ్గాకలేచి, "పద - పోదాం." అన్నాను. అదే మా చివరి సమాగమం అని నాకుతెల్సును అప్పటికి.

"నువ్వు వెళ్లు"

"ఇంటిదగ్గర వొదలనీ"

"బస్సు ఉంది."

నేను వెళ్ళిపోయాను.

తరవాత ఆ సాయంత్రం ఏం జరిగిందో నాకు జ్ఞాపకంలేదు - రాత్రి ఎప్పుడో మాయ నన్ను అన్నం తినమని బలవంతం చేయడంతప్ప.

ఆ తరవాత మూడునెల్లు రాధని చూడలేదు. చాలాసార్లు ఆమె టెలిఫోన్ చేస్తుందనే ఆశతో ఫోన్ పక్క ఎదురు చూసేవాణ్ణి. కాని ఆమె జాడ లేదు. ఆమెమీద ఎంతకోపం ఉన్నా, అది ద్వేషంగా ఎప్పుడూ మారలేదు. తాత్కాలికంగానైనా నా హృదయంతో హృదయం కలిపి స్పందించిన రాధ నా మనస్సుని ఎప్పుడూ వొదిలిపోలేదు. కాని అజేయంగా ఆమె నన్ను తనదగ్గరికి తీసుకోలేకపోయింది.

నాకు కలకత్తానించి ఆ రోజుల్లోనే ట్రాన్స్ఫర్ అయింది. ఒకసోమవారం సాయంత్రం మద్రాస్ మెయిల్ లో ప్రయాణం. ఆ ఆదివారం చివరిసారిగా ఆ మహానగరంలో అగమ్యంగా తిరగ సాగాను. వెయ్యిలోపాలూ, లక్ష బాధలూ ఉన్నా, ఆ నగరం అంటే నా కెంత అభిమానమో ఆ రోజు తెలిసింది.

సాయంత్రం బాతోంచే రిజెంట్ పార్క్ వేపు వెళ్ళేను. హఠాత్తుగా మాధురి కనిపించింది. కారు పార్క్ చేసి లోపలికి వెళ్ళే ఆలోచనలోపడ్డాను. ఆ చివరి సాయంత్రం తరవాత మళ్ళీ ఆ పరిసరాలకైనా రాలేదు నేను. కాని ఈరోజు ఆ చోటునించీ సెలవు తీసుకోవాలి....లోపల లోపల నొప్పిలాగ ఏదో బాధ. అడుగు వేస్తోంటే ఎంతో ఆవేదన. మాధురికి దగ్గిర పడకొద్దీ నాకు రాధ మరీ దగ్గిర పడింది.

లోపలికి వెళ్ళేను. చాలా మంది ఉన్నారు. దుకాణదారు నన్ను చూసి పలకరిస్తూ, "చాలాకాలం అయింది, రాలేదేం?" అన్నాడు.



నా మాట అతనికేం చెప్పను? ఇక్కడే నా జీవితంలో మధురాతి మధురమైనరోజూ, మరచిపోని దుఃఖం కలిగించిన రోజూ తెచ్చే జ్ఞాపకాలు నన్నక్కడికి రానివ్వ లేదని ఎలాగ చెప్పను?

ఫేమిలీస్‌కోసం ఉంచిన ఒకబూత్‌లో నన్ను కూర్చోబెట్టి నా ఆర్డర్ తీసుకున్నాడు. కొంచెం ఆలశ్యం అవుతుంది – తాజాసరుకు తెస్తానని చెప్పి దుకాణదారు వెళ్ళిపోయాడు.

జ్ఞాపకాలన్నీ మేఘాల్లాగ ముసురు కుంటున్నాయి. నా అనుభవాలకి కారణం ఏమిటి?

ఆమె రుచులువేరు – నా రుచులువేరు. అందుకే ఇద్దరం కలుసుకోలేం.

పదినిమిషాల తరవాత తెరతీసి మళ్ళీ దుకాణదారు లోపలికివొస్తూ, దరహాసంతో, "క్షమిస్తారనుకుంటాను. ఆమెకి ఇక్కడే సీటువుంది." అంటూ రాధని ప్రవేశపెట్టేడు.

క్షణికంగా ఆశ్చర్యంతో నిశ్చేష్టుణ్ణయిపోయాను. లేచినిలబడేలోగా రాధ ఎదురుగా కూర్చుంది.

"హల్లో," అన్నాను.

ఆమె నావొంక ఒకసారిచూసి, తల వొంచుకుంది. "మీరు – నువ్విక్కడికి ఎలాగ వొచ్చావు?" అంది.

"నీలాగే!" అన్నాను.

ఆమె మనః పరిస్థితిని అర్థం చేసుకుని, జాలిపడ్డాను. ఆమె ఏదో చెప్పబోతోంది. కాని, చెప్పలేకుండా ఉంది. కొంచెం సేపు పోయాక తేరుకుంది.

"నేను — నే నిక్కడికి రోజూ వొస్తున్నాను..."

"నిజంగా?"

"ఆఁ..."

మా ఆర్డర్ల ప్రకారం స్వీట్సూ, సావరీస్, టీ వొచ్చాయి.

ఆమె ఆ చోటుకి రోజూ రావడం గురించి ఆలోచిస్తూ ఎలాగో తినడం, టీ తాగడం ముగించాను. అంతకు ముందే ఆమెకూడా ముగించింది.

బిల్లు చెల్లించి బయటికి నడిచాను — రాధ నా పక్కనే. నన్ను తాకకుండా జాగ్రత్తపడుతూ నడుస్తూంది. అనుకోకుండా సంభవించిన ఈ సమాగమం పాతగాయాలని తిరిగి బయటికి తెస్తుందో, కొత్తగా మరో అధ్యాయం తీయిస్తుందో తెలియలేదు — ఆ క్షణాల కలవరం అలాటిది.

కారు తాళంతీసి ఆమెని ఎక్కమన్నాను.

"ఎక్కడికి?" అంది రాధ

భారంగా ఉన్న దుఃఖాన్నో, భావోద్రేకాన్నో ఆమె కష్టంగా దాచుకుంటూన్న సంగతి బోధపడింది. కాని, నే నేం చేసేది? ఆమెకీ నాకూ సరిపడదు. ఆ అందం వెనకాల నాకు కావలసిన ఆత్మసౌందర్యంలేదు. అది ఉంటే ఆమెని భరించలేక పోయేవాడిని. కానీ— అది లేకపోవడంతో ఆమెని నేను సహించలేకపోయాను.

"ఇంటిదగ్గర వొదుల్తాను."

"వొద్దు — నేను బస్‌మీదపోతాను" అంది రాధ.

"నీ ఇష్టం — కాని నీ దగ్గర సెలవు తీసుకోనీ .." అన్నాను.

"ఏమి టది?"

"మెడ్రాసు వెళ్ళిపోతున్నాను ట్రాన్స్ఫరై..."

నీరసంగా కారుకి జేరబడింది రాధ. నా కెంతో జాలివేసింది. కాని, ఆమెనించి దూరమయ్యాక నేను సమీపానికే రాలేని మాధురికి ఆమె ప్రతిదినం వొస్తూ ఉండేదన్న విషయం మరిచిపోయేటంత జాలికాదు. మా మనస్తత్వాలలో ఉన్న విపరీత విభేదాలని మరపించేంతకాదు.

"సారీ . నన్నింటిదగ్గర విడు"

రాధ కూర్చుంది. కారు ఆమె ఇంటికి చేరేదాకా ఆమె ఏమీ మాటలాడలేదు. దిగబోయేముందు, "ఏ రైల్లో వెడతావు?" అని అడిగింది.

"మంగళవారం, మెయిల్లో."

"స్టేషన్లో కలుసుకుంటాను" అని, రాధ కారుదిగి త్వరగా లోపలికి వెళ్ళి




పోయింది. నేను మాయ దగ్గరకి వెళ్ళి ఆ మిగిలిన సాయంత్రం ఎలాగో గడిపాను.

ఆ తరవాత రాధని చూడ్డంగాని, ఆమె ప్రసక్తి రావడంగాని జరగలేదు ఇవేళ ప్రకాశరావు, ఈ పత్రికా ఆ జ్ఞాపకాలన్నీ మళ్ళీ తెచ్చేదాకా.

ఇవన్నీ హృదయాన్ని బాధపెట్టినా, రాధ విషయంలో నాకు పశ్చాత్తాపం లేదు. మా లోకాలు వేరు- విడిపోవడం కన్న శ్రేయస్కరం అయినదిలేదు. కాని నన్ను సిగ్గుపరిచినది నా పిరికితనంలో ఆమెకి ఆ మరునాడుకాక, మూడోనాడు బయలుదేరుతున్నట్టు చెప్పడమే. ఆ అసత్యం నన్నెంతో కలవరపెట్టింది రాధ అనవసరంగా స్టేషన్‌కి వచ్చి ఉంటుందనికాదు. నా ప్రవర్తనలో ఆమెముందు నన్ను నేనే కించపరచుకున్నానని. ఆమె నా కన్న ఎంతో హుందాగా ప్రవర్తించిందే అని.

ముల్లులాగ ఆ పిరికి అబద్ధం ఉండేవుండే గుచ్చుకుంటూ ఉంటుంది-ఇవేళలాగ.

* * *

ప్రకాశరావు వొచ్చి "నీకూ ఉత్తరం ఒచ్చింది జగన్" అంటూ ఒక కవరు ఇచ్చేశా. ఇందాకా ఖాళీచేసిన కుర్చీలో కూర్చుని సరోజిని ఉత్తరం అతను

చదువుకుంటూంటే నా ఉత్తరం నేను విప్పి, కింద సంతకంచూసి, ఆశ్చర్య పోయాను. రాధ ఉత్తరం రాసింది :

"జగన్ :

మనమధ్య ఏమీలేదు - ఒక జ్ఞాపకం తప్ప. అది నీకూనాకూ చివరి నిశ్వాసాల దాకా ఉంటుంది.

నువ్వు చేసినది మంచిదా, కాదా అన్నదానికి జవాబులేదు-కాని, నా జీవితం నేను జీవించాలి. అందుకే, గృహిణిగా రేపటినించి మరొకచోటికి వెడుతు న్నాను.

ఈ కొత్తజన్మ ఎత్తేముందు ఒక్క మాట నీతో చెప్పాలి. నువ్విక్కడినించి మెడ్రాసు వెళ్ళేరోజున స్టేషన్‌కి వస్తా నని వాగ్దానం చేసి పిరికితనంలో రాలేక పోయాను. అందుకు క్షమాపణ కోరు తున్నాను. నీతో నేను చేసిన వాగ్దాన భంగం అదొక్కటే !

ఎన్నో శుభాకాంక్షలు నీకు !

— రాధ."

ఉత్తరం జాగ్రత్తగా మడిచి జేబులో పెట్టుకున్నాను. ఇది నాకు సంతోషం కలిగించాలో, నా అహంకారానికి మరొక దెబ్బకొట్టాలో తెలియలేదు.

"జగన్ ! డికెన్స్ రాసిన పుస్తకం ఏదయినా ఉంటే ఇస్తావా ?" అని అడుగుతూ ప్రకాశరావు నన్ను ఆలోచనల్లోంచి ఇవతలకి తెచ్చాడు.

"ఐదారు ఉన్నాయి-" అని "అరే! నీకు డికెన్సా ? పెర్రీమాసన్ ఒదిలేశావా ?" అన్నాను ఆశ్చర్యంగా,

"సరోజిని లిటరేచర్ స్టూడెంట్ కదా !...ఆమె అభిరుచి కొంత తెలిసి వుంటే మంచిదని నేనే రాశాను ఏం పుస్తకాలు చదవమంటావని... వైవాహిక జీవితంలో ఇద్దరికీ ఇలాటివాటిలో సామరస్యం ఉండాలి ఏం ?" అని ముగించాడు భవిష్యత్తులోకి చూస్తూ, ప్రకాశరావు.

"అవును. అది చాలా మంచిది !" అన్నాను గతాన్ని స్మరిస్తూ. ఆ క్షణంలో అతనిమీద అసూయకలిగింది.

బయట బరువుగా వర్షం పడసాగింది.




# చెప్పులో రాయి

నెమలూరి భాస్కరరావు

సుబ్బారావు నిక్కచ్చైన మనిషి అనుకుంటారందరూ. బ్రతకనేర్చిన వాడనికూడా ప్రతీతి. అతనో చిన్న కిరాణాదుకాణం యజమాని. కొట్టు చిన్నదే అయినా సుబ్బారావు బుర్ర పెద్దది. అతని వ్యాపార సరళి, ప్రపంచానుభవం పెద్దవి ధనం విలువ గుర్తించిన వాడనికానీ, పీనాసనికానీ, రెండింటిలో ఏదయినా అనుకోవచ్చు. అతను ప్రతిపైసను జాగ్రత్తగా కూడబెడతాడు. అలాగే ఖర్చుపెడతాడు. ఇంత పీనాసి అనుకునే సుబ్బారావు దుస్తుల విషయంలో మడత చెరగనివ్వకుండా నీట్‌గా వుంటాడు. సినిమాలు చూస్తాడు, సిగరెట్లు త్రాగుతాడు – విపరీతంగా మాత్రంగాదు. సుబ్బారావు కథలు చదువుతాడు – కామెంటు చేస్తాడు. ఆవగింజ దగ్గర్నుంచి, అణువువరకూ తెలిసినట్లే ధారాళంగా మాట్లాడగలడు. ఇది అతన్నిగురించి ఉపోద్ఘాతం.

సుబ్బారావు దుకాణంలో కూర్చుని బజార్నపోయే జనాన్ని తిలకిస్తున్నాడు. అతని ముందున్న చిన్న తాటాకు చాప మీది బెల్లం అచ్చుమీద ఈగలు ఝుంయ్ మని వాల్తున్నాయి. సుబ్బారావుకి విసుగ్గా వుంది – చిరాగ్గానూవుంది. అందుక్కారణం అంతకుముందు గంటసేపటినుంచి బేరగాళ్ళెవరూ రాకపోవటమే. పైగా ఆ రోజు శనివారం. ఆ బజారులో ఉన్న చాలా దుకాణాలకు ఆ రోజు శలవుదినం.

బేరం పెరగాల్సింది పోయి దల్గా వుందేమా అని ఆలోచిస్తున్నాడతను. ఆలోచనలనుండి చటుక్కున తేరుకుని "రా! వీరయ్యా! రా! ఏం ఈ మధ్య అసలు కనపడటంలేదు?" అంటూ ఆహ్వానించాడు అప్పుడే చేతిసంచితో దగ్గరకు సమీపించిన ఓ ముసలాయన్ని.

"ఏం కనపడతాం బాబూ. ధరలు చూదొస్తే మండిపోతున్నాయి. ఎనకటి రోజుల్లో రూపాయి సరుకులు కొంటే బండిమీదేసు కెళ్ళాల్సొచ్చేది" అంటూ అక్కడే వున్న జాజిచక్కల పెట్టిమీద కూర్చుంటూ చేతిలోవున్న చీటీ సుబ్బా రావు కందించి, నూనెసీసాలు ప్రక్కనే వున్న వుప్పుతొట్టిలో పెట్టాడు.

"ధరలు పెరగటం వక్కటే కారణం కాదు వీరయ్యా! డబ్బు విలువకూడా చచ్చిపోయింది. పూర్వం నువ్వు బండి కడితే స్టేషన్‌నుంచి వూళ్ళోకి బేశా ఇచ్చేవాళ్ళు ఇప్పుడు రూపాయిన్నర ఇస్తున్నారాలేదా?" అంటూ పొట్లాలు కట్టడం ముగించి, చీటీమీద ధరలువేసి కూడిక ప్రారంభించాడు.

"అవును గానీ, పాత చింతపండుందా?"

"అరెరే. ఇందాకనే ఓ మణుగుంటే అమ్మేశాను. కొత్తపండుంది తీసుకెళ్ళు. బంగారంలాంటి సరుకంటే నమ్ము" అంటూ చింతపండుకూడా తూచి పొట్లం కట్టాడు సుబ్బారావు.

"మొత్తం ఎంత అయింది?"

"ఐదురూపాయల ఎనభైపైసలు."

"ఓ పదిపైసలు తక్కువయింది. రేపు తెచ్చిస్తాను బాబూ!" అంటూనే డబ్బులు త్రాసు పళ్ళెంలో పోశాడు వీరయ్య.

"చూడు వీరయ్యా. ఓ మాట చెపు తాను ఏమనుకోకు. వెధవది పదిపైసలు, అయిదుపైసలు అప్పుపెడితే నీకూ గుర్తుండదు. నాకూగుర్తుండదు. పదిమంది పదిపదులు అప్పుపెడితే నాకు రూపాయి నష్టం. ఇంతా ఏడిస్తేనా కొచ్చేలాభం రూపాయికి అయిదుపైసలు."

"ఇంతా ఇచ్చినవాడిని పదిపైసలు వుంటే అప్పుపెడతానా? లేవుబాబూ! రేపు ప్రొద్దునే తెచ్చి యిస్తానుగా" అన్నాడు వీరయ్య.

"వ్యాపారం అన్నాక వ్యాపారమే వీరయ్యా! ఇంత బాధెందుకు చెప్పు. ఓ పదిపైసల సరుకులు తగ్గించి తీసు కుంటే నీకూ ఇబ్బందిలేదు, నాకూలేదు." అంటూనే పొట్లం వూడతీసి ఓ గుప్పెడు మిరపకాయలు తనప్రక్కనే వున్న డబ్బాలో పోసుకున్నాడు సుబ్బారావు. వీరయ్య మాట్లాడకుండా సరుకులు సంచిలో సర్దుకోసాగాడు.

"పాపం! పెద్దవాడి వయిపోయావ్ వీరయ్యా!" అని ఇంకా ఏదో అనబో తున్నాడు సుబ్బారావు. వీరయ్య సంచీతోసహా వెళ్ళిపోయాడు.

"వెధవలు. ప్రతివాడికీ ఇదొకటి అలవా టయిపోయింది. పదిపైసలో, అయిదో అప్పుపెట్టటం. అడక్కపోతే ఎగ్గొట్టటం" కసిగా అనుకున్నాడు సుబ్బారావు.

* * *

ఆ మర్నాడు ఆదివారం సుబ్బారావు దుకాణానికి శెలవు. మధ్యాహ్నం భోజనం చేసి, ఇస్త్రీగుడ్డలు వేసుకుని, ఏదో పర్మిట్ విషయం తహసీల్దారుగారితో మాట్లాడేందుకు బయల్దేరాడు సుబ్బారావు. వేసవికాలపు మండుటెండ చిటపటలాడుతోంది. హుషారుగా సిగరెట్ ముట్టించి నడకసాగించాడు సుబ్బారావు. తహసీల్దారుగారిల్లు నాల్గుఫర్లాంగుల దూరాన వుంది. నడుస్తున్న సుబ్బారావు హఠాత్తుగా ఆగిపోయి కాళ్ళకేసి చూసుకున్నాడు. ఎడంకాలి చెప్పు వుంగటం తెగిపోయి ఓ మూలకు వ్రేలాడుతూ కనిపించింది. సుబ్బారావు హుషారంతా నీరు కారిపోయింది. కాలితోనే చెప్పును ఈడ్చుకుంటూ తీసుకు వెళ్ళి రోడ్డు ప్రక్కన చింటచెట్టుక్రింద కూర్చున్న చెప్పులకుట్టే వానిముందు పడవేశాడు.

"పదిపైసలవుతుంది బాబూ!" తెగిపోయిన సుబ్బారావుచెప్పు చేతిలోకి తీసుకుంటూ అన్నాడు అతను. "సరే కానీయ్" అన్నాడు సుబ్బారావు. అతను పని ప్రారంభించాడు. చెప్పులేని ఎడం కాలు భూమిమీద వేడిగా కాలుతోంది. సుబ్బారావు విసుగ్గా ఫీలయ్యాడు. కాసేపటికి

"తొడుక్కోండి బాబూ!" అంటూ చెప్పును కాలిముందు పెట్టాడతను. సుబ్బారావు చెప్పుతొడుక్కుంటూనే ప్యాంట్ జేబులో పర్సుకోసం చెయ్యిపెట్టి ఆశ్చర్యపోయాడు. పర్సులేదు! అప్పుడుగానీ గుర్తుకు రాలేదతనికి, మనీపర్సు తనింటి దగ్గర విడిచేసిన ప్యాంటు జేబులోవున్నట్లు. బిక్కచచ్చిపోయాడు సుబ్బారావు. సిగ్గుపడుతూనే జరిగిన సంగతంతా చెప్పాడతనికి. సాయంకాలం తీసుకువచ్చి ఇస్తానన్నాడు పదిపైసలు.

"పోన్లెండి బాబూ! పొరపాట్లు అందరికీ జరుగుతాయి. సాయంకాలమే ఇవ్వండి ఫరవాలేదు," అన్నాడు అతను తిరిగి తనపనిలో లీనమయిపోతూ. రోడ్డుమీద తిరిగి నడకప్రారంభించిన సుబ్బారావు, ఎదురుగా వస్తున్న వీరయ్యను చూసి తలవంచుకున్నాడు. చెప్పులకుట్టేవాడు తనుపెట్టిన బాకీకి వప్పుకోకపోతే బాగుండును అనిపించింది సుబ్బారావుకు. రాయిలేకున్నా, చెప్పులో రాయిమారినట్టే అయిందతనికి.

# తులా "బీర" వ్రతం

ద్వాపరయుగంలో కళింగరాజ్యాన్ని పరిపాలించిన వీరసేనరాజు కొన్ని జన్మల తర్వాత సుమారు ఎనభై ఏళ్ళ క్రితం ఒక సంస్థానాధిపతిగా జన్మించాడు. ఆయనకు పూర్వాపూర్వజన్మల వాసనలెప్పుడూ పోలేదు. అంచాత అన్ని పనులూ ద్వాపరయుగంలో ఎంత నియమంతో చేసేవాడో క్రీ. శ. పంతొమ్మిదో శతాబ్దంలోకూడా అంతనిష్ఠతో చేసేవాడు.

ఆయన దినచర్య ఇది: ఉదయం పూజ. మధ్యాహ్నం సంస్థాన పరిపాలనా కార్యక్రమాలు: సాయంకాలం కవితాగోష్ఠి. అప్పుడే మైరేయము త్రావుట. రాత్రి ఇష్ట స్త్రీలతో సల్లాపములు.

ఇలా కాలం సుఖంగానే గడిచిపోతున్నపట్టంలో ఒకసారి రాజుగారికి అకస్మాత్తుగా జబ్బుచేసింది. ఎందరో వైద్యులు రాజుగార్ని సందర్శించినా ఫలితం శూన్యం. సరియైన రోగనిదానం జరగడంలేదు మంచిమందు లోపలికి వెళ్ళడంలేదు. దేవేరులంతా చింతతో క్రుంగిపోతున్నారు.

ఒకరోజున రాజుగారికి ఒకకల వచ్చింది. ఆ కలలో నారదులవారు కనిపించి "రాజా! నీ జబ్బుత్వరలోనే పోతుంది. నే చెప్పినట్లు చెయ్యి. నీ ఎత్తు "బీర" తూకంవేసి ఇష్టజనులకు పంచిపెట్టు. ఒక పదిరోజులు సద్బ్రాహ్మణుల పాదాలు బీరుతో కడిగి ఆతీర్థం నెత్తిమీదచల్లుకో," అని చెప్పి తులా "బీర" వ్రతం గురించి తెలియచేశాడు.

రాజుగారు ఆ వ్రతాన్ని నిష్ఠతో ఆచరించి రుగ్మతను పోగొట్టుకున్నారు. ఆ తర్వాత ఆయనా, ఆయన పుత్రులూ, పౌత్రులూ అందరూకూడా అనేక బీరు ఉత్పత్తి కేంద్రాలను నెలకొల్పి దేశసేవ చేశారు. అడిగిన వారికి ఎపుడూ వారి కుటుంబీకులు "బీరు" లేదనలేదు. వారు అంతటి దానశీలురు. వారి సంస్థానం మిగతాదేశంతో విలీనీకరణ జరిగేవరకు వారి జెండాపై 'సీసా' వుండేది.

ఇప్పటికికూడా బీరు విషయంలో ఆ వంశీకులు ఉదారంగానే ఉంటారు. తులా "బీర" వ్రతం యథాశక్తి ఆచరిస్తూ వుంటారు. తులా "బీర" వ్రతవిధానం పూర్తిగా తెలుసుకోగోరే వారికోసం కొన్నివేల కాపీలు అచ్చొత్తింపబడుతున్నాయ్.

ఫలశ్రుతి: ఈ కథ చదివిన ప్రతిసారీ పాఠకుడికి ఒక బీరకాయ పుచ్చుకొన్నంత "సుఖం" కలుగుగాత! ※

---

" గోపాలచక్రవర్తి "

# ఎదురీత

వేదుల మీనాక్షీదేవి



“జానకి పెళ్ళి చేసుకుందిట! వార్త క్షణాలమీద ప్రాకి, వూరంతా పట్నంలో కనబడింది!” అన్న గుప్పుమంది.

వింతగా చెప్పుకుంటున్నారు.

"ఇది నీలివార్త. అబద్ధం" అన్నారు కొందరు.

"కాదు. కళ్ళారా చూసినవాళ్ళు చెప్పారు. నమ్మకపోవడం యెలాగ?" అన్నారు మరికొందరు.

"అయ్యో! తల్లికీ, తండ్రికీకూడా తెలియలేదు" అని బుగ్గలు నొక్కుకున్నారు కొందరు.

ఈ విధంగా ఒకనాటి ఉదయం జానకి వివాహం ఒక చర్చనీయాంశం అయిపోయింది.

జానకి నిజంగా పెళ్ళి చేసుకుందే అనుకుందాం. అందులో అంత ఆశ్చర్యం దేనికి? బుగ్గలు నొక్కుకోవలసినంత పనేమిటి?... ఎందరు పెళ్ళిచేసుకోవడంలేదు?.... ఆ పెళ్ళిళ్ళలో పెద్దలు చూసి చేసినవీ వున్నాయి... పెద్దల అంగీకారంతో జరిగినవీ వున్నాయి... స్వతంత్రంగా వధూవరు లుద్వాహమైనవీ వున్నాయి...

ఈ రోజుల్లో స్త్రీలు పురుషులతో సమానముగా విద్య నేర్చుకుంటున్నారు. అన్ని రంగాలలోను పురుషులతో సమానముగా కృషి చేస్తున్నారు... బాధ్యతాయుతమైన పదవులను నిర్వహిస్తున్నారు. ఇటువంటి కాలంలో తమ జీవిత భాగస్వామిని ఎన్నుకోడంలో జానకి స్వతంత్రిస్తే తప్పేముంది? విద్యావతి, యుక్తాయుక్త విచక్షణజ్ఞానం కల జానకిని గురించి అంత ఆదుర్దా, ఆశ్చర్యం పడ్డం దేనికి ప్రజలు? అన్నది ఒక పెద్ద క్వశ్చన్ మార్కైంది!

* * *

రోజూ గాంధీనగరం పార్కువైపు షికారు వెడుతూంటారు యిద్దరు పెద్ద మనుష్యులు.

ఇద్దరూ మిత్రులు... ఇద్దరూ రిటైరయినవారు.

"నమస్కారమండీ" అంది ఒక అమ్మాయి ఒకనాడు వారినిచూసి.

పదేళ్ళుంటాయి. చిదిమి దీపం పెట్టవచ్చునన్న మనవాళ్ళ మాట జ్ఞప్తికి వస్తుంది ఆ అమ్మాయిని చూస్తే... తెల్లని పరికిణీ... తెల్లజాకట్టు... చెవులకు జూకాలు ... చేతులకు గాజు గాజులు ... రెండుజడలు వేసుకుంది.

మర్నాడు అదే సమయానికి, అదే చోట కనబడింది ఆ అమ్మాయి .. షికారు వెడుతున్న ఇద్దరు మిత్రులకూ నమస్కరించింది...

ఆ అమ్మాయి ఎవరో వాళ్ళిద్దరికీ తెలియదు. ఆమె అక్కగాని, అన్నగాని తమదగ్గర చదువుకున్నారేమో అనుకున్నారు వారు.

మూడవనాడు అదేవిధంగా ఆ అమ్మాయి అదేచోట నిలిచి నమస్కరించడంతో ఆ మిత్రులిద్దరికీ కుతూహలం కలిగింది.

"ఎవరస్మాయివమ్మా నువ్వు?

మమ్మల్నెలాగ యెరుగుదువు?"

ఇత్యాది ప్రశ్నలు వేశారు.

"మా నాన్నగారు నారాయణరావుగారండి. ఆయన కాంపుక్లార్క్‌గా పని చేస్తున్నారండి... నేను అయిదోక్లాసు ప్యాసయానండి. ఆ స్కూల్లో అంత వరకే వుందండి... హైస్కూల్లో 1వ ఫారంలో చేర్పించడానికి అప్లికేషన్ పంపారండి నాన్నగారు... కాని, నాకు సీటురాలేదు... స్కూళ్ళు తెరిచారు... నాన్న కాంపులో వున్నారండి... నాకేమీ తోచక బాధపడుతుండగా నాలుగురోజుల క్రితం హెడ్‌మేష్టారు మీతో కలిసి యిల్లా వెళ్ళడం చూశాను... ఆయన మీకు స్నేహితులై వుంటారు. నా సంగతి మీతో చెబుదామని మీ కోసం రోజూ యిక్కడ వుంటున్నాను. మీరెలాగైనా హెడ్‌మేష్టారుతో చెప్పి నాకు సీటు యిప్పించండి. నాకు చదువుకోవాలని సరదాగావుంది'' అంది ఆఅమ్మాయి.

మేష్టర్లని హేళనచెయ్యడం, అల్లర్లను రెచ్చగొట్టడం, స్ట్రైకులుతప్ప చదువులు అక్కర్లేని విద్యార్థులుగల ఈ రోజులలో చదువుకోసం ఆ బాలిక ఆరాటం, ఉపాయం, ఆ మాట్లాడే తీరు, తెలివి చూసి వారికి ముచ్చట వేసింది.

"కనుక్కుంటామమ్మా" అన్నారు వారు.

మర్నాడు అదే సమయానికి వారి కోసం వేచివుంది ఆ బాలిక.

"ఏమన్నారండి?" అంది ఆత్రతగా.

"రేపు స్కూలుకివెళ్ళి హెడ్‌మేష్టారికి కనబడు" అని సలహా యిచ్చారు.

ఆ మరుసటిదినం షికారులో ఆ అమ్మాయి కనబడి నవ్వుతూ నమస్కరించింది.... "మీరు చెప్పినట్లే వెళ్ళానండి. సీటు యిచ్చారు హెడ్‌మేష్టారు. ఇదంతా మీ దయండి" అంది.

ఆ బాలికగొంతు రుద్ధమైంది.

చూడబోతే పదేళ్ళపిల్ల! ఆ ఆలోచన, ఆ మాట్లాడే నైపుణ్యం, ఆ వినయంతో ఎంతటివాళ్ళూ సంపాదించలేని సీటును సంపాదించింది.

ఆ మిత్రులిద్దరేకాదు. ఆ విషయాన్ని విన్నవారెవరూ ఆశ్చర్యపడకుండా వుండలేరు!

ఆ అమ్మాయే జానకి!

జానకి నారాయణరావుగారి కడగొట్టు సంతానం.

"సంతోషిగా దేని శక్రుడైన నశించు" అని పోతనార్యుని సూక్తి. తమకి వున్నంతలో తృప్తిగా బ్రతకడం ప్రతీ వారూ నేర్చుకోవాలి... అందులోనే వుంది సుఖం... అందులోనేవుంది ఆనందం... అందులోనేవుంది మన శాంతి... అసంతృప్తితో బ్రతికేవారికి అడుగడుగునా అవాంతరాలే... బాధలే. ఇబ్బందులే..."

అందువల్ల తనకున్నంతలో తృప్తిగా బ్రతకాలనే తత్వాన్ని జీర్ణించుకున్నవారు

నారాయణరావుగారు...ఓ అతిథి, అభ్యాగతి, చుట్టం, పక్కం ఎవరువచ్చినా ఎంతో ఆప్యాయతతో ఆదరిస్తారు వారిని.

ఆవూరు ఆఫీసులకు కేంద్రం. కాలేజీ వుంది. సినీమాహాలు లున్నాయి. అప్పుడప్పుడు సర్కసులుకూడా రావడంకద్దు. రైలుప్రయాణం చెయ్యాలంటే ఆచుట్టుపట్ల వూళ్ళజనం ఆవూరు వచ్చివెళ్లాలి. ఈ విధమైన పనులకు వచ్చే పరిచయస్తులంతా నారాయణరావుగారి ఆదరం పొందేవారు.

పెద్దన్నగారు చెప్పిన గృహస్థు లక్షణాలను సంతరించుకున్నవారు నారాయణరావుగారు.

ఒకరిని గురించి చెడ్డగా చెప్పడం ఆయన నోట వినడంగాని, విసుక్కోగా చూడ్డంగాని యెవ్వరూ యెరుగరు...

మహాసౌమ్యుడు!

అనుకూలవతి, భర్త మనసులో వర్తించి, అన్నపూర్ణకు నుద్దియైన అతని గృహిణి సహకారం ఎప్పుడూ ఆయనకు లభించేది.

అటువంటివారి సంతానం మాత్రం మరొకలాగ ఎలా వుంటుంది?... ముమ్మూర్తులా వారిని పోలినవారే వారి పిల్లలు!

ముగ్గురు కుమారులూ, ఒక కుమార్తె. ఆ అమ్మాయే జానకి!

* * *

ఆ విధంగా స్వయంకృషితో హైస్కూల్లో 1వ ఫారంలో ప్రవేశించిన జానకి ఎంతో చురుకుగా అన్ని క్లాసులూ పాసైంది. మంచి మార్కులు వచ్చేవి. తన చదువేమో, తన గొడవేమో, రెండవ ధ్యాసేలేదు.

"నాయనా, పిల్ల పెళ్ళి చెయ్యవా? ఎన్నిమాట్లు చెప్పినా నామాట చెవిని పెట్టవు కదా. ఈ యేడు చేస్తావా? చెయ్యవా?" అని కూర్చుం దొకనాడు నారాయణరావుగారి తల్లి.

"తగిన సంబంధంవస్తే చెయ్యనా అమ్మా" అన్నారాయన.

"మనం తిరగనిదే దానంతట అది వస్తుందేమిటి సంబంధం? నువ్వు పెళ్ళి కనుక్కున్నదేదీ?" అని సతాయించింది తల్లి.

"కనుక్కుంటానమ్మా. ఎక్కడా సెలవు దొరకడంలేదు. నెల్లాళ్ళు సెలవు తీసుకుని ఆ పని చూస్తాలేమ్మా, అయినా ఈరోజుల్లో చిన్నపిల్లలకు పెళ్ళిళ్ళు చేస్తున్నారా చెప్పు" అన్నారాయన.

"ఈ విధంగా పన్నెండేళ్ళు జానకికి వచ్చినప్పటినుండి చెబుతున్నాను. చిన్నపిల్ల, చిన్నపిల్ల అంటావు. ఇప్పుడు పదిహేనవయేడు వచ్చింది...నీకు తెలియదు నాయనా! ఎదిగిన ఆడపిల్ల గురించి అభాండాలు వెయ్యడానికి లోకం జంకదు సుమా! నేనూ పెద్దదాన్నై అయిపోయాను. ఎప్పుడో కన్నుమూస్తాను. ఈలోగా జానకి పెళ్ళి చూద్దామని వుంది




నాయనా" అంటూ తన తుదికోరిక వెలిబుచ్చింది నారాయణరావుగారి మాతృమూర్తి.

"అలాగేనమ్మా" అన్నారాయన.

ఈ సంభాషణ జరిగిన వారంరోజుల్లో ముసలమ్మగారి పెద్దతల్లి తాలూకు సంబంధంవారు రావడం, పెళ్ళిచూపుల తతంగం పూర్తవడం జరిగింది. ఇచ్చిపుచ్చుకోవడంవంటి వ్యవహారాలు మాట్లాడుకున్నారు.

ముహూర్తం పెట్టడమే తరువాయి.

మరొక వారంరోజులలో వారి కొక శుభలేఖ వచ్చింది. ఇటీవల తాము చూచిన సంబంధంవాళ్ళ శుభలేఖ అది!

ఆశ్చర్యపోయారు నారాయణరావుగారు, భార్య, ఆయన ముసలితల్లి.

జానకిని చూసుకుందుకు ముందుగానే ఒక సంబంధం చూసుకున్నారనీ, ఇక్కడ కూడా చూసి యెవరు యెక్కువ కట్నం యిస్తే ఆ సంబంధం కుదుర్చుకుందామనుకున్నారనీ. ఇక్కడ జానకిని చూసిన కబురు వారికి తెలిసి మరో వెయ్యి యెక్కువ యిస్తామని ఆశపెట్టారనీ కొన్నాళ్ళకు గాలివార్తగా తెలిసింది.

సంబంధం బెసిగిపోయినందుకు విచారించకపోగా ఆనందించారు నారాయణరావుగారు.

మాటకు విలువ యిచ్చి, కట్టుబడి వుండడం ఉత్తముల లక్షణం. అట్టి లక్షణాలు జీర్ణించుకున్న ఆయనకు చాలా కోపం వచ్చింది.

"ఇటువంటివాళ్ళ బారిపడకుండా భగ

వంతుడు నా బిడ్డను రక్షించాడు. నా పిల్ల అదృష్టవంతురాలు. ఇదీ మన మంచికే జరిగింది" అన్నారాయన.

తనవంకవాళ్ళు యిలాగ చెయ్యడం ముసలమ్మకు తలవంపు లనిపించింది.

"నా తల్లి కేంలోటని? అది వాళ్ళింట్లో మసిలే అదృష్టం వాళ్ళకి వుండవద్దూ? సిరిరా మోకాలు ఒడ్డారు. తెస్తారు యింత కన్న మంచిపిల్లని. ముందు ముందు మనకే తెలుస్తాయి అన్నిసంగతులూను .. నా తల్లికి కల్యాణంఘడియ వచ్చిందంటే ఆ వరుడు వాడే బైటపడతాడు."

ఉగ్రురాలై అంది నారాయణరావు గారి తల్లి.

జానకి ఎస్.ఎస్.ఎల్.సి. ప్యాసైంది. పి.యు.సి.లో చేరింది. ఉత్తమశ్రేణిలో వచ్చింది. బి. ఎ. లో కూడా ప్రథము రాలుగా ఉత్తీర్ణురాలైంది. అటు హై స్కూలులోను, కాలేజీలోనుకూడా చదువు లోనేకాదు, డిబేట్లలోను, వ్యాసరచన పోటీలలోను, వక్తృత్వ పోటీలలోను పాల్గొని ఎన్నెన్నో బహుమతులను పొందింది. తెలివైన, సత్ప్రవర్తనగల విద్యార్థినిగా ఉపాధ్యాయుల, అధ్యాపకుల మన్ననలకు పాత్రురాలైంది.

ఆమె వినయం, నిరాడంబరత జానకి చదువుకు వన్నెతెచ్చాయి.

నారాయణరావుగారి ఆనందానికి అవధి లేకపోయింది. యం. ఎ. చదివించమని మిత్రులంటే సలహా యిచ్చారు.

ఇంతవరకు వున్న వూళ్ళో చదువు గనుక బాధలేకపోయింది. ఇప్పుడు యూనివర్శిటీకి పొరుగూరు పంపాలి... పంపడమా ... మానడమా ... హాస్టలు భోజనంతో ఆరోగ్యం పాడవుతుం దేమో?...ఇదీ ఆయన బెంగ.

ఎందరో అమ్మాయిలు చదువుకోడం లేదా? వుంటుంటే అదే సరిపోతుంది అని సర్దుకున్నారు.

యం. ఎ. లో సీటు వచ్చింది. కూడా వెళ్ళి చేర్పించి వచ్చారు జానకిని.

ఆమె కొద్దిరోజులలోనే ఆ పరిసరాలకు అలవాటుపడింది. యం. ఎ. సీనియర్ అమ్మాయి మణి...జానకి రూంమేటు... అలవాట్లు ... అభిప్రాయాలు యించు మించు ఆ యిద్దరివీ ఒకటే...ఏ విషయ మైనా ఒకరితో ఒకరు సంప్రతించుకునే వారు.

వయస్సులో మణి రెండుమూడేళ్ళు పెద్దది. అందువల్ల జానకిగురించి శ్రద్ధ తీసుకునేది.

ఆ సంవత్సరం అన్నలిద్దరికి సంబం ధాలు కుదిరి వివాహాలు అయాయి... ఆ వివాహాలలో ఆడబిడ్డగా జానకి ప్రాముఖ్యం పొందింది ... పెళ్ళిళ్ళలో అటువారు, యిటువారు బంధువులు రావడం జరుగుతూండేదే. ఆ విధంగా ఆడపెళ్ళివాళ్ళ బంధువు లెందరో వచ్చారు. వారిలో యిద్దరు యువకులు నారాయణరావుగారి దృష్టి నాకర్షించారు.




వారిలో ఒకరు డాక్టరు, ఒకరు లెక్చరర్. ఇద్దరూ అవివాహితులే. ఇద్దరూ యించుమించు ఒక వయసువారే ... వారిద్దరిదీ జానకికి ఈడైన వయస్సే.

తాము పెద్దవారై పోతున్నారు. మగపిల్లలిద్దరి వివాహం అయిపోయింది... మూడవపిల్లవాడు ఢిల్లీలో చదువుతున్నాడు ... పెళ్ళి యింతట్లో వద్దన్నాడు ... ఒక్కగానొక్క కుమార్తె జానకి... ఒక్క సంవత్సరంలో యం.ఎ. అయిపోతుంది. ఈలోగా మంచి సంబంధం చూడాలి. ఆ ప్రయత్నంలో వుంటే చదువయే సమయానికి కుదురుతుంది...

తనూ, భార్యా బాగుండగా అమ్మాయి వివాహం అయిపోవాలి... బంగారు కంచానికైనా గోడ చేర్పుకావాలి... అందువల్ల తగిన వరునిచూసి జానకి వివాహం చేసెయ్యాలి.

ఇదీ నారాయణరావు దంపతుల ఆలోచన. జానకితో ఆ విషయం ప్రస్తావించారు. మీ యిష్టం అంది జానకి.

లెక్చరర్ సంబంధం చూసుకున్నారు. వరుడు కట్నం వద్దన్నాడు...అతని తల్లిదండ్రులూ అదే అన్నారు.

కట్నం లేకపోయినా గొప్పగా లాంఛనాలు జరిపి వివాహం వైభవంగా చేద్దామనుకున్నారు నారాయణరావు దంపతులు.

"కట్నంలేదు కనుక ఒక టేప్‌రికార్డర్ యివ్వండి. నా స్నేహితులెందరో వస్తారు. వారందరికీ మర్యాదచేసి, బట్టలు యివ్వాలి... స్కూటరు ఒకటి నాకు కావాలి..." ఈ విధంగా ఎన్నెన్నో

వ్రాశాడు వరుడుగా నిర్ణయించిన లెక్చరర్.

అడిగినవస్తువుల గురించికన్న అతని వుత్తరంవరస చాలా చికాకు కలిగించింది నారాయణరావుగారికి. పెళ్ళివారి ముచ్చట్లు తీర్చాలనే వారివుద్దేశం. వారు కోరనూవచ్చు. తాము ఈయనూవచ్చు. కాని, వరుని తల్లిదండ్రులుగాక అతడే కోరడం బాగాలేదు. పైగా, ఆ జాబు వ్రాసే పద్ధతిలో ఏమీ సౌజన్యం కనబడకపోగా ఆజ్ఞాపిస్తున్నట్లుగావుంది.

అతని స్వభావంగురించి మొట్టమొదటిసారిగా అనుమానం కలిగింది నారాయణరావుగారికి, ఇప్పుడే యీ విధంగా వ్రాసినవాడు పెళ్ళయాక ఎంత నిర్మొగమాటంగా వుంటాడో? పెడసరపు రకంలాగ కనబడుతున్నాడు...

అమ్మాయి మనస్సు అతి సున్నితమైనది. ఎన్నడూ యెవ్వరిమనస్సూ కష్టపెట్టేమాట అని యెరుగదు. ఇంత చదువుకున్నా తల్లీతండ్రీ దగ్గిర చిన్నపిల్లప్పుడు యెలావుందో అలాగే వుంటుందికదా!... అటువంటి బిడ్డ భవిష్యత్తు శాంతి సౌభాగ్య విలసితం అయేటట్టు చూసే బాధ్యత తనపై యెంతైనా వుంది... ఈ సంబంధంగురించి వాకబు చెయ్యాలి... తొందర పడరాదు... అనుకున్నాడు నారాయణరావుగారు.

మిత్రులద్వారా వాకబు చేయించారు వరుని గురించి.

ఆ వరుడు అనబడే లెక్చరర్ తల్లిదండ్రుల మాటలు వినడనీ, వారియందు ఏ విధమైన గౌరవం లేదనీ, ఒక్కగానొక్క కొడుకు అవడంవల్ల తనకి తోచినదంతా చేసే స్వభావంఅనీ, చిన్నప్పటినుండి గారాబం పెంపకంవల్ల అలా తయారయాడనీ తెలిసింది.

ఆ సంబంధం వదులుకుని, డాక్టరు సంబంధం నిశ్చయించుకున్నారు నారాయణరావుగారు.

జానకి యం.ఎ. ఆఖరి సంవత్సరం చదువుతోంది.

ఒకనాటి వుదయం నారాయణరావుగారికి ఎక్స్‌ప్రెస్ వుత్తరం వచ్చింది. ఆ కవరులో రెండేపంక్తులున్నాయి.

"మీ జానకి వివాహం చేసుకుంది పట్నంలో. నాలుగురోజులైంది... నా కళ్ళతో చూసిన విషయం యిది.

మీ శ్రేయోభిలాషి."

క్రింద సంతకంలేదు!

నిశ్చేష్టులయారా దంపతులు.

జానకివద్ద యెన్నిమార్లు వివాహప్రసక్తి తెచ్చినా "మీ యిష్టం నాన్నా. నా మంచి కోరేకదా మీరు ఏ పనిచేసినా. మీకన్న నాకు యెక్కువ లోకానుభవం వుందా చెప్పండి? మీలో నాకు విశ్వాసం వుంది" అంటుందే కాని తనేమీ స్వంతంగా ఆలోచించమన్నా ఆలోచించదే!...

జానకి వివాహం చేసుకుంటే తమకు



ఆనందమే. అయితే, తమకు తెలియకుండా చేసుకోవలసిన అవసరంలేదే... తాము ఆమె అభిప్రాయానికి విలువ యిస్తారే ... తమకు ... తమపిల్లలకు మధ్య ఏమాత్రం అరమరికలు లేవే ... నిర్భయంగా, నిస్సంకోచంగా చెప్ప వచ్చునే ...

ఆనాడు చిన్నతనంలో చదువుకోవా లన్న ఆకాంక్షతో తెలివిగా, సమయస్ఫూర్తిగా తనకుతానై స్కూల్లో సీటు సంపాదించుకుంది. ఈనాడు విద్యావతి... ఇంకా జ్ఞానంసంపాదించి...బుద్ధిసూక్ష్మతతో వ్యవహరించగలదు...ఫరవాలేదు. తొందరపడి ఏ నిర్ణయానికి రానేరాదు... వచ్చిందీ అంటే బాగా ఆలోచించి మరీ నిర్ణయానికి వస్తుంది...

అనుకున్నారు తల్లీ, తండ్రీ.

* * *

"జానకి పెళ్ళి చేసుకుందిట. పట్నంలో యెవరికో కనబడిందట."

అన్నమాట క్షణంలో ఊరంతా గుప్పుమంది.

జానకి తల్లీ, తండ్రీ నిర్ఘాంత పోయారు.

తామెవ్వరితోనూ చెప్పలేదే?

అందరికీ యెలా తెలిసింది?

ఆశ్చర్య పోతున్నారు ..

ఆ వుత్తరం వచ్చిన సమయంలో పని మనిషి యిల్లు తుడుస్తూండడం, ఆవుత్తరం విషయం వారనుకోవడం దాని చెవినిపడ్డం వారు గమనించనేలేదు!

"పెదవి దాటితే పృథివి దాటుతుంది!"

"గోడలకు చెవులుంటాయి" అంటారిందుకే పెద్దలు.

"అమ్మాయి వుత్తరం వ్రాసి పది రోజులు కావస్తోంది. ఓ మారువెళ్ళి చూసి వస్తాను" అని విశాఖపట్నంవెళ్ళేబస్సులో బయలుదేరారు నారాయణరావుగారు.

ఆనాడు ఆదివారం...కాలేజీకి సెలవు.. నేరుగా హాస్టలుకే వెళ్ళారు నారాయణరావు గారు.

జానకి గదితలుపు తాళం వేసివుంది!

క్రిందటి సంవత్సరం రూంమేట్ మణి రిసెర్చి చేస్తోందా సంవత్సరం. జానకితో ఆ గదిలోనే వుంటోంది...ఆమె ఏదీ....

"జానకి యెక్కడికి వెళ్ళిందమ్మా" అని ప్రక్క గదిలోని విద్యార్థినులను అడిగా రాయన

"జానకి, మణి వూరికివెళ్ళి నాలుగు రోజులైందండి. రెండుమూడురోజులలో రావాలి. వారంరోజులు సెలవు తీసుకుని వెళ్ళారు ..ఎక్కడికి వెళ్ళారో మాకు తెలియదు" అన్నారు వాళ్ళు.

నారాయణరావుగారు ఆలోచనలో పడ్డారు.

తిరుగు ప్రయాణం అయారు.

మనస్సు చికాగ్గా, ఆందోళనగా వుంది.

జానకితో మణి యెందుకు వెళ్ళినట్లు?...తనకు తోడు రమ్మందా జానకి.. వివాహం సంగతి మణికి తెలుసునా?... లేక, మణే వివాహం చేసుకుంటే పొరబాటున జానకి అనుకున్నారా తనకు వుత్తరం వ్రాసినవాళ్ళు?...ఈ విధమైన ఆలోచనలతో ఆయన మస్తిష్కం వేడెక్కి పోయింది.

బరువుగా అడుగులు వేస్తూ వీధి మెట్లెక్కి తలుపుతట్టిన నారాయణరావు గారు నవ్వుతూ తలుపుతీసిన జానకిని చూసి తనకళ్ళని తాము నమ్మలేకపోయారు... ఆయనగొంతు రుద్ధమైంది... "ఎప్పుడు నువ్వు కంటపడతావా? అనుకుంటున్నాను తల్లీ. యెక్కడికి వెళ్ళావమ్మా" అని మాత్రం అనగలిగారు.

ఆయన నేత్రాలు శ్రావణ మేఘాలై వర్షించాయి.

"మణికి పట్నంలో లేడీస్ కాలేజీలో లెక్చరర్‌కి ఇంటర్వ్యూ వచ్చింది. నన్ను తోడుగా రమ్మంటే వెళ్ళాను. మణికూడా వచ్చింది మనింటికి. రేపు వెడతాం.




ఇక్కడికే ఎన్నో క్లాసులు పోయాయి" అంది జానకి.

దీర్ఘమైన నిట్టూర్పు విడిచి "ఈ వుత్తరం చూడమ్మా" అన్నారాయన.

"చదవక్కర్లేదు నాన్నా. అమ్మ చెప్పింది ... ఎంతటి అభాండం?... ఎంత కల్పన...ఇది యెవరై వుంటారో వూహించగలరా? ... మనం తిరస్కరించిన లెక్చరర్ రామారావు అయి వుండాలి ... తప్పదు...మాకు బెజవాడ ప్లాట్‌ఫారమ్‌మీద కనబడ్డాడు...తనకు ట్రాన్స్ఫర్ అయిందట. హైదరాబాదు వెళ్ళి కాన్సిల్ చేయించుకుంటాడట... ఓ మంత్రిగారి సెక్రటరీ తనకు మిత్రుడట...ఎన్నెన్ని కోతలు!...ఎవరడిగారని?... మేము సమాధానమైనా చెప్పక పోయినా ఒకటే సోది...మనకి తన నిజస్వరూపం తెలిసిపోయిందని ఉడుకు మోతుతనంతో ఈపని చేసివుంటాడు... అంతకన్న మనమీద అయిష్టంవున్నవాళ్ళెవరూ లేరు నాన్నా" అంది జానకి.

ఆమెముఖం యెర్రబడింది రోషంతో.

"అంతే తల్లీ ... అంతే ... నువ్వు సరిగ్గానే వూహించావు ... 'అచ్చపు బుద్ధికి లేవగమ్యముల్' అన్నట్టు చిన్న దానివైనా చటుక్కున గ్రహించావు... ఎంత దుర్మార్గుడు!...అమాయకత్వంగా వెళ్ళి అతనిచేతిలో పడకుండా భగవంతుడు రక్షించాడు తల్లీ మనల్ని...తన సంబంధం కాదని, డాక్టరు సంబంధం కుదుర్చుకున్నామని ఈవిధమైన అగావులు వేస్తే ఆ సంబంధం చెడిపోతుందనీ తలపెట్టాడా తుచ్ఛుడు."

అంటున్న నారాయణరావుగారి కంఠం రుద్ధమైంది. "నాయనా, పిల్ల పెళ్ళి చెయ్యవూ? ఎదిగిన ఆడపిల్లలను గురించి అభాండాలు వెయ్యడానికి వెనుదియ్యదు మన సంఘం..." అని తన తల్లి అన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి నారాయణరావుగారికి ... ఆ మాటలు చెవులలో

గింగురుమంటున్నాయి. విద్యావంతురాలు కాకపోయినా ... ఎంత లోకజ్ఞానంతో చెప్పింది! .... ఆమె ఆ మాటలు అని సుమారు పదిపన్నెండేళ్ళయింది ... ఆ నాటికీ ఈనాటికీ సంఘం పరిస్థితిలో మార్పేది?...ఆనాడు ఆమె అన్నమాట లీనాడు అక్షరాలా నిజమయాయి!... "అందుకే పెద్దలమాట చద్దిమూట... పెద్దలవాక్కులు వేదవాక్కులు" అన్నారు.... అనుకున్నారు నారాయణరావుగారు.

"ఏమిటి నాన్నా...అదే పనిగా ఆలోచిస్తున్నారు" అంది జానకి.

"ఏమీ లేదమ్మా, ఎంత తెలివి తేటలున్నా, ఎంత సుగుణవతి అయినా, విద్యావతి అయినా, సంపాదించుకుని స్వతంత్రంగా బ్రతికే స్తోమతువున్నా, ఉన్నత పదవుల నధిష్టించినా ఈనాటికీ స్త్రీపట్ల సంఘం గౌరవం చూపలేకపోతోంది...బాహ్యమైన నాగరికతలో జాతియెంత పురోగమించినా మానసికంగా యిదివరకు కన్న పీసమెత్తు ప్రగతి సాధించలేదు స్త్రీ పట్ల సంఘం.

"ఎంత తెలివైనదైనా ఒంటరిగా బ్రతుకుతున్న స్త్రీ తన్ను తాను కాపాడుకుందుకు అడుగడుగునా ఈనాడు ఎన్నో క్లిష్ట పరిస్థితుల నెదుర్కోవలసి వస్తోంది. మానసికంగా నాగరికతలో వెనకబడుతూ, పీసమెత్తు ప్రగతి సాధించలేని కృత్రిమ, కుచ్ఛితమైన వాతావరణంలో ఈనాడు మనం వున్నాం.

"కాలవాహిని శరవేగాన ముందుకు సాగుతోంది. ఈ లెక్చరర్ వంటివారు ఆ వాహినికి యెదురీత యీదడానికి ప్రయత్నిస్తారు. ఆ యెదురీతలో ముందుకు పోలేరు. కొద్దిసేపట్లోనే అలిసిపోతారు. ఇటు ఎదురీతలో కృతకృత్యులు కాలేక, అటు కాలవాహినితో సాగలేక రెంటికి చెడిన రేవడలౌతారు. వీళ్ళు ఒకరు అభివృద్ధిలోవుంటే సహించలేని అసూయాపరులు.

"కాలం యిలాంటివారిని గుర్తించే అవకాశం మృగ్యం" అన్నారు నారాయణరావుగారు.

అంతవరకు వారి సంభాషణ వింటున్న నారాయణరావుగారి అర్ధాంగి

"పోనీలెండి. అయిందేదో అయింది. అమ్మాయి పరీక్షలు అన్నామని పెళ్ళివారు ముహూర్తానికి తొందర చెయ్యడంలేదు. నెల వున్నాయి పరీక్షలు. ఆ వెంటనే ముహూర్తం ఏర్పాటు చేయించి ఇప్పుడే వారికి కబురుచేయండి. ఆ శుభఘడియలుదాటితే ఇక అమ్మాయి ఎంత దూరం వున్నా మనకు బాధ, బెంగ వుండదు" అని చిన్నగా నవ్వుకుంటూ అంది.

ఆ మాటలకు సిగ్గుతో చెక్కిళ్ళలో గులాబీలు సంతరించుకున్న జానకిని చూసి ఆ తల్లిదండ్రులకళ్ళు ఆనందంతో మెరిశాయి.

# అదృష్టవంతులు!

నార్ల చిరంజీవి



'జాస్మిన్ సోప్ కంపెనీ' ఆఫీస్ గది గోడకి పైపిస్టు కుమారి మేరి సరికొత్తబొమ్మల కేలండర్ తగిలిస్తుంటే, చూస్తూన్న మగగుమస్తాలు ముకుందం, మోహన్ ఇద్దరి గుండెల్లో నెత్తురు గోదారి వెల్లువలా పొంగింది. తమ అదృష్టగీతాన్ని మౌనంగా పాడేసుకున్నారు. మూడుషీట్ల కొత్త కేలండర్‌లో పైన దిలీప్‌కుమార్, నడుమ సాధన, చివర దేవానంద్ వర్ణచిత్రాలతో చూడముచ్చటగా ఉన్నారు. మేరీని సాధనగా, తమని దిలీప్ దేవానంద్‌ల్లాగా ఊహించుకుని మగ గుమస్తాలు తెగ మురిసిపోయారు! ఇద్దరు మగాళ్ళమధ్య ఓ అందాల పడుచు! ఆఫీస్ మొత్తం జాస్మిన్ పరిమళాలు నిండి మత్తెక్కించాయి.

సోప్ కంపెనీ యజమాని పరంధామయ్యగారు. ఈ స్వతంత్రభారతం సృష్టించిన ఇంద్రజాలికుల్లో వీరొకరు!

రాజభవన్ రాజమార్గంలో ఆరంతస్తుల భవనం మొదలెట్టి, అద్దెల కెగబడ్డవాళ్ళ నించి అడ్వాన్స్‌లు గుంజి మరో రెండంతస్తులు పూర్తిచేశాడు. ఈ ఎనిమిదంతస్తుల భవనం ఆయన భార్యామణి పేరుతో ఉంది. ఆయనకున్న భారీ వ్యాపారాల్లో చిన్నదీ, చిన్నదాని లాంటిది ఈ సోప్ కంపెనీ. సోప్ ఫ్యాక్టరీ నగరం చివర కోటలాంటి తోటలో ఉంది. ఆఫీస్ మాత్రం ఎనిమిదో అంతస్తు చివరగదిలో ఉంది. ఆఫీస్ మొత్తానికి ఇద్దరే మగ గుమస్తాలు, ఒక ఆడటైపిస్టూ. పరంధామయ్యగారు అడపాతడపా ఆఫీస్ కొచ్చేవారు. ఉన్న అయిదు నిమిషాల్లో లెక్కా డొక్కా చూసుకోడంతో సరిపోయేది. గుమస్తాలు ముగ్గురిలో ఆఖరికి ఆడామగా తేడాకూడా ఆయనకి కనిపించేదికాదు! నెలజీతాలకి తాను కొన్న ముడిసరుకులుగా నేచూసేవాడు!

ఒకవారంఅటూఇటుగా ముకుందం, మోహన్, మేరీ ఉద్యోగాల్లో చేరారు. చేరిన మొదట్లో చివర అంతస్తు చివరి గది కిటికీలవద్ద నించుని ముగ్గురూ మహానగరాన్ని తనివితీరా చూసేవారు. ఇలాంటి అవకాశం, అదృష్టం తమకు లభించినందుకు పొంగిపోయేవారు. జనతా ఎక్స్‌ప్రెస్‌లాగా కింద అంతస్తుల్లో కిటకిటలాడే జనాన్ని చూసి నవ్వుకొనేవాళ్ళు. వాళ్ళందరివీ పడ్పుగొట్టు మొఖాలు! తమ ముఖాలు మాత్రం అదృష్టదేవత వెలిగించిన దీపాలు!

'మనం అదృష్టవంతులం' అని అన్నాడు ముకుందం.

'నూటికి కోటికి దక్కవలసిన అదృష్టం మనకుదక్కింది' అని అన్నాడు మోహన్.

మేరీ చిరునవ్వు నవ్వింది. ఇద్దర్నీ మార్చిమార్చి చూసింది.

'ఇక్కడ, ఇలా మీతో కలిసి పని చేస్తున్న నాదే అసలు అదృష్టం!' గోముగా అంది. మగ గుమస్తా లిద్దరికి వొళ్ళు ఝుల్‌మంది.

టైపిస్టు మేరీ కుడివేపు కుర్చీలో కూచుని ముకుందం కాతా పుస్తకాలతో కయ్యం చేస్తుండేవాడు. ఎడం వేపు కుర్చీలో కూచుని మోహన్ ఆఫీస్ తాలూకు పనితో ఫుట్‌బాల్ ఆడుతూండేవాడు. ఇద్దరి నడుమా కూచుని మిస్ మేరీ నాజూకువేళ్ళతో టైప్ రైటర్ని సున్నితంగా కదిలించేది. కాగితం వొయ్యారంగా వెనక్కి జరిగేది. మగాళ్ళిద్దరికి రానురాను మధ్యనున్న కుర్చీ సెంట్రల్ పాయింట్ అయింది! వారాలు గడిచి నెలల్లో కాలం కదిలేసరికి, తెలుగు సినిమాకి నకలుగా ఆ ముగ్గురిమధ్యా కొంటెచూపులు దొంగచూపులు చిలిపిచూపులు అల్లరిచూపులు దోబూచులాడి చివరకు చెడుగుడి వరసలోకి దిగాయి.




జాస్మిన్ సోప్ కంపెనీ ఆఫీస్‌లో ఇలా మొదలైన ఆముగ్గురి నేస్తం సినిమా కథలా నెలజీతాలు చేతికి రావడంతో కొత్త మలుపులు తిరిగింది. తిరపతి ఘాట్ రోడ్ లాగా నేస్తాలదారి వింత అనుభూతుల్ని రగిలించింది. ఒకరికి తెలీకుండా ఒకరు మేరీ ఆర్థికావసరాల్ని తీరుస్తూ భుజాలు కాశారు. బస్సు టిక్కెట్లతో ఆదుకొన్నారు. కాఫీ ఖర్చులు భరించి పాదుకొన్నారు. సినిమా సరదాలు తీర్చి చేదుకొన్నారు.

ఒక్క చేతిమీద ఎనిమిది మందిని పోషించవలసిన పాపానికి ఒడిగట్టిన చిన్నారి మేరీకి, ఈ మగగుమస్తాల ఔదార్యంవల్ల సగం బెంగతీరింది! చార్‌మినార్‌కి దగ్గర్లో ఎండా వానా వియ్యమాడే కొంపలో బతుకుతూ, తన యౌవనమే తనకు బద్ధశత్రువుగా పరిణమించిన వయస్సులో, కుక్కలు చింపిన విస్తరిలాంటి తన కుటుంబానికి కుట్టుడుపుల్లలా ఉపయోగపడుతూ, మనసిచ్చి పుచ్చుకొన్న జాన్‌కి కోరికల్ని వడ్డించడానికి విస్తరివేయలేక కుములుతూ, ఈ ఆఫీస్‌లో చేరాక కాస్త ఊపిరి పీల్చుకుంది!

జాన్ అంటే మేరీ దూరపుబంధువు. ఏదో ప్రైవేట్ కంపెనీలో చాలీచాలని జీతం తెచ్చుకుంటున్నాడు. జీతాలు

చాలవని కోరికలు చస్తాయా? మేరీ-జాన్ ఈపాటికే డ్రీమ్‌లాండ్ లో ఉండే వాళ్ళే! కాని, ఈ దరిద్రం అనే విధి రాకాసికత్తులు దూసి ఇద్దరినీ చెరో ఒడ్డున నిలబెట్టింది. మంచిరోజు కలిసి వొస్తే ఇద్దరూ వలపువాగులోకి దూకేసి 'మల్లెపూలా పడవగట్టి' తేలిపోవాలని ఉవ్విళ్ళూరుతున్నారు. జాన్ ప్రియురాలికిసమర్పించుకొన్న చిరుకానుకల్లో- ఇదుగో ఈ బొమ్మలకేలండర్ ఒకటి. దాన్ని తెచ్చి మేరీ తనకి ఎదురుగా గోడమీద తగిలించింది. మగగుమస్తాల మనస్సుల్లో మధురజ్వాలల్ని రగిలించింది.

మేరీ తన లేమిని ఏమాత్రం తెలియనీకుండా, అంటుసొంటుపడని నాంపల్లి జాంపండులా నోరూరిస్తూ, తన రోజువారీ ఖర్చుల్ని కోరి, బతిమాలి భరించే ఆ మగగుమస్తాలిద్దరిమధ్యా, కులాసాగా పెదవులపై చిరునవ్వుల్ని చెరగనీకుండా కరగనీకుండా కాలక్షేపం చేస్తోంది. బండి నెట్టుకొస్తోంది!

ఎకౌంటెంట్ ముకుందం తెలివితేటలమీద మేరీకి నిజమైన నమ్మకం గౌరవం చాలావుంది. ముకుందానికి మేరీపట్ల ఇంకోరకమైన అభిమానం నమ్మకం ఉంది. ఆమె హస్తవాసి మంచిదనీ, ఆమె ముఖంచూసి పని మొదలెడితే అది నూటికి నూరుపాళ్ళూ విజయవంతమవుతుందనీ సంపూర్ణ విశ్వాసం కలిగింది. ఆ నమ్మకం రోజు రోజుకి పెరుగుతోంది. ముకుందం ఇప్పుడు మేరీకి హృదయంలో పీఠం వేసి కూచోబెట్టాడు. తనపాలిటి అదృష్ట దేవతగా ఆరాధించడం ప్రారంభించాడు.

ఈ సంగతి మేరీ గ్రహించలేదనడానికి రుజువేదీలేదు!

మోహన్ ఆఫీస్‌నించి వెళ్ళిపోయిన ఒక సాయంత్రం ముకుందం మేరీని ఒక సినిమాథియేటర్‌కి తీసుకెళ్ళాడు. పై తరగతి టిక్కెట్లే కొన్నాడు. మేరీ చాలా ఆనందించింది. ఇంగ్లీష్ పిక్చర్‌ని పై తరగతిలో కూచుని చూడ్డం సామాన్య విషయమా? పాపం మేరీ హృదయం ప్రతి చిన్న విషయానికి చిన్నపిల్లలా ఎగిరి చిందులు వేస్తుంటుంది. ముకుందం కళ్ళకి మేరీ అందాలరాణి అయింది. చీకట్లో తన సరసనున్న మేరీ అప్సరసలా ఉంది. మూడు పదుల వయస్సుమించిన ముకుందం ఆ సమయాన శోభనపు పెళ్ళికొడుకులాగా 'ఫీల్' అయ్యాడు.

తెరమీది కథలో మునిగిపోయింది మేరీ!

మేరీ చెవిదగ్గర జోరీగయ్యాడు ముకుందం!

'మేరీ!...మేరీ' గుసగుసలాడాడు ముకుందం,

'ఏం ముకుంద్?' అంది గోముగా మేరీ.






తననలా పిలవడంతో ముకుందానికి కిందాపైనా తెలీని మైకం కమ్మింది.

'చెరో మతస్తులమై పోయాం మేరీ! ఈ దేశమే మతాలచట్రంలో నలిగి పోతోంది. లేకపోతే నువ్వూ-నేనూ-'

ఆపైన ముకుందం వాక్యాన్ని పూర్తిచేయలేక వ్యాకరణ విరుద్ధంగా ఆపేశాడు. మోహమో, తలపో, దిక్కుమాలినదిమరేదో అతనిగొంతులో గురగుర లాడింది. ఉక్కిరి బిక్కిర య్యాడు.

అతని అవస్తకి జాలిపడింది కుమారి మేరీ.

జాబిల్లిలా చల్లగా అతని క్రాపుని సరిచేసింది.

'ఔను ముకుంద్! నువ్వో ఇంటి వాడివి కాకుండా ఉంటే, ముగ్గురు బిడ్డల తండ్రివి కాకుంటే - ప్చ్ - నువ్వూ - నేనూ...' మేరీకూడా వ్యాకరణం వదిలేసి వాక్యాన్ని ఆపేసింది. మేరీగొంతులో ముకుందంమీది అనురాగం ఐస్‌క్రీమ్‌లాగా జిల్ జిల్ మనిపించింది పాపం!

మేరీ ధర్మసందేహాలు విన్నాక ఎయిర్ కండిషన్ థియేటర్లో కూడా చెమటలు పోశాయి ముకుందానికి!

ఇంతలో తెరమీది కథానాయకుణ్ణి విలన్ ఎడాపెడా రెండువాయించి కథానాయికను ఎత్తుకుపోయాడు. వొళ్ళెరక్కుండా ఆ కథలో లీనమై పోయింది మేరీ!

ముకుందానికి మరి సినిమా చూడబుద్ధి కాలేదు. కళ్ళు మండిపోతు

న్నాయి. తన స్థితిని అసహ్యించుకున్నాడు.

ఆఫీస్‌లో చేరిన మొదట్లో మేరీకి ముకుందం తన కుటుంబచరిత్ర మొత్తం చెప్పాడు. ఆ సంగతి జ్ఞాపకంవొచ్చింది. ఆ రోజుల్లో పబ్లిక్ సింపతీకోసం తెగ తాపత్రయపడ్డాడు. ఇవాళ కావలసింది అదికాదు. తను తెలివిగలవాణ్ణని మేరీ మెచ్చుకోంది. తనమాటని వెనుకాడకుండా మన్నిస్తుంది. నవ్వుతుంది. కలుపుగోలుగా నవ్విస్తుంది. హాయిగా తీయగా ఉంటుంది. ఇవాళ తనకు కావసిందేమిటి? ఏదోకావాలి. అది మేరీ ఇవ్వాలి!

మేరీని చార్‌మీనార్ బస్సుఎక్కించి, ముకుందం ఇంటికి బయల్దేరాడు. పాములపుట్టలోకి పోతున్నానను కున్నాడు. చిక్కడపల్లి చివర్లో అద్దె కొంపలో మూడేళ్ళనించీ పడివుంటున్నాడు. ఈ మూడేళ్ళల్లో ఇద్దరుపిల్లల్ని కన్న భార్య నిత్యరోగం పాలయింది. పెళ్ళాం పిల్లలు అతని రెక్కల్ని విరిచేసి ఇన్నేళ్ళూ కుదేసి కూచోబెట్టారు.

ఎనిమిదంతస్తుల మేడ ఎక్కిన రోజున అతని రెక్కలు మొలకలెత్తాయి. స్వంతంగా గాలిపీల్చాడు. కేలండర్‌లో మొదటికాగితం చిరిగేసరికి అతని రెక్కలు హైద్రాబాదు వెడల్పున పెరిగాయి. రెక్కలనిండా కుమారి మేరీ కోసం మంత్ర-తివాచీ పరిచాడు. అక్కడ పెళ్ళాంపిల్లలకు సూదిమొన మోపినంత చోటు కాళీలేదు!

ఆఫీస్‌లో మేరీపక్కన కూచుని పని చేయడం మొదలెట్టాక రోజురోజుకీ ముకుందం ఒడలంతా మగటీవి అలుముకుంది, పులుముకుంది. మేరీ తనకో పారిజాతసుమం. తనపాలిటి తీయనివరం. మేరీ ఆనందానికి తనజీతం తరగనీ! జీవితమే అంకితం చేద్దామనుకొన్న తనకు - జీతం తరిగితేనేం? తరగనీ! "సతుల్ సుతుల్ రానీ పోనీ! ఛస్తే చావనీ!"

అతని ఆలోచనాప్రవాహాన్ని తెగ్గొట్టారు పిల్లలు. కసురుకున్నాడు. రెక్కసమట్టలా పడివుంది భార్య. చీదరించుకున్నాడు. ఎయిర్ కండిషన్ థియేటర్లో కొనితెచ్చుకొన్న భోగంకాస్తా ఎగిరి ఇగిరిపోయింది. ముకుందం ఉస్రని నిట్టూర్చాడు!

ఒక వారంరోజులుగా ఆఫీస్‌లో ముకుందం ఉదాసీనంగా పడివుంటున్న సంగతి మొట్టమొదట పసిగట్టింది మోహన్. తన తెలివితేటల్ని గురించి చెప్పుకుంటూ 'జాకాల్‌కి మేనమామని నేను' అని గర్వంగా చెప్పుకొనేవాడు మోహన్. మళ్ళా ముకుందం అంటే చెప్పలేని ఓ వెదురు డొక్కలో నెప్పిలా ఉంది. తనకు తెలీకుండా ఉండాలని తిప్పలుపడుతూ, ముకుందం మేరీకి దగ్గరకావడం వాసనపట్టాడు. మనస్సు




పెరపెరలాడింది. తర్వాత 'జాతీయ దుస్తులు' విప్పేసి టెర్లిన్ డ్రెస్‌కి ఎగబడ్డాడు. టెర్లిన్ డ్రెస్‌తో ఆఫీస్‌లో అవతరించిన రోజున మేరీకూడా ఓ చిరునవ్వు కొసరికొట్టి, 'మీకీ డ్రెస్ సరిగ్గా మేచ్ అయింది' అని అంది.

మేరీ పొగడ్త మోహన్ పేదమనస్సుని రెచ్చగొట్టింది.

'అలా అంటారని నాకు ముందే తెలుసు!' అని అన్నాడు.

'ఎలా?' అని నివ్వెరపోయింది మేరీ.

అంతలో తమాయించుకుని 'భలే, తెలివిగలవారు మొత్తానికి!' అని చిరునవ్వుతో మిళాయించి అనేసింది.

మోహన్ ముగ్ధుడయ్యాడు. కోటలో పాగావేశాడు కదూ!

నెలమధ్యలో కాని ముకుందం ఉదాసీనత మేరీకి అర్థంకాలేదు. మేరీకి అవసరాలు కూడా నెలమధ్యనించే మొదలవుతాయి మరి! ముకుందం జీతం ఆస్పత్రికీ, కొంపకీ హారతికర్పూరంలా కరిగిపోయింది. అతని జేబు అతని మనస్సులాగా ఖాళీ అయిందని మేరీ గ్రహించింది. ఒక్క త్రుటికాలం థియేటర్లో అతను గుసగుసలాడిన సంగతి గుర్తు వొచ్చింది. సోప్ వాటర్‌లో మురికిబట్టని గుంజినట్లు, నిన్నటి మొన్నటి సంగతులన్నిటినీ తుడిచేసి మనస్సుని ఆరవేసింది. ఎప్పటిలా మాటల్లోకి దించింది. సమయానికి తగినంత సానుభూతి కాళ్ళముందు వారబోసింది! మేరీ చిరునవ్వుల టానిక్ పనిచేసింది. ముకుందానికి సత్తువవచ్చింది. కాలు నిలదొక్కుకున్నాడు!

ముకుందం ఉదాసీనతని మోహన్ వినియోగించుకొన్నాడు. శత్రువు దుర్బలంగా ఉన్నప్పుడే కోటపేటల్ని చూరగొనాలి. జాకాల్ మేనమామకి ఆ ఎత్తులన్నీ బాగా తెలుసు !

మేరీని 'టాంక్‌బండ్ కి వెళదాం వొస్తారా?' అనడిగాడు మోహన్.

'మీరు పిలవడం నేను రాననడమా? నాకన్ని గుండెలెక్కడున్నయ్ బాబూ?' అంది మేరీ నవ్వేస్తూ!

ఇద్దరూ బస్సెక్కారు. డబల్ డెక్ బస్ టాంక్‌బండ్ కి పోతోంది. ఆ నిమిషాన హఠాత్తుగా గుర్తొచ్చినట్లుగా మేరీ వేపు తిరిగి –

'రేపటితో నాకు ఇరవై ఆరు వెళతాయి !' అని అన్నాడు.

మేరీ కళ్లు పెద్దవిచేసి, అతన్ని నిలువునా చూసింది.

ఆఫీస్‌లో చేరిన మొదట్లో మేరీ. మోహన్ తనవయస్సు ముప్ఫయ్ మూడు అని నిజం చెప్పాడు. వయస్సులో అనుభవంలో ముకుందంకంటే తానెక్కువనీ, ఐనా ఈ ఆఫీసులో తనకు తగిన స్థానం లభించలేదనీ మేరీతో వాపోయిన సంగతి మోహన్ మరిచిపోయాడు.

కాని, మేరీకి ప్రతిమాటా గుర్తుంది. ఆడవాళ్ళ జ్ఞాపకశక్తిపై అవగింజంత నమ్మకంకూడా లేని మోహన్‌కి మేరీ కళ్లు పెద్దవిచేసి చూసిందంటే మరోలా అర్థం తోచింది. తనని 'నిట్ట నిలువునా కళ్ళల్లో నిల్పుకోడానికే సుమా అలా చూసింది' అని అనుకొన్నాడు మోహన్. 'మగవాడు అంతకన్నా మరేం అనుకుంటాడు కనక !

టాంక్‌బండ్ వద్ద టీ స్టాల్ పక్క దుకాణం ఉంది. అక్కడ్నించి మోహన్ రెండుప్లేట్ల కబాబ్‌లు తెప్పించాడు. మేరీకి మాంసపదార్థాలంటే చచ్చే ప్రేమ. తనకు మేరీఅంటే తగనిఇష్టం. ఈ ఐదారుమాసాలలో మోహన్ జందెం ఇంటోపారేసి గుడ్లూ, మాంసం అలవాటు చేసుకొన్నాడు. తినమరిగాక పులివాట మయింది అతని రుచీ, ఆకలీకూడా.

తను చెప్పా అనుకున్నదేదో ఎలా మొదలుపెట్టాలో తెలీక మోహన్ కబాబ్‌ని గబగబ నమలడంతో భావ ప్రకటనకి నాంది పలికాడు. మేరీ కొంచెంగా నవ్వి, ఇంకొంచెం నాజూకుగా తినమని గోముగా ప్రేమగా చెప్పింది.

చిన్నకుర్రాడు బిక్కమొగం వేసుకుని 'అమ్మా' అన్నట్లు 'మేరీ' అని పిలిచాడు మోహన్.

'ఊఁ' అతనివేపే చూడకండానే మత్తుగా నవ్వింది మేరీ. కబాబ్‌లు మరోప్లేటు తెమ్మని కుర్రాడికిచెప్పింది. ఇందాకటిలాగా మళ్ళా మత్తుగా 'ఊఁ' అంది.

మోహన్ ముఖం సీరియస్‌గా పెట్టాడు.

'ప్రేమ' అంటే నీ అభిప్రాయం ఏవిటి మేరీ?' అనడిగాడు.

అదేదో వింతజంతువైనట్లు, అప్పుడే చూసినట్లుగా కళ్లార్పింది మేరీ. రెప్పలు కొంగరెక్కల్లా టపటపలాడాయి.

'చిన్నదాన్ని. నన్నిలా అడిగితే ఎలా? నాకేం తెలుస్తుంది చెప్పండి!' అంటూ నవ్వింది మేరీ. ఆ నవ్వు పచ్చి దొంగనవ్వు. క్రితం రాత్రే చదివిన ఓ వారపత్రికలో ఓ సినీతార ఇచ్చిన జవాబుల్లోంచి ఒక జవాబుని అక్షరం తప్పకుండా అప్పచెప్పింది. ఒక్క తృటి కాలం ఆ సినీనటి మేరీకళ్లల్లో మెదిలింది.

'నీకూ నాకూ ఆరేళ్ళేగా తేడా! అదేమంత పెద్ద తేడా కాదు మన దేశంలో. ఈడూజోడూకి ఈ మాత్రం తేడా వుండాలి' అన్నాడు గబగబా మోహన్.

"అలాగా, ఐతే సరే!" అంది మేరీ.

"చూడు మేరీ! ఈ దిక్కుమాలిన సమాజంలో వాస్తవిక ప్రేమకు విలువ లేకుండా పోయింది! కులాలు మతాలు నీతీ జాతీ—" చప్పున నాలిక కొరుక్కుని మళ్లా "మేరీ ఏదో ఆవేశం నాలో పొంగింది. పడుచురక్తం పల్లవిస్తోంది. ఈ అడ్డగోడలే లేకపోతే నువ్వూ—నేనూ—" వాక్యం పూర్తి కాకముందే కబాబ్‌ల్ని గబగబ నమిలి మింగాడు. పొలమారింది. కళ్ళవెంట నీళ్ళు గిర్రున తిరిగాయి.

అతని నెత్తిమీద అరిచేత్తో నెమ్మదిగా తాటిస్తూ మంచినీళ్ళగ్లాసు నోటి కందించింది మేరీ.

"ఔను మోహన్! నిన్ను నీవే వోదార్చుకోవాలి! స్తిమితపడాలి. ఈమాత్రం నీ సరసను కూచుని హాయిగా మాట్లాడే అదృష్టం అయినా లభించింది. అందుకైనా తృప్తిపడాలి. సంఘ భయం, జైలుభయం లేకపోతే—నిజంగా నువ్వూ—నేనూ—" ఆపైన పూర్తిచేయకుండానే మిస్ మేరీ ఏకదమ్మున రెండు కబాబుల్ని నోట్లో కుక్కి నమిలి మింగింది.

సరిగ్గా, అదే సమయాన డబల్ డెక్ వొచ్చి ఎదురుగా ఆగింది. అందులో జాన్ వున్నాడు. జాన్ పిళ్ళసి చూడ లేదు. మేరీ అతన్ని చూసింది. తుళ్ళి పడింది. డబల్ డెక్ వెళ్ళిపోతోంది.

"ఏవిటి మేరీ అలా ఉలిక్కిపడ్డావ్?" అనడిగాడు మోహన్.

"అబ్బే, మరేం లేదు మోహన్. ఇవాళ ఇంటికి తొందరగా వెళ్లాలి. మా అమ్మకి మళ్లా జబ్బు తిరగబెట్టింది. డాక్టర్‌కి చూపించాలి. నెలమధ్యకదూ! గుర్తొచ్చి గుండెల్లో బరువెక్కింది" కళ్ళల్లో నీళ్ళు తొంగిచూడబోయి ఆగాయి. గొంతులో ఏడ్పు మూల్గు

రాబోయి ఆగిపోయాయి. మోహన్ గుండెలు కరిగి నీరై పోయాయి.

"నే నుండగా నువు భయపడక్క ర్లేదు మేరీ! ఇదుగో ఈ పాతికా ఉంచు. సరిపోతుందిగా! నువు టాక్సీమీద ఇంటికి వెళ్ళిపో. టాక్సీ చార్జీలు కావాలిగా ఇదీ ఉంచు!" అంటూ హడావుడిగా జేబులో డబ్బంతా తీసి మేరీ చేతిలో పెట్టేశాడు. మేరీ కృతజ్ఞతతో మరీమరీ చూసింది. అంత కే తలకిందులై మోహన్ టాక్సీని పిలిచాడు. మేరీని ఎక్కించాడు.

ఒక్క నిమిషంలో జాన్ మేరీని మిస్ అయ్యాడు. మేరీ టాక్సీమీద బస్ స్టాండ్ కి వొచ్చి జాన్ కోసం వెతికింది. విసుగెత్తి టాక్సీ వొదిలేసి, చార్ మీనార్ బస్సెక్కేసింది.

ఆరాత్రి ఒంటరి చీకటిగదిలో కూచున్న జాన్ గుడ్లగూబలా మిటకరించి, తల బద్దలుకొట్టుకుని ఓ చిన్న జాబురాశాడు. ఆఫీస్‌లో లోకల్ టపాలో మేరీ ఆ జాబుని అందుకుంది.

"డియర్ మేరీ! డిశంబర్‌లో మన పెళ్ళి కాకపోతే నేను బతకలేను. నాకు చాతకాదు. బతకను అంటే అర్థం హుసేన్ సాగర్‌లో నా శవం పోలీసులకి దొరుకుతుంది. ఆస్పత్రివాళ్లు దాన్ని కోసి—" ఒక్కో అక్షరం ఒక్కో ఫిరంగి గుండులా మేరీ గుండెల్ని తాకి తూట్లు పొడిచాయి. ఎటొచ్చీ మేరీ మొండిమేరీ ఘటం కనక ఓ అరకప్పు కాఫీ తాగి అంతలో తేరుకుంది. జాబుని మరి పూర్తి చేయకుండానే జాకెట్‌లోపల దాచేసుకుంది.

ఆవేళ ఆఫీస్‌కి మోహన్ రాలేదు. ముకుందం ఒకడే వున్నాడు. మోహన్‌కేమన్నా జబ్బుచేసిందా? చేస్తే? మరి ఆలోచించలేకపోయింది మేరీ. మోహన్ ఎప్పుడో మాటల్లో తన ఇంటి చిరునామా చూచాయగా చెప్పిన సంగతి గుర్తుకొచ్చింది.

ఆఫీస్‌నించి పెందరాళే బయటపడి మేరీ చార్‌మీనార్ బస్సెక్కకుండా సనత్‌నగర్ బస్సెక్కేసింది. నిన్న తనకింత సహాయం చేసినందుకు మోహన్‌కి స్వయంగా కృతజ్ఞత చెప్పడానికి వెళుతోంది. ఇంతకన్నా ఆడపిల్ల ఏం చేయగలదు?

సనత్‌నగర్‌లో దిగి మేరీ మోహన్ ఇంటిని త్వరలోనే కనుక్కోగలిగింది. తెలివిగలఘటం! ఆసమయాన మోహన్ ఇంట్లో లేడన్న సంగతి మేరీకి ఎలా తెలుస్తుంది!

అక్కడ ఒంటిగది కొంపలు చాలా ఉన్నాయి. అలాంటి కొంపల్లో ఒకదాంట్లో మోహన్ ముసలి తలిదండ్రులు కాళ్లారజాపుకుని కూచున్నారు. బజారు మట్టిలో పొర్లాడుతూ గాలి కెదుగుతున్న ముగ్గురు భావిభారతపౌరుల్ని చూసింది. వాళ్లు ముగ్గురూ






మోహన్ సంతాన రత్నాలని పసిగట్టింది. వాళ్లని పలకరించింది.

వాళ్ళనించి మోహన్ జాడ తెలిసే అదృష్టం లేదు.

పెంకిఘటాల్లాగ వున్నారు.

ఇంతలో ఇంట్లోనించి శ్రీమతి మోహన్ వొచ్చింది. ఆవిణ్ణి చూడగానే మేరీకి సినిమాల్లో కనపడే రోలర్ లాంటి వ్యక్తి గుర్తుకొచ్చింది. మేరీని చూడగానే "ఈ మాయా మోహిని ఎవరా?" అని తర్కించుకొంది శ్రీమతి మోహన్. నోరు విప్పింది.

కొద్ది సెకన్లలో తన స్థితి మేరీకి అర్ధమయింది. తనని నడివీధిలో నిలబెట్టి ఊరూ పేరూ జాతీజన్మా అంతా అడుగుతున్న శ్రీమతి మోహన్, ఏమాత్రం నిజం చెప్పినా తనని కడిగేసి దులిపేస్తుందని గ్రహించింది. చప్పున మేరీ అందమైన అబద్ధాలతో అల్లిన పెద్ద బుట్టలో శ్రీమతి మోహన్ని కూచోబెట్టేసింది. ఆఖరికి తన పేరు కూడా మార్చేసి చెప్పింది. గిరుక్కునమరలి బస్టాండ్ కి వచ్చేసింది.

ఆ రాత్రి—

మేరీకి చాలాసేపు నిద్ర పట్టలేదు. సంగతులన్నీ మరిచిపోడానికి ప్రయత్నించింది. మరిచిపోగల ననుకున్నాక భగవంతుణ్ణి మనస్ఫూర్తిగా ప్రార్థించి

మేరీ నిద్రపోయింది. తెల్లారి నిర్మలంగా లేచింది. హాయిగా ఆఫీస్‌కి వొచ్చింది. ముకుందాన్ని మోహన్‌ని విడివిడిగా జంట జంటగా పలకరించి చిరునవ్వుల్ని చిలకరించింది.

స్వయంగా కేలండర్‌లో రెండో షీట్‌ని చించేసింది. కొత్త నెల, కొత్త రోజు - జీతాలు పుచ్చుకొనే రోజు వొచ్చింది.

ఆఫీస్ జాస్మిన్ పరిమళాలతో కాక పోయినా సోపు వాసనతో నిండిపోయింది.

*  *  *

సంవత్సరాంతంలో పరంధామయ్య గారు బోనస్‌లిస్తారని తెలిసిపోయింది. వచ్చే నెలాఖరున జీతాలు బోనస్‌లు కలిపి అప్పులు తీర్చేయగలమని మగ గుమాస్తాలు ఆశించారు.

ఒకవారం రోజులుగా ముకుందం చాల హుషారుగా ఉంటున్న సంగతి జాకాల్ మేనమామ మోహన్ పసి కట్టేశాడు. అతి జాగ్రత్తగా ముకుందాన్ని గమనిస్తున్నాడు.

టీ సమయంలో మేరీ ముకుందాన్ని చాల మృదువుగా ఇంగ్లీషులో 'మీరు తీసుకొన్న మాగజైన్ తిరిగి నాకు ఇమ్మని అడిగినట్లయితే - మీరు మరో లాగ అనుకోరని నేను అనుకో వచ్చునా?' అనడిగింది.

ముకుందం పచ్చి తెలుగులోనే అన్నాడు.

'సారీ మేరీ! మరో రెండురోజుల్లో ఇచ్చేస్తాను. మరోలా అనుకోకు! ప్లీజ్!'

మేరీ ఏమనుకోలేదు కాని పాము చెవు లప్పగించి వింటున్న మోహన్ చాలా అనుకొన్నాడు.

'ఇదేదో మిస్టరీ! కాతా పుస్తకాలు తప్ప - ప్రపంచంలో మరో అక్షరం ఉందని ఈ ముకుందానికి తెలీదే! అలాంటి ముకుందం మాగజైనుని - వారం రోజులుగా చదువుతున్నాడా? ఇది తప్పకుండా ఏదో రహస్యతంత్రమే సుమా' ఇన్ని రకాలుగా ఆలోచించాడు మోహన్.

ముకుందం మాత్రం డ్రాయర్ తెరచి, తెరచి ఉంచిన మాగజైన్‌ని తదేకంగా చూస్తున్నాడు ఈ వారం నించి అతను చూస్తున్నది ఒకే ఒక పేజీని. ఆ పేజీలో ప్రధానమైన విశేషం ఒకటి ఉంది- ఆ పేజీ ఫజిల్ పేజీ.

క్రితంఫజిల్‌లో ఇరవై వేలు మొదటి బహుమతి పొందిన సైకిల్ షాపు వోనరు రామయ్య ఫొటోఉంది. అదృష్టవంతుడు. సైకిల్ షాపు ఎత్తేసి చిన్న కార్ల కంపెనీ పెడతాడేమో! ముకుందానికి చెప్పరాని చిరుకోపం వొచ్చింది. పేజీ మధ్యలో మరోకొత్త ఫజిల్ ఉంది. ముకుందానికీ తన తెలివి




తేటలపై అపారమైన నమ్మకంవుంది. ఈసారి బహుమతి మొత్తం రెట్టింపు వుంది. నలభై వేలు! గెలిచి తీరాలి! గెలిచి తీరతాడు!

ఈ మాగజైన్ మేరీ చేతులలోంచి వొచ్చిందయ్యో. మేరీ హస్తవాసి మంచిది. మేరీ ముఖంచూసి బయల్దేరితేసరి కొత్త అప్పులు పుడుతున్నాయి. అంతమంచి ముఖం. ఈ నలభై వేలు చేతికి రావడంతో తన దశ తిరిగిపోతుంది! మేరీ? డబ్బుకి దాసోహమనని వారు చరిత్రలో లేరు. ముకుందం కళ్లు జ్వలిస్తున్నాయి. తలమాత్రం కొంచెం తిరిగినట్లయింది.

మేరీ ఆమధ్య ఒకనాడు పబ్లిక్ గార్డెన్‌లో జాన్‌ని కలుసుకుంది. చర్మం మొద్దుబారేలాగ చివాట్లు వేసింది. విరహగీతాలు పాడ్డం మానేయమంది! హత్యలు ఆత్మహత్యలు సినిమాలకే కాని జీవితాలకు కాదని బుద్ధిచెప్పింది. వొట్టేయించింది. ఘాటైన మందు తగిలితే మలేరియా పారిపోయినట్లు జాన్‌కి అన్నిబద్ధకాలు వదిలిపోయాయి. మేరీకి ప్రమాణం చేశాడు. హుషారు వచ్చింది. ఆ సంతోషానికి చిహ్నంగా తనుకొన్న కొత్త మాగజైన్‌ని మేరీకి ధారాదత్తం చేశాడు. అందులో ఓ

గమ్మత్తయిన ప్రేమకథ వుంది చదవమన్నాడు. ఓకే అంది మేరీ.

మేరీ ఆ పత్రిక తెరవలేదు. నూరు ప్రేమకథలు చదివి నేర్పిందానికంటే జీవితం నేర్పిన ఏ చిన్నపాఠమైనా గొప్పదని మేరీ నమ్మకం. ఇంతవరకు దాన్ని ఎవరూ తొలగించలేకపోయారు. హాస్తభూషణంగా ఆ పత్రికను ఆఫీస్‌కి తెచ్చింది మేరీ. ముకుందం పలకరించి మాగజైనుని అందుకున్నాడు. విప్పడమే తరువాయి ఫజిల్ పేజీ కనిపించింది. అంతే. దాన్ని డ్రాయర్లో పెట్టాడు. ఈ వారంరోజులనించి ఒకటే తపస్సులో మునిగి తేలుతున్నాడు. ఫలించిందా నలభై వేలు చేతికి వొస్తాయి. పరిహసించే ఈ వెధవ ప్రపంచాన్ని ఎడం కాలితో తన్నేయవచ్చు. ముకుందం వొళ్ళు గరిపొడిచింది.

మోహన్ ప్రతినిమిషం మెలకువగా ఉన్నాడు.

ముకుందం బయటికి వెళ్ళినప్పుడు, అర్జంట్ కాగితాలు కావాలన్న నెపంతో మోహన్ ముకుందం డ్రాయర్ని తెరిచిచూశాడు. నిమిషాల్లో రహస్యతంత్రాన్ని భేదించాడు. ఆ నిమిషంలో ఆకాశాన్నించి నలభైవేల వెండి నాణాలు వర్షిస్తున్నట్లు, మోహన్‌కి తోచింది.

ఆ మర్నాడు ఫజిల్ పంపవలసిన గడువు – ఆఖరిరోజు ! ముకుందం చాల హుషారుగా ఆఫీస్‌కి వచ్చాడు మేరీని అత్యవసరంగా ఐదు నిమిషాలు పొగిడాడు. ఆతర్వాత తను పూర్తిచేసిన ఫజిల్ చిత్తుప్రతి మేరీచేతిలో పెట్టాడు.

"మేరీ! నీ చేత్తో కాపీ చేసి ఇస్తే నాకు కలసివొస్తుంది. ప్లీజ్" అని అన్నాడు.

మేరీ సన్నగా నవ్వింది.

"మీకు కలిసివొస్తే నా కొరిగేదేవిటి ?"

"ఇదుగో. నువ్వేం కోరితే అది !" అన్నాడు నవ్వుతూ ముకుందం !

"నిజంగా ఇస్తారా ?"

"ముమ్మాటికి !"

"మాట తప్పరుగా ?"

"అడిగిచూడు ! నీకే తెలుస్తుంది !"

మేరీ మరోసారి చల్లగా తీయగా నవ్వింది.

"మీరు హాయిగా ఉండడమే నాక్కావలసింది! అంతకంటే నాకు మరేం అక్కర్లేదు" అంది మేరీ.

ముకుందం జావకారాడు. మేరీ ఏదో అడుగుతుందని ఊహించాడు. తనంత దా వలచి వస్తుందనుకున్నాడు.

తలపండిన వేదాంతిలా మాట్లాడాడు.

"మేరీ ! భౌతికంగా కాకపోయినా ఆధ్యాత్మికంగా ఈ ముకుందం సర్వస్వం




నీదికాదా ? నమ్మలేవు. నిజానికి నీది కానిది నాకేముంది ?"

మేరీ తలవంచుకుని మేలుప్రతి శ్రద్ధగా తయారుచేస్తోంది. మేరీ మనిషి లాగా దస్తూరీకూడా ముచ్చటగా ఉంటుంది.

ఫజిల్ వెంట పంపవలసిన పోస్టల్ ఆర్డర్ కోసం ముకుందం బయటికి వెళ్లాడు,

మోహన్ పక్కనున్నాడన్న సంగతే మరిచిపోయింది మేరీ ! మోహన్ ఆ మాగజైన్ని ఓ లైబ్రరీలో చదువుతూ చదువుతూ ఫజిల్ పేజ్ని జాగ్రత్తగా చించి మడిచి జేబులో భద్రపరచుకొన్నాడు. తోవలో పోస్టాఫీస్లో పోస్టల్ ఆర్డర్లు కొనేశాడు.

ఇపుడు కోరుకొన్న సమయం చిక్కింది.

మేరీ రాస్తున్న దాన్ని నేత్రావధానంతో లాగేశాడు. మేరీ కాపీరాసే సరికి మోహన్కూడా పూర్తిచేశాడు.

మేరీ హస్తవాసిమీద మోహన్కి నమ్మకంవుంది.

కవరు మీద మేరీతో అడ్రస్ రైట్ చేయించాడు.

మేరీ ఆశ్చర్యాన్ని దాచుకుంది.

కొద్ది నిమిషాలముందు గడపదాటిన ముకుందం మోహన్ చేసిన పనిని పసి గట్టేశాడు. తనకు రానున్న నలభై వేలల్లో ఇరవై వేలు మోహన్‌కి వాటా వచ్చేస్తుంది. తప్పదు !

ఒక్కనిమిషం అతని బుర్ర దెయ్యాల కొంపగా మారిపోయింది. నిగ్రహించు కొన్నాడు.

ఏమీ ఎరగనట్లు తను కుర్చీలో కూల బడ్డాడు.

మేరీకి ఫోన్ కాల్ వచ్చింది. జాన్ అర్జంటుగా రమ్మన్నాడు. పెందరాళే మేరీ బయల్దేరింది.

ముకుందం పూర్తిచేసిన కవరు మేరీనే పోస్టుచేయమని అభ్యర్థించాడు.

మేరీని సాగనంపడానికి వెళ్ళి మోహన్ తన కవర్ని కూడా పోస్ట్ చేయమని ఇచ్చి తిరిగివచ్చాడు.

రెండు అదృష్టజాతకాల్ని చేతబట్టు కుని మేరీ లిఫ్ట్ దిగిపోయింది.

ముకుందం టిఫిన్ కాఫీ తెప్పించి మోహన్‌కి అందించాడు. ముకుందం మంచి హుషారులో ఉన్నాడని అను కొన్నాడు మోహన్. తను చేసింది ముకుందానికి తెలీదనుకున్నాడు.

ముకుందం తల మళ్ళీ దయ్యాల కొంపగా మారింది. చిన్నప్పుడు "డాక్టర్ జెకిల్ అండ్ హైడ్" నవల చదివి జడుసుకొన్నాడు. కాని తనలో ఇప్పుడా రెండురూపాలు తాండవిస్తు న్నాయి.

ముకుందం మోహన్‌ని మాటల్లోకి దించి చల్లగాలికి కారిడార్‌లోకి తీసు కొని పోయాడు. పిట్టగోడ కానుకుని నగరాన్ని, చీమలబారుల్లా సాగిపో తున్న జనాన్ని చూస్తున్నారు.

ముకుందం మోహన్‌కి దూరాన కనిపిస్తున్న నౌబత్ పహాడ్ మీది కొంగనో డేగనో చూపించాడు. మోహన్ అదెక్కడుందాని చూస్తు న్నాడు

ఒక్క నిమిషంలో –

మోహన్ రెండుకాళ్ళని పట్టుకొని ముకుందం పైకెత్తేసి వదిలేశాడు. మోహన్ పారాచూట్‌తో దిగే యోధుడిలా ఎనిమిదో అంతస్తునించి కింద రోడ్డుమీదికి పడిపోయాడు.

ఆ నిమిషంలో – మోహన్ వేసిన వెర్రికేక ముకుందానికి పిచ్చెత్తించింది. అలాగే నిలబడిపోయాడు.

పోలీసులు, జనం ఎనిమిదంతస్తుల భవనంనిండా ఈగల్లా మూగారు. ముకుందం అరెస్టయినాడు.

కేలండర్ చివరికాగితంకూడా చిరిగి పోయింది.

పజిల్‌లో, మొదటి బహుమతి నలభై వేలు మిస్ మేరీకి వచ్చింది.



జయశంకర్ ప్రసాద్

మాఘ అమావాస్యనాడు ప్రతి సంవత్సరం గంగానదీ తీరంలోని ప్రతిష్ఠానపుర ప్రాంతాల్లో జన కోలాహలం అతిగా వుంటుంది. ఈ సంవత్సరం ఆ దినం మరింత ప్రత్యేకతా, విశేషం కలది కావటంతో గంగానదిలో స్నానాలు చేసేందుకు ఎక్కడెక్కడినుంచో ప్రజలు విపరీతంగా వచ్చారు. ఆ సాయంకాలం సూర్యాస్తమయానికి కొంచెం ముందుగా చిన్న మతకలహం ఒకటి జరిగి, అప్పుడు రేగిన జనం తొక్కిడిలో చాలా మంది గాయపడ్డారు. కొందరు మరణించారు. కాళ్ళు విరిగినవాళ్ళూ, పక్కటెముకలూ, చేతులూ నలిగినవాళ్ళూ గంగాతీరం ముందు నిస్సహాయులుగా పడివుండి ఆర్తనాదాలు చేస్తున్నారు. కొందరు స్వయం సేవకులు యిలాంటి వారికి సహాయపడేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు.

నదీతీరంలోని యీ భయంకర, దీనదృశ్యాలకు ఎడంగా ఒక గూడునావ ప్రయాణిస్తున్నది. అది క్రమంగా ఝూంసీతీరం వైపుకుపోయి ఒడ్డుచేరింది. ఒక

యౌవనపురుషుడూ, ఒక యువతీ—వారి వెనకగా మధ్యవయస్కుడైన నౌకరూ, నావలోంచి ఒడ్డుకు దిగారు. నౌకరు చేతిలో ఒక బుట్ట వున్నది. దాని నిండా పళ్లూ, మిఠాయిలూ వున్నాయి. ముగ్గురూ నదికి సమీపంలోవున్న సాధువుల కుటీరాలకేసి నడిచారు.

వాళ్ళు అక్కడున్న కుటీరాల్లో ఒకదాన్ని చేరబోయేంతలో, లోపలినుంచి నలుగురైదుగురు భక్తులు బయటికి వచ్చారు. వాళ్ళు కుటీరంలోని సాధువును గురించి చాలా గొప్పగా చెప్పుకోసాగారు: సాధువు సాక్షాత్తూ భగవదంశకలవా డన్నాడొకడు; ఆహాఁ, ఏమా బ్రహ్మతేజస్సు అన్నాడు మరొకడు. నిజంగా మహాత్ముడు, అద్భుతవ్యక్తి అన్నాడు మరొకడు.

పడవమంచి దిగిన ముగ్గురూ వాళ్ళ మాటలు విని ఆనందపరవశులైపోతూ కుటీరంముందుగల పందిటిలోకి వెళ్ళారు. అక్కడ చాలా మంది భక్తులున్నారు. లేతకాషాయరంగు వస్త్రాలు ధరించిన ఒక యువసాధువు, ఉన్నతాసనంమీద కూర్చునివున్నాడు. అతడి శిరోజాలు భుజాలమీద చెల్లాచెదురుగా పడివున్నవి. అతడి నేత్రాల్లో కాంతీ, సంయమాలు తొణికిసలాడుతున్నవి. పుష్టిగల దేహం, మంచి వర్చస్సుగల మొహం—నిజంగా ఆ సాధువు పూజింపదగినవాడులా కనిపిస్తున్నాడు.

యౌవనుడూ, యువతీ సాధువును సమీపించి భక్తితో నమస్కరించి పళ్ళూ, మిఠాయిలూ గల బుట్టను అతడి ముందు పెట్టారు. యువసాధువు వారిద్దరికేసీ ఓసారి చూసి చిరునవ్వునవ్వాడు. ఆ సమయంలో ఆయన ఒక సంస్కృత శ్లోకానికి వ్యాఖ్యానం చెబుతున్నాడు: 'ఓ, భక్తుడా మౌనం విడవకు, అన్నా డొక జ్ఞాని.' అని చెప్పి సాధువు, "మూగవాడు బెల్లం రుచిని వర్ణించలేడు గదా? ఉప్పుకల్లు సముద్రజలంలో కలిసిన తరవాత, తన రూపాన్నీ, గుణాన్నీ వర్ణించలేదుగదా? అదేవిధంగా పరబ్రహ్మ విషయంలో కూడా యిదమిత్థమని చెప్పటం సాధ్యమయేది కాదు. అందుచేతనే, ఆ జ్ఞాని నిజమైన భక్తుణ్ణి మౌనం వహించమన్నాడు" అని వ్యాఖ్యానం ముగించాడు.

అక్కడ చేరిన భక్తులందరూ సాధుమహాత్ముని విద్వత్తుకు చాలా ఆశ్చర్యం, ఆనందం కనబరిచారు. "ధన్యులం! ధన్యులం!" అన్న ప్రశంసా వాక్యాలతో ఆ మండపప్రాంతం అంతా ప్రతిధ్వనించింది. పడవ దిగివచ్చిన యౌవనుడూ, యువతీ కూడా తాము ఆ సాధువు దర్శనంకోసం రావటంలో గొప్ప తెలివైన పని చేశామనుకున్నారు. భక్తులొక్కరొక్కరే అక్కడి నుంచి వెళ్ళిపోయింతరవాత,

సాధువు యౌవనుడికేసి తలతిప్పి చిరునవ్వు నవ్వుతూ, "మీ పేరూ అదీ చెప్పలేదు," అన్నాడు.

"నా పేరు శ్రీ చంద్ర్. ఈమె నా భార్య. మాది అమృతసర్," అని యౌవనుడు తన భార్యకేసి చూశాడు. సాధువు దృష్టికూడా అదే సమయంలో యువతిమీదికి ప్రసరించింది. తన పేరు తెలుసుకునేందుకు ఆ మహాత్ముడు తనకేసి చూశాడన్న భావం యువతికి కలిగింది. ఆయనున్నుంచి ఏదో గొప్ప బహుమానం, వరం పొందాలనే పేరాశలో ఆమె పడిపోయింది. ఆమె తల వంచుకుని, "భక్తురాలి పేరు, కిశోరి," అన్నది.

సాధువు చూపుల్లో చిన్న మెరుపొకటి మెరిసింది. ఆయన చప్పున తల వంచుకుని, "సరే, వెళ్ళిరండి. సదా భగవంతుణ్ణి స్మరిస్తూ వుండండి," అన్నాడు. శ్రీచంద్ర్, కిశోరీ ఆయనకు మరోసారి నమస్కారంచేసి, నౌకరుతో అక్కణ్ణించి కదిలారు.

భక్తజనం అంతా వెళ్ళిపోయింతరవాత సాధువు చాలాసేపు ఆలోచిస్తూ కూర్చుని, మెల్లిగా ఆసనం మీదినుంచి లేచి, కంబళీ ఒకటి కప్పుకుని చీకట్లో నడిచిపోయి గంగాతీరం చేరాడు. ఆ బ్రహ్మచారి సాధువు హృదయంలో పెను తుఫాను రేగుతున్నది. మనస్సును కుదుటపరచుకుని వైరాగ్యభావాన్ని మననం చేయచూశాడు గాని, అతడికది సాధ్యంకాలేదు. మనోదౌర్బల్యం ప్రలోభంగా రూపుదాల్చి, అతణ్ని ప్రలోభంవైపుకు యీడ్చుకుపోతున్నది...

జీలంనది ఒడ్డున ఒక బాలుడూ, బాలికా రోజూ సాయంవేళల్లో ఆటలాడుతూండేవాళ్ళు. వాళ్ళ హృదయాల్లో ఒకరిపై ఒకరికి ఏదో కుతూహలం, అభిలాష. బాలుడు రంజన్‌కు ఎనిమిది సంవత్సరాలు నిండాయి, బాలిక కిశోరికి ఏడేండ్లు. ఆ దశలో రంజన్ తలిదండ్రులు హరిద్వారానికి ప్రయాణమయారు.

రంజన్ తలిదండ్రులతో కలిసి హరిద్వారం వెళ్ళేరోజున కిశోరి అతడితో, "రంజన్, మళ్ళీ ఎప్పుడు వస్తావ్?" అన్నది.

"తొందరగానే తిరిగొస్తాము. నీకు మంచి బొమ్మలు తెచ్చిపెడతాను" అన్నాడు రంజన్.

రంజన్ను అతడి తలిదండ్రులు హరిద్వార్‌లో ఒక మహాత్ముడికి సమర్పించారు. ఆ మహాత్ముడి దయవల్లనే ఆ తలిదండ్రులకు రంజన్‌తోపాటు మరికొంత సంతానం కూడా కలిగింది. అందుకు భక్తిచిహ్నంగా తమ జ్యేష్ఠుణ్ణి అతడికి సమర్పిస్తామని ఆ తలిదండ్రులు మొక్కుకున్నారు.

ఆ మహాత్ముడు రంజన్‌కు, దేవనిరంజన్ అని నామకరణంచేశాడు. దేవనిరంజన్ ఆదర్శ బ్రహ్మచారిలా పెరిగి పెద్దవాడయాడు. మహాత్ముడు అతడి ప్రతిభకూ, పాండిత్యానికీ సంతసించి, పందొమ్మిదవఏటనే అతడికి మఠాధిపత్యం ఒప్పగించాడు.

హరిద్వారంలో యీ నూతన సాధువు కీర్తిప్రతిష్ఠలు త్వరలోనే చాలా పెద్దపెద్ద సాధువులకు కూడా ఈర్ష్య కలిగించినై. దేవనిరంజన్ మఠంలో పూజలూ, భక్తుల కానుకలూ పెరిగిపోసాగాయి. వచ్చిన ధనాన్ని అతడింతకాలంగా సద్వినియోగం చేస్తూ, భక్తుల దృష్టిలో ఒక మహాత్ముడై పోయాడు. స్వార్థలోభాల కతడి హృదయంలో యీనాటివరకూ స్థానం లభించలేదు.

కాని, కిశోరి పేరు వింటూనే దేవనిరంజన్, పన్నెండేళ్ళనాటి తన బాల్య జీవితాన్ని స్మృతికి తెచ్చుకున్నాడు. "కిశోరీ, నీకు మంచి బొమ్మలు తెచ్చిపెడతాను" అన్నాడా నాడతను కిశోరీతో. ఆ కిశోరీయేనా, యీ కిశోరీ?

గాఢాంధకారంలో గంగానది ఒడ్డున ఏకాకిగా నిలబడి దేవనిరంజన్ ఆలోచిస్తున్నాడు. తన బాల్యస్నేహితురాలు కిశోరీయే, యీనాడు తన దగ్గరకు వచ్చిన కిశోరీ అన్న నమ్మకం అతడిలో బలపడింది. ఆమెకు యవ్వనంలో ఆడుకునేందుకు ఒక బొమ్మ దొరికిందన్నమాట—భర్త. అత నామెను సుఖపెడతాడు, సందేహం లేదు. తపస్వినైన నేను ఆమెను గురించి ఎందుకు ఆలోచించాలి? ఆమెతో నాకు సంబంధం ఏమిటి? జీవితం బుద్బుదప్రాయం. ఇటువంటి కిశోరీలు ఎంతో మంది అనంత కాలసాగరంలో కలిసిపోతారు. నా కెందుకొచ్చిన చింత?

ఇలా మథనపడుతూన్న దేవనిరంజన్‌కు హఠాత్తుగా, ఆనాడు కిశోరీకి బొమ్మలు తెచ్చి ఇస్తానన్నమాట ఒక వాగ్దానంలా, ప్రతిజ్ఞలా తోచింది. ఈ భావం కలగ్గానే తానేదో పెద్ద మోసంలో చిక్కుపోతున్నట్టు అతను భయపడ్డాడు. వాళ్ళు ఒహుశా రేపు మరోసారి తన దర్శనానికి వస్తారు. తాను మోహం లోపడి కొట్టుకుపోయే ప్రమాదం వున్నది.. ఇప్పుడు తన కర్తవ్య ... ఈ ప్రదేశం వదిలి పారిపోవటమే... ఎక్కడికి?

ఏదో పెనుభూతం వెన్నంటి తరుముతున్నవాడిలా భయవిహ్వలుడై పోయి, దేవనిరంజన్ గంగానది ఒడ్డునుంచి సరాసరి రైల్వేస్టేషన్‌కు పోయాడు అక్కడ జనసమ్మర్దం అధికంగా వున్నది. స్టేషన్‌లో ఆ సమయానికి ఒక బండి ఆగివున్నది. రైల్వేకూలీ ఒకణ్ణి, "ఈ బండి ఎక్కడికి పోతుంది?" అని అడిగాడు దేవనిరంజన్.

"సహారన్‌పూర్," అన్నాడు కూలీ. దేవనిరంజన్ మరి ఆలోచించకుండా ఒక కంపార్ట్‌మెంట్‌లోకి వెళ్ళి కూర్చున్నాడు.




ఆ మర్నాడు సాధువును దర్శించుకునేందుకు శ్రీచంద్ర్, కిశోరిలు అతడి కుటీరానికి వచ్చారు. అక్కడ కొందరు సాధువులూ భక్తులూ మహావ్యాకులపాటుతో మాట్లాడుకుంటున్నారు. శ్రీచంద్ర్ అడగగా వాళ్ళు, మహాత్మాజీ సమాధికోసం హరిద్వారం వెళ్లారని చెప్పారు. ఇక్కడ ఆయన ఉపాసనకు అన్నీ విఘ్నాలే కలుగుతున్నాయనీ, పుత్రుడ్ని ప్రసాదించమనీ, ధనం ప్రసాదించమనీ, ఆయన్ని జనం బాధిస్తున్నారనీ అన్నారు.

కిశోరీ బాధా, కోపం కలబరుస్తూ భర్తతో, "నేను మొదటినుంచీ అనుకుంటూనే వున్నాను మీవల్ల ఏమీకాదని. మీరు చెప్పనూలేదు, నన్ను అర్థించనివ్వాలేదు," అన్నది.

శ్రీచంద్ర్ కాస్త విసుక్కుని, "అయితే నిన్నేమన్నా అడ్డుపరిచానా? ఆయన్ని సంతానంకోసం నిన్ననే ఎందుకు వేడుకోలేదు?" అన్నాడు.

కిశోరీ ఉద్రేకంగా, "సరే, లెండి ఇక హరిద్వారం వెళ్ళక తప్పదు," అన్నది.

"అలాగే వెళుదువుగాని. నేను ముందు అమృతసర్‌కు టెలిగ్రాం పంపాలి. వ్యాపారం యిన్నాళ్లు మరెవరి అధీనంలోనో వుంచి, అక్కడా యిక్కడా తిరగటం మంచిదికాదు," అన్నాడు శ్రీచంద్ర్.

"అలాగే చేయండి. నేను మాత్రం హరిద్వారం వెళ్ళితీరాలి," అన్నది కిశోరీ పట్టుదలగా.

శ్రీచంద్ర్ ముఖం కందగడ్డలా చేసుకున్నాడు. కిశోరీ మాత్రం తన పట్టు విడవదలచలేదు. ఆ మహాత్ముడు తనకు తప్పకుండా సంతానం ప్రసాదించగలడని ఆమెకు పూర్ణ విశ్వాసం ఏర్పడిపోయింది. ఆ రోజే శ్రీచంద్ర్ హరిద్వారానికి బయలుదేరాడు. మఠం పనులు చూసే భండారీ కొందరు భక్తుల్ని వెంటబెట్టుకుని, తానూ హరిద్వారానికి ప్రయాణమయ్యాడు.

హరిద్వారానికి సమీపంగా గంగానదీ తీరంలో ఒక పెద్ద తపోవనం వున్నది. అందులో చిన్నచిన్న కుటీరాలు కొన్ని వరసగా, క్రమబద్ధంగా నిర్మించబడి వున్నాయి. తపస్సాధన చేసేవారు ఆ కుటీరాల్లో నివసిస్తూంటారు. హరిద్వార్‌లో వున్న పెద్దపెద్ద మఠాల్లోని అన్నసత్రాలనుంచి, వారు భిక్ష తెచ్చుకుంటూ ఉంటారు.

గంగానది కొంచెం మలుపుతిరిగినచోట, కొంత భూభాగం ముందుకు చొచ్చుకు వచ్చింది. ఆ ప్రదేశాన ఒక అందమైన పర్ణకుటీరం వున్నది. ఆ కుటీరం అరుగు మీద గంగానదికేసి ముఖం పెట్టి నిరంజన్ ధ్యానంలో వున్నాడు. అతడి ధ్యానం పదేపదే భగ్నమవుతున్నది. ఒక బాలిక సుందరరూపం మనస్సులో మెదిలి, అతడి ఏకాగ్రతను పాడుచేస్తున్నది.

నిరంజన్ విసుగ్గా కళ్ళు తెరిచి కుటీరంలోకి పోదామనుకునేంతలో, కాలిబాట వెంట ఒక యువతి అతడి కంటబడింది. ఆమె అడుగులో అడుగు వేసుకుంటూ అతడున్న చోటుకు వచ్చి సాష్టాంగ ప్రణామంచేసింది. ఆమె కిశోరి !

"ఇక లేవండి. ఇక్కడి కెందు కొచ్చారు ?" అని అడిగాడు నిరంజన్ విసుగ్గా.

"ప్రభూ ! నా స్వార్థంకొద్ది వచ్చాను ... ఇంతవరకూ సంతానభాగ్యం కలగ లేదు," అన్నది కిశోరి.

"మీ వయసు పద్దెనిమిదీ పందొమ్మిది ఏళ్ళకు మించివుండదు. ఈ వయసుకే సంతానంకోసం అంత విచారపడటం ఎందుకు ?" అన్నాడు నిరంజన్.

కిశోరి ముఖం సిగ్గువల్ల ఎర్రనైంది. నిరంజన్ కళవెళపడ్డాడు. ఓ క్షణం తరవాత అతడు కాస్త స్థిమితపడి, "మీరు ఇక్కడికి రావలసిందికాదు. ఇది నా ధ్యానకుటీరం. రెండురోజు లాగి నా మఠానికి రండి," అన్నాడు.

కిశోరి యీ మాటల్లోని కటుత్వాన్ని ఏమీ గుర్తించక, ఆశగా నిరంజన్ కళ్ళల్లోకి చూసింది. అతడి కళ్ళల్లో తీవ్రమైన ఆవేదనా, వాంఛా ప్రస్ఫుటం అవుతున్నవి. కాని, కిశోరి వాటి నేమీ గుర్తించలేకపోయింది. ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయినై. ఆమె తలవంచుకున్నది.




"ఇక వెళ్ళండి. తరవాత మఠానికి రండి." అన్నాడు నిరంజన్ గంభీరంగా. కిశోరీ మారు మాటాడకుండా అక్కణ్ణించి కదిలింది.

ఆ రాత్రి కిశోరీ తపోవనానికి దగ్గర్లోనేవున్న తన విడిది ఇంటి కిటికీకి ఎదురుగా కూర్చుని ఆలోచనలభారంతో కుంగిపోసాగింది. భర్త శ్రీచంద్ర్ ఆ ఉదయమే అమృత్‌సర్‌నుంచి టెలిగ్రాం రాగా, వెళ్ళిపోయాడు. ఆమెకిక్కడ నౌకరు బలదేవ్ తోడుగా వుండిపోయాడు. వాడు చాలా నమ్మకస్తుడు, విశ్వాసపాత్రుడు. అయినా, తాను భర్తవెంట అమృతసర్ వెళ్ళిపోవలసింది అనుకున్నది, కిశోరి. కాని, ఆమెకు అంతలోనే తన ఐశ్వర్యం, దాన్ని అనుభవించేందుకు సంతానంలేని దీనదశా మనసులో మెదిలింది. సంతానంకోసం ఎలాంటి ప్రయత్నమూ చేయలేకపోవటం మూర్ఖత్వం అవుతుంది. పైగా జ్యోతిష్కులు కూడా పుణ్యతీర్థాలు సేవిస్తే సంతానం కలిగే అవకాశం వున్నదని చెప్పారు...

కిశోరీ యిలా ఆలోచనల్లో మునిగితేలుతూండగా నౌకరు బలదేవ్ తలుపు తట్టాడు. కిశోరీ తలుపు తెరిచింది. బలదేవ్ ఆమెతో, "అమ్మగారూ! ఎవరో బీదరాలు గోడపక్కన పడుకుని ఏడుస్తూన్నది," అని చెప్పాడు.

కిశోరీకూడా ఆ సమయంలో దైన్యస్థితిలోనే వున్నది. ఆ కారణంగా ఆమె నౌకరుతో, "లోపలికి పిలుచుకురాకపోయావా? పాపం, తింటానికేమైనా యిచ్చే వాళ్ళంగా" అన్నది.

బలదేవుడు కొద్ది క్షణాలతరవాత బక్కచిక్కివున్న ఒక యువతిని ఇంట్లోకి తీసుకువచ్చాడు. ఆమె విధవ, వెక్కివెక్కి ఏడుస్తున్నది. మాసిపోయిన ఆమె చీరచెంగు కన్నీటితో తడిసిపోయింది. కిశోరీ ఓదార్చినమీదట ఆమె తన సంగతి చెప్పింది: ఆమె పేరు రమ. బరేలీలో ఒక బ్రాహ్మడి ఇంటికోడలు. ఆమె మీద నీలాపనిందలువేసి మరిది ఆమె నిక్కడ ఒంటరిగా వదిలిపోయాడు. చనిపోయిన ఆమె భర్త ఆస్తిపాస్తుల్ని కాజేసేందుకు అతడు పన్నిన కుట్ర యిది.

కిశోరీ ఆమె చెప్పినదంతా పూర్తిగా నమ్మింది. తనను ఎంతగానో ప్రేమించే భర్త, వ్యాపారం అవసరం కనబడేసరికి, తన నిక్కడ వదిలి అమృతసర్ వెళ్ళిపోయాడు. "నువ్వేమీ బెంబేలుపడకు! నేను మరి కొన్నాళ్ళు ఇక్కడే వుంటాను. నిన్ను నా చెల్లెలిలా చూసుకుంటాను," అన్నది కిశోరీ, ఆ యువ వితంతువుతో.

రమ చాలా సంతోషపడింది. ఈ విధంగా ఆమెకు ఆశ్రయం అంటూ ఒకటి దొరికింది. కిశోరీ ఆమెకు నౌకరుచేత తిండి పెట్టించి, మంచంమీద పడుకుని ఆలోచించసాగింది. ఆమెకు పురుషులందరూ నిర్దయులులా తోచారు. వ్యాపారం మీది లోభంవల్ల తన భర్త తనను యిక్కడ విడిచి వెళ్ళాడు, సరే, చూస్తాను. ఆయన స్వయంగా వచ్చి తీసుకుపోయేవరకూ నే నిక్కణ్ణించి కదలను. నా పేరు కిశోరీ! అనుకుంటూ నిద్రలోకి జారుకున్నదామె.

మర్నాటి ఉదయం మఠంలోని భక్తుల రద్దీలో కిశోరీకి విరంజన్‌తో మాట్లాడే అవకాశం చిక్కలేదు. ఆ రాత్రి ఆమె భక్తులందరూ మఠం వదలి పోయింతరవాత, విరంజన్ ఒంటరిగా వెన్నెలలో మఠానికి చెందిన ఉపవనంలో పచార్లు చేస్తూండగా వెళ్ళి కలుసుకున్నది. ఆమె నిశ్శబ్దంగా అతడికి ఎదురుపోయి చేతులు జోడించి నమస్కరిస్తూ "ప్రభూ! నాపైన దయచూపరా?" అన్నది.

విరంజన్ ఓ క్షణకాలం ఆశ్చర్యపోయి, కిశోరీని గుర్తించి, "కిశోరీ, నువ్వు నన్ను గుర్తుపట్టగలవా?" అని ప్రశ్నించాడు.

ఆ పన్నని వెన్నెల కాంతిలో కిశోరీ అతణ్ణి గుర్తుపట్టేందుకు ప్రయత్నించింది. కాని, గుర్తు పట్టలేకపోయింది.

విరంజన్ గొంతు సవరించుకుని, "జీలం నది ఒడ్డున రంజన్, కిశోరీ అనే బాలుడూ, బాలికా ఆడుకునేవారు. తన తండ్రి హరిద్వారం తీసుకుపోయే రోజున ఆ బాలుడు బాలికతో, 'కిశోరీ, నీకు బొమ్మలు తెచ్చి పెడతాను,' అన్నాడు. కాని, ఆ బాలుడు తిరిగిరాలేదు. అతడి బాల్య మిత్రురాలు కిశోరీవి నీవేనా?" అని ప్రశ్నించాడు.



తన బాల్యస్నేహితుడు యింత మహాత్ముడా? అన్న ఆశ్చర్యంతో కిశోరీ తబ్బిబ్బయిపోతూ, "అయితే, ఆ విరంజన్ మీరేనా?" అన్నది.

తొట్రుపాటుతో విరంజన్ ఆమె చేయిపట్టుకుని, "అవును, కిశోరీ। నేను ఆ విరంజన్‌నే. విన్ను పొందేందుకే యింతకాలంగా తపస్సు చేస్తున్నాను. ఆ తపః ఫలాన్ని నీ పాదాలదగ్గిర అర్పిస్తున్నా. సంతానం, సౌభాగ్యం, ఔన్నత్యం ప్రసాదించటానికి నాలోవున్న శక్తి అంతా నీదే।" అన్నాడు.

గత స్మృతులూ, ప్రస్తుతమైన సంతానకాంక్షా, కిశోరీని మత్తులో ముంచెత్తింది.

ఆమె దేహం వణకసాగింది. ఆ హృదయ దౌర్బల్యస్థితిలో ఆమె బ్రహ్మచారి దేవ నిరంజన్ విశాల వక్షం మీద తన తలను ఆన్చింది. పైన పండువెన్నెల. గంగా నదిపైనుంచి వసంతసమీరం దేహానికి గగుర్పాటు కలిగిస్తూ మెల్లగా వీస్తున్నది....

రెండు మూడు నెలలు గడిచాయి. నౌకరు బలదేవుడు తన యజమానికి యిక్కడి సంగతి సందర్భాలు రాస్తూ, "తమరు వెంటనే రావటం మంచిది. మీరు రాందే అమ్మగారు యిక్కణ్ణించి కదలరు. ఆమెగారు యిక్కడ మరొక్క క్షణ మైనా వుండటం మంచిది కాదని, నా ఉద్దేశం," అని తెలియపరిచాడు.

వారం రోజులకల్లా శ్రీచంద్ర్ వచ్చాడు. కిశోరీ అసలే తీవ్ర స్వభావురాలు, భర్త మీద ఉగ్రురాలై పోయింది. ఇరవై నాలుగ్గంటల్లో తిరిగి భార్యాభర్తలకు సంధి కుదిరింది. నిరంజన్‌కు నచ్చచెప్పి, మళ్ళీ వస్తానని ప్రమాణం, ప్రతిజ్ఞాచేసి, భర్తతో కిశోరీ అమృతసర్ వెళ్ళిపోయింది. కిశోరీ వచ్చినపనీ, మనోరథం నెరవేరినై. పాపం, వితంతు రమ హరిద్వార్‌లోనే వుండిపోయింది. హరిద్వారంలాటి పుణ్య తీర్థంలో ఒక అందమైన విధవకు అండకూ, ఆశ్రయానికీ లోటా!

## 2

పదిహేను సంవత్సరాల తరవాత మాట. కాశీలో చంద్రగ్రహణం నాటి రాత్రి గంగానదిలో స్నానాలు చేసేందుకు వేల లక్షల సంఖ్యలో జనం గుమిగూడారు. చూస్తుండగానే పున్నమి చంద్రుణ్ణి రాహువు పట్టేశాడు. జనం కోలాహలంగా స్నానాలకోసం నడకేసి బయలుదేరారు. అప్పుడు రేగిన తొక్కిసలాటలో, చాలా జంటలు విడిపోయాయి. కొంతమంది గాయపడ్డారు.

విధవ రమ యిప్పుడు సధవగా తన పన్నాలుగేళ్ళ కూతురు తారను వెంట బెట్టుకుని, భండారీతో కలిసి గంగాస్నానానికి వచ్చింది. జనం ఒక్కతోపు తొయ్యగానే తార తన తల్లినుంచి వేరుపడిపోయింది. ఆమె బిక్కుబిక్కుమంటూ దిక్కులు చూడసాగింది జనకోలాహలంలో ఆమెకు తన తల్లి కనిపించదన్న భయం కలగ్గానే, వెక్కివెక్కి ఏడవసాగింది. ఆ సమయంలో ఒక నడివయస్కురాలు తారను సమీపించి, ఏడుస్తున్న కారణం అడిగి తెలుసుకుని, ఆప్యాయంగా తల నిమురుతూ, "నిన్నిప్పుడే మీ అమ్మదగ్గిరికి తీసుకుపోతా. మీ అమ్మను నేను బాగా ఎరుగుదును," అని బుజ్జగించసాగింది.

ఆ సమయంలో అక్కడికొచ్చిన హిందూ స్కూలు స్వయంసేవకుడు మంగల్ దేవ్, తారను, "ఏం, దారి తప్పావా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు నడివయస్కురాలు, "వీళ్ళమ్మను నే నెరుగుదును. ఇప్పుడే తీసుకుపోయి ఒప్పచెపుతాను," అన్నది.

స్వయంసేవకుడు మంగల్‌దేవ్, మరేం ప్రశ్నించలేదు. యువ విద్యార్థి ఒక యువతి విషయంలో గట్టిగా దెబ్బలాడి, వాస్తవమేమిటో తెలుసుకోలేక పోయాడు. అతడు మరొకవైపుకు వెళ్ళిపోయాడు. స్త్రీ ముసిముసినవ్వులు నవ్వుకుంటూ తారను మరొకవైపుకు తీసుకుపోయింది.

నెలరోజుల తరవాత ఒకసెలవురోజున మంగల్‌దేవ్ తోటివిద్యార్థులు మరి కొందరితో లక్నో వెళ్ళారు. అతడూ, వీరేంద్రుడనే మిత్రుడూ నాలుగు బజార్లూ తిరుగుతుండగా, వీరేంద్రుడు మంగల్‌దేవ్‌తో, "మంగల్ యివ్వాళ మనిద్దరం ఒక తమాషాచూడాలి," అన్నాడు.

"ఏమిటా తమాషా?" అని అడిగాడు మంగల్‌దేవ్.

వీరేంద్రుడు తాము నుంచున్నచోటుకు పక్కనేవున్న మిద్దె కిటికీకేసి సంజ్ఞచేసి, "ఆ కిటికీలోంచి కనబడే దెవరో తెలుసా, బాలవేశ్య. ఒకసారి ఆమెదగ్గిరకు పోయి ఏదైనా పాటవిని కాశీకి తిరిగిపోవాలని వుంది," అన్నాడు.

మంగల్‌దేవ్ ఎన్ని అభ్యంతరాలు చెప్పినా వినక, వీరేంద్రు డతణ్ణి ఆ ఇంటికి తీసుకుపోయాడు. ఇద్దరూ మెట్లెక్కి మిద్దెపైకి పోయారు. బాగా అలంకరించబడిన ఒక విశాలమైన గదిలో పధ్నాలుగూ పదిహేనేళ్ళ సుందరి కూర్చుని వున్నది. ఆమె ముఖంలో ఏదో విషాదం తొణికిసలాడుతున్నది. తను అలవరుచుకున్న విద్యప్రకారం ఆమె వాళ్ళిద్దరికీ సలాం చేసింది.

వీరేంద్రు డామెకు అల్లంతదూరాన నిలబడి, "మీ పేరు?" అని అడిగాడు.

"ఆ యువతి నిశ్చలంగా, "గుల్‌నార్," అన్నది.

మంగల్ హఠాత్తుగా తుళ్ళిపడ్డాడు. అతడు గొంతు సవరించుకుంటూ, "మీరు నన్నెప్పుడైనా చూశారా?" అని అడిగాడు. ఆ యువతి జవాబివ్వలేదు.

"దాదాపు నెలక్రితం కాశీలో గ్రహణం నాటిరాత్రి, స్వయం సేవకుడుగా పని చేస్తూ మిమ్మల్ని చూశాను. మీరు ముస్లింలా?" అని మళ్ళీ అడిగాడు మంగల్‌దేవ్.

"మీరు చూసేవుండొచ్చు. కాని ... అమ్మ వస్తున్నది..." అంటూ భయం భయంగా వాకిలికేసి చూసింది యువతి.

యువతి మాటముగించే లోపలే అక్కడికి అమ్మ రానేవచ్చింది. మంగల్ ఆమెను గుర్తించాడు. గ్రహణంనాటిరాత్రి తొక్కిసలాటలో ఆ స్థూలకాయురాలే యీ యువతిని తల్లిదగ్గిరికి తీసుకుపోతూన్నట్టు చెప్పింది.

"బాబుగారూ! ఏమిటి తమ ఆజ్ఞ! సెలవివ్వండి," అన్నది స్థూలకాయురాలు.

"గుల్‌నార్‌ను చూసి పోదామని వచ్చాం," అన్నాడు వీరేంద్రుడు చిరునవ్వు నవ్వుతూ.

స్థూలకాయురాలు, గుల్‌నార్‌కేసి తలతిప్పి, "ఏమే, అలా మూతి ముడుచుకు కూచుంటావేం. వచ్చిన వారితో సరదాగా మాట్లాడాలని తెలీదా?" అంటూ కసురుకున్నది. గుల్‌నార్ తలవంచుకు వూరుకున్నది.

"మీ తల్లీకూతుళ్ళకు అంత సఖ్యంలేనట్టున్నది," అన్నాడు మంగల్‌దేవ్.

"ఏం చెప్పను, బాబుగారూ, రాత! ఎంతో గారాబంగా పెంచాను," అన్నది స్థూలకాయిని.

"దారిలో పడకేం చేస్తుంది, చిన్నతనంగదా," అన్నాడు మంగల్‌దేవ్.

ఆ తరవాత స్థూలకాయురాలిచ్చిన వక్కా, యాలక్కాయలూ తీసికుని, ఆమె చేతిలో రెండురూపాయ లుంచి స్నేహితులిద్దరూ అక్కడినుంచి కదిలారు. మెట్లు దిగేముందు మంగల్‌దేవ్ స్థూలకాయిని చూడకుండా, గుల్‌నార్‌కేసి చిన్నినవ్వు నవ్వాడు. గుల్‌నార్ ఫక్కున నవ్వేసింది.

ఆ మర్నాడు విద్యార్థులంతా తిరిగి కాశీకి బయలుదేరారు కాని మంగల్‌దేవ్ తనకేదో పనివున్నదని చెప్పి ఆగబడిపోయాడు. అతడు ఒకహోటల్లో రూం తీసుకుని, ఎలాగైనా గుల్‌నార్‌ను ఆ నరకకూపంనుంచి రక్షించాలన్న గట్టినిర్ణయానికి వచ్చాడు. గుల్‌నార్ ఆమె అసలుపేరు కాదనీ, ఆమె హిందూబాలిక అనీ మంగల్‌దేవ్ గ్రహించాడు.

ఆ తరవాత మంగల్‌దేవ్ రోజూ ఒకసారైనా గుల్‌నార్ వున్న యింటికి వెళుతూ, స్థూలకాయినికి రూపాయో, రెండో యిస్తూ ఆమె గౌరవాన్ని సంపాయించాడు. ఆ దుష్టురాలు లేనిసమయంలో గుల్‌నార్ తన అసలుపేరు తార అనీ, కాశీలో చంద్రగ్రహణంనాటి రాత్రి తలిదండ్రులనుంచి వేరై, యీ దుర్మార్గురాలి చేత బడ్డాననీ చెప్పింది. మంగల్‌దేవ్ ఆమెకు ధైర్యం చెప్పి యీ నరకకూపాన్నుంచి విడిపిస్తానని ప్రతిజ్ఞచేసి, అందుకవసరం అయిన పథకం ఆలోచించసాగాడు.

వారం రోజులతరవాత మంగల్‌దేవ్‌కు, తారను రక్షించే అవకాశం దొరికింది. ఒకనాటిరాత్రి మీనాషాహ్ సమాధిదగ్గిర ఉత్సవాల సందర్భంగా పెద్దగుంపు పోగయింది. ఆ ఉత్సవం చూసేందుకు స్థూలకాయిని, తారనుకూడా వెంటబెట్టుకుపోయింది. మంగల్ అదనుచూసి తారను జనసమ్మర్దంలోంచి బయటికి తీసుకువచ్చి, జట్కాబండీ కుదుర్చుకుని రైల్వేస్టేషనుకు వెళ్ళిపోయాడు.

సమయానికి స్టేషన్‌లో డెహ్రాడూన్ వెళ్ళేబండి ఆగివున్నది. జట్కావాడికి కిరాయి యిచ్చి మంగల్‌దేవ్ టిక్కెట్లుకొని, తారతో ఒకకంపార్టుమెంటులోకి జొరబడ్డాడు. కొద్దిక్షణాల్లోనే బండి కదిలింది.




తార దాపరికం లేకుండా పడుపుగృహంలో తానుపడ్డ మానసిక యాతనను గురించి మంగల్‌దేవ్‌కు చెప్పింది. ఆమె తనశీలాన్ని కాపాడుకున్నందుకు మంగల్‌దేవ్ చాలా సంతోషించాడు. ఆ మాటే ఆమెతో అన్నాడు. వాళ్ళిద్దరూ ఇలా మాట్లాడుకుంటూండగా బండి ఒక స్టేషన్‌లో ఆగింది. వాళ్ళున్న కంపార్ట్‌మెంటులోకి ఒక పురుషయాత్రికుడు వచ్చాడు. అతడు వస్తూనే సామాను బెంచీకింద సర్దేసి అలసిపోయినవాడిలా ఉస్సురస్సురంటూ పడుకుని నిద్రలోకి జారుకున్నాడు.

ఓ గంటకాలం గడిచింది. మంగల్‌దేవ్, తారా యింకా ఏవేవో కబుర్లాడుకుంటున్నారు. ఇద్దరూ భవిష్యత్తు బంగారుమయం కాగలదని వూహించుకుంటున్నారు ఇంతలో వున్నట్టుండి నిద్రపోతున్న యాత్రికుడు హఠాత్తుగా లేచి కిటికీ దగ్గిరకుపోయి బయటికి తలపెట్టి దోక్కోసాగాడు. మంగల్ వెంటనే అతణ్ణి సమీపించి పట్టుకుని, "చెంబులో నీళ్ళున్నాయేమో ఇలా తీసుకురా," అన్నాడు తారతో.

తార నీళ్ళు తెచ్చింది. మంగల్ యాత్రికుడిచేత ముఖం కడిగించాడు అతడు కృతజ్ఞత చెప్పేందుకు మంగల్‌కేసి వెనక్కు తలతిప్పేసరికి, తార కనిపించింది. అతడు తలపక్కకు తిప్పుకోబోయేంతలో తార అతడి కాళ్ళు పట్టుకుని ఏడ్వసా

గింది. యాత్రికుడు నిర్దయగా ఆమెను పక్కకు నెట్టేశాడు. మంగల్ విశ్చేష్టుడయిపోయాడు.

"నాన్నా, జరిగిందాంట్లో నా తప్పేమీలేదు. మీ కోసమే వెతుకుతున్నా." అన్నది తార.

"నీచురాలా! వెతికేది నన్నా, మ రెవడి నన్నానా?" అన్నాడు యాత్రికుడు.

తార వెక్కివెక్కి ఏడ్వసాగింది. యాత్రికుడు మంగల్‌కేసి కళ్లురుముతూ చూసి. "వెంటవున్నాడుగా, కులటా! నన్ను వెదకటం ఎందుకు. ఉత్తరంముక్క రాయకూడదా? నీ చేతినీళ్లు అంటాను. ప్రాయశ్చిత్తం చేసుకోవాలి," అన్నాడు.

"ఈయన నీ తండ్రిగారా?" అన్నాడు మంగల్‌దేవ్. తండ్రులు తమబిడ్డపట్ల యింతకఠినంగా ప్రవర్తిస్తారని అతనిదేనాడూ ఊహించలేదు.

"అవును. మా అమ్మవున్నట్టయితే నాన్న యింత కఠోరంగా ప్రవర్తించేవాడు కాదు," అన్నది తార.

"నీ నీచత్వానికి దుఃఖిస్తూ, ఆమె కొద్దిరోజులకిందటే చచ్చిపోయింది. కాని, కళంకభారం నా నెత్తిని వెయ్యటానికి నువ్వింకా బతికేవున్నావు," అన్నాడు తార తండ్రి భండారీ.

మంగల్‌దేవ్ కోపంతో వణికిపోతూ అతడికి జవాబు చెప్పబోయేంతలో బండి ఒకస్టేషన్‌లో ఆగింది భండారీ తన సామానంతా తీసుకొని, పెద్దగా ఛీత్కరిస్తూ పెట్టెనుంచి దిగిపోయాడు. మళ్ళీ బండి కదిలింది.

* * * *

హరిద్వారంలో పట్టణానికి దూరాన గంగాతీరంలో ఒక పెద్ద మామిడితోట వున్నది. దాని నానుకునివున్న ఒక చిన్నఇంటిని మంగల్‌దేవ్ అద్దెకు తీసుకుని, తారతో నివసిస్తున్నాడు. అతడికి అక్కడున్న ఆర్యసమాజీయులతో బాగా పరిచయం అయింది. వాళ్ళు తారను గురించి విని ఆమెను మంత్రయుక్తంగా సంస్కరించి, మంగల్‌దేవ్ ఆమెను వివాహమాడటం బావుంటుందని సలహా యిచ్చారు. ఇందుకు అత దంగీకరించాడు. కాని, అతడికి ఆర్యసమాజ సిద్ధాంతాలలో పూర్ణ విశ్వాసం లేదు. ఆపద్ధర్మంగా మాత్రమే, యీ పద్ధతికి ఒప్పుకున్నాడు. తార అతణ్ని తన కాబోయే భర్తగా భావించి, గృహకార్యాలు చక్కబెడుతున్నది. భవిష్యత్తులో భార్యాభర్తలు కాదలిచిన పడుచువాళ్లు ఒక ఇంటనే ఒంటరిగా నివసిస్తూ వుండటంలోని అస్తవ్యస్తత వారిద్దరి జీవితాలనూ చుట్టుముట్టింది. ఏదో క్షణికమైన మానసిక బలహీనతలో వాళ్లు కాలుజారారు—అవును ఇది కాలుజారటమే. వారికింకా శాస్త్రోక్తంగా వివాహబంధం ఏర్పడలేదు.



మంగల్‌దేవ్ నివసించే గృహానికి దాపులోనే ఒక వయసుమళ్ళిన స్త్రీ ఒంటరిగా ఒక చిన్న ఇంట్లో వుంటున్నది. ఆమె నందరూ పిన్ని అని పిలుస్తారు. ఆమె ఎంతోకాలంగా హరిద్వారంలో వుంటున్నది. తార తల్లి రమనూ, తండ్రి భండారీనీ ఆమె బాగా ఎరుగును. విధవ రమ భండారీవల్ల తారను కన్నసంగతి ఆమె కిప్పటికీ ఎంతో చోద్యంగా, అవినీతిగా కనిపిస్తూంటుంది.

ఈ పిన్ని కొత్తలో ఎప్పుడైనా తారకు ముఖం చూపించి పోతూండేది. కాని, యీ మధ్య పనికట్టుకుని వచ్చి, రోజూ ఆమెతో కబుర్లాడటం మొదలుపెట్టింది. ఆ సందర్భంలో ఒకసారి తార ఆరునెల్ల గర్భవతిఅనీ, మంగల్‌దేవ్ ఆమెను శాస్త్రవిధిగా వివాహం చేసుకోబోతున్నాడనీ తెలుసుకున్నది.

ఆ వెంటనే పిన్ని, "తారా, నువ్విక్కడ వుండటం మంచిదికాదు," అనేసింది.

"ఎందుకని పిన్నీ?" అనడిగింది తార ఆశ్చర్యపోతూ.

"అపవాదు వచ్చేచోట ఎందుకంటాలి?" అన్నది పిన్ని.

"అపవాదా? నాన్న నన్ను తిరస్కరించకపోతే యిలా జరిగేదే కాదు," అన్నది తార. ఆమెకు పిన్ని మాటలు చాలా గాభరా ఎత్తించాయి. ఆమె కళ్ళనీళ్లు పెట్టుకున్నది.

పిన్ని ఆమెను ఓదారుస్తూ, "మంగల్‌దేవ్‌ను అనటంకాదుగానీ... ఇలాంటి ప్రేమలు స్థిరంగా వుండవు. మీ అమ్మసంగతే చూడు... ఏమయింది!" అంటూ ముక్కు చీదుకొన్నది.

తార కొంచెంసేపు మాట్లాడకుండా వూరుకుని, పిన్ని లేవబోయేంతలో, "సరేలే పిన్నీ, నువ్వు నా పెళ్ళికి తప్పకుండా రావాలి. తల్లిదండ్రులు వాళ్ళమాటకేం కనీసం యీ దురదృష్టవంతురాలిని నీవైనా కరుణించు," అన్నది.

"తప్పకుండా వస్తానమ్మా. వస్తాను," అంటూ పిన్ని వెళ్ళిపోయింది.

ఇంట్లో వివాహప్రయత్నాలు సాగుతున్నాయి. తారకు పిన్ని సహాయపడుతున్నది. మంగల్‌దేవ్ మాత్రం వివాహదినం దగ్గిరవుతున్నకొద్దీ అన్యమనస్కంగా వుండటం, చిరాకు పడుతూండటం చేస్తున్నాడు. అతడి హృదయాంతరాళాల్లో ఏదో ఆందోళన తలఎత్తింది. ఆ ఆందోళన వివాహదినం నాటి ఉదయం అగ్నిపర్వతంలా బద్దలయింది.

హోమానికి వేదికతయారైంది. ఆర్యసమాజ ముఖ్యులు జ్ఞానదత్తుడూ, వేదస్వరూప్ వివాహకార్యం జరిపేందుకు యింకో అరగంటలో వస్తారనగా, మంగల్‌దేవ్ స్నానంచేయటానికి గంగానదికి వెళ్ళాడు. అతడు స్నానంచేసి గట్టుమీద కూర్చున్నాడు. అతడి కా క్షణంలో ఇంటికి తిరిగి వెళ్ళాలని ఏ మాత్రం లేదు. అతడి మనసులో తుఫాను చెలరేగుతున్నది. తార ఒక దురాచారిణి కూతురు. కొన్నాళ్లు ముస్లిం వేశ్యయింట్లో వున్నది. తర్వాత నాతో పారిపోయి వచ్చింది. వివాహానికి పూర్వమే నాతో కలిగిన అనుచిత సంబంధంద్వారా గర్భవతి అయింది. ఇవ్వాళ ఆమెను వివాహం ఆడితే పాపాలపుట్టలాంటి సంతానానికి తండ్రినవుతాను. ఆ సంతానం భావిలో అనేకమైన అపవాదులకు గురి అవుతుంది.. అలాంటి వాటిని ఎదిరించి సంఘంలో నిలబడే శక్తి నాకు లేదు. కనక ప్రస్తుత కర్తవ్యం?— అనుకుంటూ అతడు లేచి నిలబడ్డాడు. శరీరం ఓసారి ఆపాదమస్తకం కంపించిపోయింది. ఎవడో భయంకరరాక్షసుడు తనను తరుముకువస్తున్నట్టుగా, మంగల్‌దేవ్ స్టేషనుకు పరిగెత్తాడు. అక్కడవున్న బండిని చూసి ఒకాయిన్ని, "ఇది

బెనారెస్ వెళ్తుందా ?'' అని అడిగాడు. "లక్సర్‌లో బండి మారవలసివస్తుంది" అన్నాడాయన. మంగల్‌దేవ్ టిక్కెట్ కొనుక్కుని బండెక్కాడు.

*   *   *   *

రోజులు గడుస్తున్నై. తార ఇప్పుడు పిన్ని యింట్లో వుంటున్నది. ఆమెకక్కడ ఆశ్రయం దొరికింది. దగ్గిరవున్న కొంచెం విలువగల వస్తువులన్నీ ఒక్కొక్కటే అమ్మి బతుకు యీడ్చుకొస్తున్నది. నెలలు నిండుతున్నకొద్దీ ఆమె శరీరం రక్త హీనమై ఎండిపోతున్నది.

ఉన్న కొద్దిపాటి డబ్బూ, అమ్మదగినవస్తువులూ అయిపోయే దశ రాగానే, పిన్ని తారతో ప్రతి స్వల్పానికీ పోట్లాడటం ప్రారంభించింది. అప్పటప్పుడు తారమీద రండా, ముండా అనే పదాలుకూడా వాడసాగింది. తార యీ స్థితికి ఎంతో దుఃఖించి, యిక ఆత్మహత్య ఒక్కటే తనకు దారన్న నిర్ణయానికి వచ్చి ఒక అర్ధరాత్రివేళ గంగానదికేసి పోయింది. కాని, ఆమె గంగలో దూకబోయే సమయానికి ఒక సాధువు వచ్చి, ఆమెను రక్షించాడు. అతడి బలవంతంమీద తెల్లవారి ఆమె హాస్పిటల్లో చేరింది.

హాస్పిటల్లో కూడా తారకు బాధలు తప్పలేదు. ఆమె అనాధ అని తెలిసిన దాదులు తారను పురుగుకన్న హీనంగా చూడసాగారు. ఈ ధర్మాసుపత్రులు దిక్కు లేనివాళ్ళ కోసం కట్టినవయినా, అక్కడ లంచం యివ్వగలవారికే తగిన సౌకర్యాలు లభ్య మవుతాయి. తార అన్ని అవమానాలనూ సహిస్తూవచ్చింది. చివరి కామె మగబిడ్డను ప్రసవించింది. కాని, పూర్తిగా ఆరోగ్యాన్ని కోల్పోయి జబ్బుపడింది. డాక్టర్లు ఆమె బిడ్డకు పాలివ్వకూడదనీ, అంతగా ఎత్తుకోవటం కూడా మంచిదికాదనీ సలహా యిచ్చారు.

తారకు బిడ్డను ఎత్తుకోగానే మాతృప్రేమ పొంగివస్తుంది. కాని అంతలోనే ఆమెకు ఆ శిశువువల్ల తనకు కలిగిన దుర్దశ గుర్తుకువచ్చి శరీరం వణికిపోతుంది. ఆమె పూర్తిగా ఆరోగ్యవంతురాలు కావటానికి రెండు నెలలు పట్టింది. బిడ్డను ఆసుపత్రిలోనే వదిలి తాను గంగానదిలో దూకి ఆత్మహత్య చేసుకోవటానికి ఆమె నిర్ణయించుకున్నది. ఒకనాటిరాత్రి మూడుజాములవేళ నిద్రపోతున్న శిశువును ముద్దాడి, వాడు ఉలిక్కిపడగానే జోకొట్టి, నిద్రపుచ్చి ఆస్పత్రినుంచి బయటికి వచ్చేసింది. గంగానది నుంచి చల్లనిగాలి వీస్తున్నది. తార పిచ్చిదానిలా నదికేసి గబగబా నడిచిపోయి, వేగంగా నదిలోకి దూకేసింది.

హరిద్వారానికి రెండుమైళ్ళ దిగువన, ఒక సాధువు తీరాన కూర్చుని సంధ్యా

వందనం చేసుకుంటున్నాడు. నీటబడి కొట్టుకువస్తున్న తార అతడి కంటబడింది. వెంటనే అతడు నీటిలో దిగి ఆమెను ఒడ్డుకు చేర్చాడు. కొంత శ్రమపడ్డమీదట, ఆమె తాగిన నీరంతా కక్కి, స్పృహలోకి వచ్చింది.

ఆ సాధువు సేవాశుశ్రూషలతో తార కొద్దిరోజుల్లోనే తేరుకుంది. గంగాతీరం వదిలిపోకూడదన్న నిశ్చయాని కొచ్చిందామె. ఆ నది ఎక్కడంతమవుతుందో అక్కడికి చేరాలన్న పట్టుదలతో బయలుదేరింది. ఆ ప్రయాణంలో ఆమెకు అరణ్యంలోని పళ్ళు, గ్రామాలలో దొరికే భిక్ష, గంగాజలం సహాయపడ్డాయి.

# 3

కిశోరీ హరిద్వారం వదిలి అమృత్‌సర్ చేరిన ఆరునెలలకే ఒక మగశిశువును ప్రసవించింది. భర్త శ్రీచంద్‌కు ఆమెమీద ఎక్కడలేని అసహ్యమూ కలిగింది. అట్లని తన భార్య జారత్వాన్ని గురించి పదిమందికీ తెలిసేలా గొడవపడటం తన వ్యాపారప్రతిష్ఠకు భంగకరం. అతడు బాగా ఆలోచించి భార్యను కాశీకి పంపేశాడు. నెలకు యింత అని డబ్బు పంపటమే అతడి వంతు. భార్యాపిల్లల ఆరోగ్యం అమృత్‌సర్‌లో చెడిపోయేలా వుందనీ అందుకని కాశీకి పంపాననీ ఎరిగిన వాళ్ళతో చెప్పసాగాడు.

కాశీలో కిశోరీ హాయిగా కాలం గడుపుతున్నది. ఆమెకు భర్తనుంచి వచ్చే నెల సరి డబ్బే కాక, నిరంజన్‌కూడా డబ్బు యిస్తుండేవాడు. కాశీ వచ్చినప్పుడల్లా నిరంజన్ మకాం ఆమె ఇంట్లోనే. నగరంలోని భక్తురాళ్లు చాలామంది ఆమె ఇంటికి వచ్చిపోతూండేవాళ్ళు. ఆమెకూడా ఒక గొప్ప భక్తురాలుగా ప్రసిద్ధి పొందసాగింది. నిరంజన్ కిశోరీని తన భార్య అనీ, ఆమె పుత్రుడు విజయచంద్ తన కుమారుడనీ అనుకోసాగాడు.

ఏళ్ళు గడిచిపోతున్నాయి. విజయచంద్ కాలేజీలో చదువుకొంటున్నాడు. డబ్బు విచ్చలవిడిగా ఖర్చుపెట్టగల అతడికి స్నేహితుల కొదువ ఏమీలేదు. అతడి కనేక సర్దాలు. వాటిల్లో గుర్రపుస్వారీ ఒకటి.

ఒకనాటి ఉదయం విజయచంద్ కాలేజీముందున్న పెద్ద పచ్చికబయలులో గుర్రపు స్వారీ చేస్తూండగా, ఏ కారణం వల్లనో అది బెదిరి అతణ్ణి కిందపడవేసేందుకు వెనక కాళ్ళమీద నిలబడి నానా హంగామా చేయసాగింది. విజయచంద్ భయవిహ్వలుడై పోయాడు. ఆ సమయంలో ఒక యువకుడు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, కళ్లెం లాక్కుని గుర్రాన్ని అదుపులోకి తెచ్చాడు.

విజయచంద్‌కు ఆ యువకుడిపైన ఎక్కడలేని కృతజ్ఞతాభావంకలిగింది. అతణ్ణి




ఇంటికి ఆహ్వానించి, తన గదిలోకి తీసుకుపోయి, "మీకు చాలా ఋణపడ్డాను. తమ పేరేమిటో తెలుసుకోవచ్చునా?'' అని అడిగాడు.

"నా పేరు, మంగల్‌దేవ్. ఇక్కడ కాలేజీలో సంస్కృతం, పాలీ చదువు తున్నాను" అన్నాడు యువకుడు. ఆ రోజునుంచీ విజయచంద్, మంగల్‌దేవ్‌ల మధ్య గాఢ మిత్రత్వం ఏర్పడిపోయింది. విజయచంద్, మంగల్‌దేవ్‌ను తన గదికి పక్కగావున్న ఒక పెద్ద గదిలో వుండవలసిందిగా కోరాడు. మంగల్‌దేవ్ అంగీక రించాడు. కిశోరీ యిందుకు అభ్యంతరం చెప్పలేదు.

పదీ పదిహేను రోజుల తర్వాత, నిరంజన్ వచ్చాడు. ఒక శుభదినం చూసి, సాధువులకు సంతర్పణ ఏర్పాటు చేశాడు. ఎక్కడెక్కడి సాధువులూ, భక్తులూ సంతర్పణకు వచ్చారు. సంతర్పణ కోలాహలంగా జరిగిపోయింది. మిట్టమధ్యాహ్నం వేళ ఇంటి దాసీలు ఎంగిలి విస్తళ్ళు వీధిలోకి గిరవాటు వేయసాగారు. చాలా మంది బిచ్చగాళ్ళు వీధిలో చేరారు. వాళ్ళల్లో కొందరిదగ్గిర చిన్నచిన్న బిడ్డలుకూడా వున్నాయి.

కిశోరీ, విజయచంద్ కిటికీదగ్గిర నిలబడి యీ దృశ్యం చూస్తున్నారు. అంతలో అక్కడికి బక్కచిక్కిపోయిన ఒక యువతి వచ్చింది. ఆమె ధరించిన చీర మురికి

ఓడుతున్నది. వీధిలో తడబడే అడుగుల్తో నడుస్తూ, అక్కడ మూగిన బిచ్చగాళ్ళ గుంపును తప్పుకుపోయేందుకు ఆమె ప్రయత్నించేంతలో, ఒక భిక్షుకి, ఆమె తను తీసుకోబోయే ఎంగిలి విస్తరాకు కోసం వస్తున్నదనుకుని, ఘుమ్మంటూ లేచింది. అది చూసిన మరిద్దరు బిచ్చగత్తెలు ఆ యువతిమీదపడి వీధి వారకు తోసేశారు. యువతి నిలబడలేక కిందపడిపోయింది.

కిశోరీకి ఆ యువతిమీద చాలా జాలి కలిగింది. ఆమె మామూలు బిచ్చగత్తెగా కనిపించలేదు. కిశోరీ తన నౌకర్లను పంపి ఆ యువతిని తన దగ్గిరకు తీసుకు రమ్మన్నది. స్పృహతప్పిపోయిన యువతిని నౌకర్లు కిశోరీవద్దకు తెచ్చారు. చన్నీళ్ళు ముఖంమీద చల్లిన కాసేపటికి యువతి మూలుగుతూ కళ్ళు తెరిచింది.

"ఆకలిగా వుందా, ఏమైనా తింటావా?" అని అడిగింది కిశోరీ.

"తింటాను. నేను ఆకలితో మలమలమాడుతున్న అనాధను," అన్నది యువతి. ఆమె కళ్ళు అశ్రుపూరితాలయినై.

కిశోరీ హృదయంలో ఎక్కడలేని జాలీ కలిగింది. ఆమె ఆ యువతితో, "ఏడవకు, నీ కొచ్చిన భయం ఏమీ లేదు. ఇక్కడే వుంటువుగాని. నీ పేరేమిటి?" అన్నది.

"నా పేరా... పేరు... యమున," అన్నది యువతి తడబడుతూ.

ఆ యువతి తార! కాని, మంగల్‌దేవ్‌వల్ల మోసగించబడి దేశాలుపట్టినప్పటి నుంచీ ఆమె తన పేరు యమున అనే చెప్పుకుంటున్నది. యమునకు, కిశోరీ యింట్లో దాసీపని దొరికింది. కొద్ది రోజుల్లోనే ఆమె తన విశ్వాసపాత్రతవల్లా, పని నైపుణ్యంవల్లా కిశోరీకి ఆప్తురాలైపోయింది. ఆమె పగటికాలమంతా తలమీద ముసుగుతోనే వుండేది. ఆ కారణంవల్ల మంగల్‌దేవ్ ఆమెను చాలాసార్లు చూసినా, ఆమె యమునగా చలామణీ అవుతున్న తార అని గుర్తించలేకపోయాడు.

కాని, యీ రహస్యం ఎంతోకాలం దాగలేదు. ఒకనాడు కిశోరీ సకుటుంబంగా గంగానదిలోని ఒక లంకకు వనభోజనాలకు బయలుదేరింది. లంక ఒడ్డున పడవ ఆగగానే, అక్కడి చెట్టుచేమల్నీ, వాటిమీది వింతవింత పక్షుల్నీచూస్తూ, ఎవరి దారినవారు బయలుదేరారు. ఆ సమయంలో ఓ చెట్లగుంపు మలుపులో యమునా, మంగల్‌దేవ్‌లు ముఖాముఖి తారసపడ్డారు.

మంగల్‌దేవ్ నిశ్చేష్టుడైపోయి, "తారా! నువ్వా?" అన్నాడు.

యమున కళ్ళల్లో విద్యుత్ ప్రవహించింది. ఆమె ముఖంమీద ఏహ్యాభావం కనబడుస్తూ, "కష్టాల్లోకూడా నన్ను వదలవా? ఆ తార ఎప్పుడో మరణించింది. ఇది ఆమె ప్రేతం, యమున," అన్నది కటువుగా.



మంగల్ దేవ్ తలవంచుకుని, జేతులుజోడించి, "తారా, నన్ను క్షమించవా?" అన్నాడు.

యమున దృఢ స్వరంతో, "ఇందులో క్షమించేందు కేమీలేదు. నువ్వు కాలేజీ విద్యార్థివి, నేను దాసీ యమునను. మనిద్దరికీ ఎలాంటి సంబంధమూలేదు," అంటూ చరచరా అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

ఈ సంఘటన జరిగిన వారంరోజులకు మంగల్ దేవ్ ఒకనాటి ఉదయం విజయ్ చంద్ తో, "పరీక్షలు అయిపోయాయి. ఉద్యోగంకూడా దొరికింది. ఇన్నాళ్ళ నుంచీ నువ్వుచేసిన సహాయానికి ఎంతో కృతజ్ఞుణ్ణి. ఇక నేను వెళ్ళిపోతాను," అన్నాడు.

విజయ్ యీ మాటలకు కొంత ఆశ్చర్యపడి, "ఉద్యోగంకూడా సంపాయిం

చావా? యిన్నాళ్లుగా, అలాంటి ప్రయత్నం చేస్తున్నట్టయినా నాతో అనలేదే. అసలు నీకు ఉద్యోగం ఎందుకు? ఇక్కడే హాయిగా వుండిపో," అన్నాడు.

"కాదు, వెళ్ళక తప్పదు," అన్నాడు మంగల్‌దేవ్.

"బలవంతంగా నేను ఆపదలచలేదు. నువ్వు స్వతంత్రుడివి" అంటూ విజయ్ తల పక్కకు తిప్పేసుకున్నాడు. అతడి కళ్ళల్లో నీళ్లు తిరిగినై.

ఆ సాయంత్రం మంగల్‌దేవ్, కిశోరీకూడా తాను వెళుతున్న సంగతి చెప్పి, అనేకవిధాలుగా ఆమెకు కృతజ్ఞత చెప్పుకుని, తనకున్న కొద్దిసామానూ తీసుకుని రైలుస్టేషనుకు వెళ్ళిపోయాడు.

* * * *

కిశోరీ, నిరంజన్‌తో కలిసి సకుటుంబంగా తీర్థయాత్రకోసం మధురకు వచ్చింది. ఆమె మధురనుంచి బృందావనానికి వెళ్ళేదారిలో పెద్ద యిల్లొకటి అద్దెకు తీసుకుని, అందులో దిగింది. రెండు మూడు నెలలకాలం మధురలో వుండాలని ఆమె ఉద్దేశం. అవి శ్రావణమాసపు రోజులు. యాత్రికుల హడావిడి ఎక్కువగా వున్నది. బాల బ్రహ్మచారులు కమండలాలు పట్టుకుని పాడుతూ భిక్షకోసం ఇంటింటికీ తిరుగుతున్నారు.

ఉదయం ఏడుగంటలవేళ నిరంజన్ సేవాకుంజంలో దర్శనానికని వెళ్ళాడు కిశోరీ పడకకుర్చీలో కూర్చుని తాంబూలం వేసుకుంటున్నది విజయుచంద్ మరో కుర్చీకి చేరగిలబడి ఏదో నవల చదువుకుంటున్నాడు. యమున యింటిపనులు చక్కబెట్టుతున్నది.

ఆ సమయంలో ఒక అందమైన పదహారూ పదిహేడేళ్ళ పిల్ల నవ్వుతూ లోపలికి వచ్చి, కిశోరీతో, "అమ్మగారూ, మందిరంలో హారతి చూడటానికిరారా!" అన్నది

"ఓహో!, వచ్చావా ఘంటీ! నీకోసమే చూస్తున్నాను." అన్నది కిశోరీ.

"అయితే, యింక ఆలశ్యం ఎందుకు?" అంటూ ఘంటీ విజయ్‌కేసి కొంటెగా చూసింది.

"ఘంటీ! నువ్వు చాలా కొంటెదానివి." అన్నాడు విజయ్.

"ఇది వ్రజభూమి, బాబూగారూ! ఇక్కడి ఆకు ఆకులోనూ ప్రేమ నిండి వుంటుంది. ఆ వేణుగోపాలుని వేణునాదం అర్థరాత్రి వేళల్లో యింకా వినబడుతూనే వుంటుంది," అన్నది ఘంటీ ముసిముసి నవ్వులు నవ్వుతూ.

ఘంటీ ఒక బాలవిధవ. గోపికాస్త్రీ జనంలో వుండే లక్షణాలన్నీ ఆమెలో వున్నాయి. ఆమె ఒక్కక్షణంకూడా స్థిమితంగా కూచోలేదు. చంచలత్వంతో



ఎప్పుడూ తిరుగుతూనే వుంటుంది. ఒళ్లు విరుచుకోవటం, వేళ్ళు విరుచుకోవటం – ఎప్పుడూ చేస్తూనే వుంటుంది. ఆమె చేసే పరిహాసాలంటే యమునకు కోపం. కాని, కిశోరీ ఆమె కొంటెతనం చూసి ముచ్చటపడుతుంది.

ఆ రోజు మధ్యాహ్నం కిశోరీ, నిరంజన్, విజయ్ భోజనాల తరవాత తీరిగ్గా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. కొన్నిరోజులపాటు అందరం బృందావనం వెళ్ళి వుందామంటున్నాడు, నిరంజన్. కృష్ణుని బాలక్రీడలతో పావనం అయిపోయిన, ఆ భూమిమీద వున్నట్లయితే, హృదయం ఆనందంతో నిండిపోతుందని, అతని అభిప్రాయం. కిశోరీ బృందావనం వెళ్ళటానికి ఒప్పుకున్నది. కాని, విజయ్‌కి మాత్రం అంతగా యిష్టంలేదు...

ఆ సమయంలో ఒక బ్రహ్మచారి లోపలికి వచ్చి అందరికీ నమస్కారించాడు. అతణ్ణి చూసి విజయ్ చాలా ఆశ్చర్యపడ్డాడు. నిరంజన్‌కు కలిగిన ఆనందం అంతా యింతాకాదు

"ఆ బ్రహ్మచారులతో నువ్వూ తిరుగుతున్నావా, మంగల్?" అన్నాడు విజయ్.

"అవును, విజయ్‌బాబూ! నే నిక్కడ ఒక ఋషికులం స్థాపించాను. మీ రిక్కడికి వచ్చారని విని, భిక్ష తీసుకుపోవటానికి వచ్చాను," అన్నాడు మంగల్‌దేవ్.

"ను వ్వెక్కడో ఉపాధ్యాయుడుగా చేరావనుకున్నా ... మంచి వ్యాపారమే మొదలెట్టావ్!" అన్నాడు విజయ్.

"అదే...చదువు చెపుతున్నాను. సంఘసేవ, సంఘ సంస్కరణ. ఆ లక్ష్యాలను సాధించాలంటే నా దగ్గిరున్న సాధనం అదొకటేగదా," అన్నాడు మంగల్‌దేవ్.

"అలాంటి సంస్కరణ ప్రచారంచేసే ఆర్యసమాజం వుందిగా. అందులో చేరకపోయ్యావా?" అన్నాడు విజయ్.

"ఆర్యసమాజ ధోరణి అంతా విమర్శాత్మకం. కాని, నేను సనాతనధర్మపు అడుగుజాడల్లోనే నడుస్తూ, దాన్ని సంస్కరించా లనుకుంటున్నాను," అన్నాడు మంగల్‌దేవ్.

మంగల్‌దేవ్ జవాబులు నిరంజన్‌కు చాలా సంతోషం కలిగించాయి. కిశోరీ అతణ్ణి, "అయితే, మీ ఋషికులం ఎలా నడుస్తున్నది, మంగల్?" అని ప్రశ్నించింది.

"అందరూ దరిద్ర హిందువుల పిల్లలే దొరికారు నాకు, తల్లీ! నేను వాళ్ళతో రోజూ భిక్ష అడుక్కుంటూ వుంటాను. సంస్కృతం, ప్రాకృతం వాళ్ళకు నేర్పుతున్నా. అంతాకలిసి ఎనిమిదిమంది, ఎనిమిది పదహారేళ్ళ మధ్యవుంటారు. ఒక ధర్మాత్ముడు పాడుపడ్డతోట ఒకటి యిచ్చాడు. అందులో ఒకమూల పొడవాటి పాక ఒకటి వున్నది; అందులోనే కాలక్షేపం. శీతాకాలం, వర్షాకాలం మాత్రం కొంచెం బాధగా వుంటుంది," అన్నాడు మంగల్‌దేవ్.

"ఏదేమైనా, నువ్వుపడే కష్టాన్నీ, నీ సత్యనిష్ఠనూ ఎవరూ శంకించలేరు," అన్నాడు విజయ్. మిత్రుడి నోటినుంచి యీ మాటలువిని మంగల్ చాలా ఆనందించాడు. లోపల యమున పాయసానికి సగ్గుబియ్యం తయారుచేస్తున్నది. మంగల్‌దేవ్ మాటలువిని ఆమె శరీరం గగుర్పొడిచింది. మంగల్ ఒక దేవత, అనుకున్నదామె. కాని మరుక్షణంలోనే తాను ఆస్పత్రిలో వదిలి వచ్చిన శిశువు జ్ఞాపకం వచ్చి,

"మంగల్ రాక్షసుడు – అత డొక్కడేకాదు, పురుషు లందరూ రాక్షసులే!" అనుకుంటూ తనపనిలో లీనమైపోయింది.

విజయ్ కొంచెంసేపు మౌనంగా వూరుకుని తరవాత, "ధర్మాత్ములూ, భక్తులూ చేసే దానాలు సదుపయోగం కావటంలేదు, మంగల్. ఆ ధనాన్ని మందిరాల్లో, మఠాల్లోకూచుని సాధునామధేయులూ, మహంతులూ జల్సా చేస్తున్నారు. ఎంత మంది పిల్లలు ఆకలితో అలమటిస్తున్నారో, విద్యాగంధం లేకుండా పెరుగుతున్నారో, వాళ్ళకు పట్టదు. మనిద్దరికీ అభిప్రాయభేదాలున్నా, నువ్వుచేసేపని నాకు బాగా నచ్చిందని మరోసారి చెపుతున్నాను," అన్నాడు.

సాధువుల్ని గురించీ, మహంతుల్ని గురించీ విజయ్ చేసిన విమర్శ నిరంజన్‌ను విద్యుద్ఘాతంలా తాకింది. కోపంగా విజయ్‌వంక చూశాడు, కానీ ఏమీ అనలేక పోయాడు. కిశోరీ యిదేమీ గమనించకుండానే, "మంగల్, నేను పరాయి ప్రాంతంలో వున్నాను, అట్టే సహాయం చేయలేను. నీకూ, నీ శిష్యులకూ బట్టలూ, పాఠ్య పుస్తకాలూ కొనిపెట్టగలను," అన్నది.

"చలీ, వర్షాలనుంచి రక్షణ యిచ్చే సాధారణ గృహం ఒకటి కట్టించి యిచ్చే బాధ్యత నాది" అన్నాడు నిరంజన్. మంగల్ తన కృతజ్ఞత చెప్పుకుని, అందరికీ నమస్కరించి వెళ్ళిపోయాడు. ఈ సంభాషణ అంతా వింటున్న యమునకు మాత్రం మనస్సు చివుక్కుమన్నది. ఎవరూ మంగల్‌ను ఫలహారం తీసుకోమని అడగలేదు. అందుక్కారణం అతడు యాచకుడుగా రావటమేనా?

# 4

రోజులు గడుస్తున్నై. హోలీ పండగ దగ్గిరపడుతున్నది. ఘంటీ స్నేహంలో పడి విజయ్ క్రమంగా మారిపోతున్నాడు. వ్రజభూమిలోని ప్రేమమయ వాతావరణం అతనిలోని నిగ్రహాన్ని పూర్తిగా నీళ్ళు కార్చేసింది. సాయం సమయంలో నిరంజన్, కిశోరీ పవిత్ర స్థలాలు చూసేందుకు వెళ్ళారు. యమున ఇంట్లో వంటపనులు చూస్తున్నది.

చీకటి పడింది. అది ఫాల్గుణ శుక్ల ఏకాదశి. విజయ్ వెన్నెట్లో పెరటిలోని కదంబవృక్షం కింద కూర్చుని పక్కనేవున్న సీసాలోంచి గ్లాసులోకి మద్యం వంపుకుని తాగుతున్నాడు. అతడివేళ్ళు హార్మోనియం మీద శృతులు పలికిస్తున్నాయి. అంతలో ఘంటీ పకపక నవ్వుతూ అతడిదగ్గిరకు వచ్చింది.

విజయ్, ఘంటీ చేయిపట్టుకుని, "వ్రజబాలా! రారా," అంటూ ఆమెను తన

కేసి లాక్కుని గట్టిగా కౌగలించుకున్నాడు. కిటికీలోంచి ఆ దృశ్యాన్ని చూసిన యమున, దభీమంటూ కిటికీరెక్కల్ని మూసేసింది. ఒకటి రెండునిమిషాలు గడిచీ గడవకముందే కిశోరీ, నిరంజన్‌లు ఇంటికి వచ్చారు. కిశోరీ పెరటివైపునవున్న వంటగదిలోకి వచ్చి యమునను, "విజయ్ ఏడీ? ఎక్కడికైనా వెళ్ళాడా?" అని ప్రశ్నించింది.

యమున జవాబు చెప్పలేదు. కిశోరీ కసురుతున్నట్టు, "నా మాట వినపడ్లేదా? విజయ్ ఎక్కడ?" అన్నది.

యమున మాట్లాడకుండా పెరటివైపు కిటికీ తలుపులు తెరిచింది. కిశోరీ కిటికీ లోంచి చూసింది. వెన్నెట్లో కదంబవృక్షం కింద విజయ్, ఘంటీ ఒకరి కౌగిలిలో ఒకరున్నారు.

"ఘంటీ!" అంటూ కిశోరీ పెద్దగా అరిచింది.

ఆ కేక వింటూనే విజయ్, ఘంటీలు వేరైపోయారు. ఘంటీ తలవంచుకుని కిశోరీ దగ్గిరకు వచ్చింది. కిశోరీ ఆమెకేసి రౌద్రంగా చూస్తూ, "ఘంటీ, నీకు సిగ్గులేదా?" అన్నది.

"సిగ్గంటే ఏమిటో నాకు అంతగా తెలియదమ్మగారూ! ఇది వ్రజభూమి. వయసు మళ్ళినవారే ప్రియుల్తో రాత్రి పొద్దుపోయిందాకా ఎక్కడెక్కడో తిరిగి వస్తున్నారు," అన్నది ఘంటీ.

ఈ మాటలు కిశోరీవి బాణాల్లా తాకినై. ఆమె పళ్ళు కొరుకుతూ, కళ్ళెర్రచేసి, "అవతలికి పో, ఈ క్షణంనుంచీ మా గుమ్మం ఎక్కకు," అన్నది.

ఘంటీ తలవంచుకుని వెళ్ళిపోయింది. కిశోరీ, "విజయ్!'' అంటూ పెద్దగా కేక పెట్టింది. విజయ్ తూలుతూ లోపలికి వచ్చాడు. కొడుకును గట్టిగా కోప్పడా లనుకున్న కిశోరీ, అతడి స్థితిచూసి, ఓ క్షణం నిశ్చేష్టురాలైపోయి, తన గదికేసి నడిచింది. యమున, విజయ్‌ను నెమ్మదిగా తీసుకుపోయి మంచంమీద పడుకోబెట్టింది.

ఆ మర్నాటినుంచీ తల్లీకొడుకులకు మాటలులేవు. తన భర్త వచ్చి కొడుకు విషయంలో ఏదైనాచేస్తే బావుండునని కిశోరీ అనుకోసాగింది. కాని, అది అసంభవం. ఏమిచేయటమా అని ఆమె ఆలోచిస్తున్నంతలో, ఒక రోజున నిరంజన్‌కూ, విజయ్‌కీ వాగ్వాదం ప్రారంభమై, పెద్ద రభసగా పరిణమించింది.

"మద్యపానం చేసేవాళ్ళతో కలిసివుండటం నాకు గిట్టదు,'' అన్నాడు నిరంజన్.

విజయ్ నవ్వుతూ, "అలా అయితే మరో చోటు చూసుకోండి. కపటులూ, ఆడంబరులూ అయినవాళ్ళనుంచి దూరంగా వుండటం నాకూ యిష్టమే," అన్నాడు.



కిశోరీకి ఆ మాటలు కోపం తెప్పించినై. ఆమె కొడుకును, "సిగ్గూ ఎగ్గూ లేదా? తప్పు తెలుసుకుని సిగ్గుపడవేం," అని కసిరింది.

"నేను సిగ్గుపడవలసిన పనులేం చెయ్యటంలేదు. అలాంటి పనులు చేసేవారు సిగ్గుపడటం నేర్చుకోవలసిన అవసరం వుంది," అన్నాడు విజయ్ తాగినమైకంలో.

కిశోరీ నెత్తిన పిడుగుపడినదానిలా విలవిల్లాడిపోయి, ఆ రోజునే సామానంతా సర్దించుకుని కాశీకి ప్రయాణం కట్టింది. ఆమె యమున ప్రయాణానికి తయారవక పోవటం గమనించి, "యమునా, నువ్వు రావా ఏం?" అని అడిగింది.

"అమ్మా. నే నిక ఎక్కడికీ రాలేను. ఈ బృందావన ప్రాంతంలోనే బిచ్చ మెత్తుకుని కాలం గడుపుతాను," అన్నది యమున.

"బాగా ఆలోచించే ఆ నిర్ణయానికొచ్చావా?" అన్నది కిశోరీ కోపంగా.

"అవునమ్మగారూ!" అన్నది యమున తలవంచుకుని. ఆమె కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి.

సామానంతా బళ్ళమీదవేసి, కిశోరీ, నిరంజన్ గుర్రబ్బండీ ఎక్కారు. విజయ్ తన గదిలో మౌనంగా కూర్చున్నాడు. యమున తనకున్న కొద్దిపాటి వస్తువులూ మూటకట్టుకుని బయటికిపోతూంటే అతడు ఊరుకోలేక, "యమునా, నువ్వూ నన్ను విడిచిపెట్టిపోతున్నావా?" అని అడిగాడు. యమున మాట్లాడకుండా బయటికి వెళ్ళిపోయింది.

విజయ్ ఓ అరగంటకాలం గదిలోనే కూర్చుని, తరవాత ఏదో ఒక గట్టి నిర్ణయానికి వచ్చినవాడిలా కుర్చీలోంచి లేచి తన సామానంతా రెండు గూడు చిన్న సంచీల్లో పెట్టుకుని, ఇంటిబయటికి వచ్చేసి, దారేపోతున్న ఒక జట్కాను ఆపి, అందులో ఎక్కాడు.

జట్కా కదిలింది. కొంచెం సేపటికి రోడ్డంట బృందావనం వైపునుంచి ఘంటీ పాడుకుంటూ వస్తూండటం విజయ్ కంటబడింది. అతడు జట్కా ఆపించి, ఆమెను కేక వేసి పిలిచాడు. ఘంటీ బండిదగ్గిరకువచ్చి, "ఎక్కడికీ ప్రయాణం, విజయ్‌బాబూ?" అన్నది.

విజయ్ ఆమెకు సంగతంతా నాలుగుమాటల్లో చెప్పి బండీలో సామాను సర్ది ఆమెకు కొంచెం జాగా చేసి, తన పక్కనే కూచోబెట్టుకున్నాడు.

బండీవాడు నవాబ్ నడివయసువాడు, తాగుబోతు, పచ్చిరౌడీ. వాడు ఘంటీని బృందావన్ ప్రాంతాల ఒకటి రెండుసార్లు చూశాడు. వీ డెవడో ముక్కుపచ్చలారని కుర్రవెధవ ఆమెను ఎక్కడికో తీసుకుపోవటం, వాడికి పెద్ద నామర్దాగా తోచింది. తానే దాన్ని ఎందుకు ఖైకాకట్టేసుకోకూడదు అన్న ఆలోచన చేశాడు.

విజయ్, ఘంటీలు చీకటిపడేవేళకు మధురకు కొంచెం దూరంలోవున్న ఒక చర్చి ప్రాంతాల దిగి, కబుర్లాడుతూ తిరగసాగారు. రాత్రికి ఆశ్రయం సంపాయించటం ఎక్కడా అన్నదే వాళ్ళ సమస్య. నవాబ్ గుర్రబ్బండీని ఒక స్నేహితుడి యింటివగ్గిర వదిలి చెట్లచాటున నక్కుతూ బాగా చీకటిపడేవరకూ విజయ్, ఘంటీలను వెన్నాడుతూ తిరిగాడు.

బాగా చీకటిపడింది. రోడ్డంట జనసంచారం తగ్గింది. విజయ్, ఘంటీలు చర్చి ఆవరణలోవున్న బంగళాల్లో ఎక్కడైనా, ఆ రాత్రికి కాలంగడిపే అవకాశం చిక్కుతుందేమో అని అటుకేసి బయలుదేరారు. వాళ్ళు ప్రహారీగేటును సమీపించేంతలో నవాబ్ వెనకనుంచి వచ్చి, విజయ్ తలమీద కర్రతో గట్టిగాకొట్టాడు. విజయ్ అబ్బా అంటూ కిందపడేంతలో ఘంటీని పట్టుకుని, అరవకుండా నోరు మూయబోయాడు. కాని ఘంటీ యీ లోపలే ఊరూనాడూ వినేట్టుగా కేకలుపెట్టింది.

ఆ కేకలు విని చర్చిబంగళాల్లో ఒకదానిలో వుండే బెథాం అనే ఇంగ్లీషువాడు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చాడు. అతణ్ణి చూస్తూనే నవాబ్ పిక్కబలం చూపాడు. బెథాం ఘంటీ సాయంతో విజయ్‌ను పైకెత్తి, తన బంగళాకు తీసుకు పోయాడు. అక్కడ పరీక్షించగా అతడి తలమీద తగిలినదెబ్బ ఏమంత బలమైనది కాదని తేలిపోయింది. బెథాం అతడి తలకు కట్టుకట్టి, జరిగిన సంగతేమిటని అడిగాడు.

విజయ్, ఘంటీలు తమమీద దౌర్జన్యం చేసినవాణ్ణి చూడలేదు. కారణం అసలే వాళ్ళకు తెలీదు. "ఎందుకైనా మంచిది, మీరు కాస్త జాగ్రత్తగా వుండండి," అని సలహా యిచ్చాడు బెథాం.

"మీ సహాయానికి చాలా కృతజ్ఞులం," అని చెప్పి విజయ్ అక్కణ్ణించి బయలు దేరబోయేంతలో, అప్పటివరకూ వాకిలిదగ్గిర నిలబడి అంతా వింటున్న సరళ అనే బెథాం హిందూ వంటమనిషి – వయసు మళ్ళినావిడ – విజయ్‌ను వెళ్ళవద్దని వారిస్తూ, బెథాంతో, "ఈ చీకట్లో వీళ్ళు మళ్ళీ రోడ్డుమీదికి పోవటం ప్రమాదం. ఆ రౌడీలు ఆ ప్రాంతాలే పొంచి వుండొచ్చు. ఈ రాత్రికి నా పూరిపాకలోనే కాలం గడుపుతారు," అన్నది.

బెథాం సరేనన్నట్టు తలవూపాడు ఆ విధంగా విజయ్, ఘంటీలకు సరళ ఇంట్లో ఆ రాత్రేకాక, మరికొన్నాళ్ళపాటు ఆశ్రయం దొరికింది.

బెథాం పురాతన భారతీయ చిత్రాలకు ప్రతికృతులు రాయించి, వాటిని యూరపియన్‌లకు అమ్మి, బాగా లాభాలు గడిస్తూంటాడు. విజయ్ కాలేజీలో చదివేప్పుడు చిత్రకళను కొంత అభ్యసించాడు. బెథాం మాటల సందర్భంలో తనవ్యాపారాన్ని గురించి చెప్పగా, విజయ్ అతడితో, తాను మంచిచిత్రాలు వేయలేనుగాని, ప్రతికృతులు కొంతవరకూ సహజంగా వుండేట్టు గీయగల నన్నాడు.

బెథాం అతడికి ఒకటి రెండు ప్రాచీనచిత్రా లిచ్చి కాపీచేయమన్నాడు. విజయ్ ఓపిగ్గా వాటిని రెండు మూడు రోజుల్లో కాపీచేసి అతడికి చూపాడు. బెథాంకు కలిగిన ఆశ్చర్యం, ఆనందం అంతా యింతాకాదు. అతడు చిత్రానికి యింత అని యిచ్చేపద్ధతిమీద విజయ్‌తో ఒక ఒప్పందానికి వచ్చి, వరసగా అతడిచేత తనవద్ద వున్న కొన్ని ప్రాచీనచిత్రాలకు నకళ్ళు రాయించసాగాడు.

సరళకు యీ లోకంలో నా అన్నవా రెవరూలేరు. ఆమె విజయ్, ఘంటీలను తన సొంతకొడుకూ కోడళ్ళలా చూసుకుంటూ ఎంతో ఆనందపడసాగింది.

ఒకనాడు మధ్యాహ్న భోజనాల తరవాత సరళ, విజయ్‌తో, "నాయనా, నువ్వు

నీ తల్లిదండ్రుల గురించి నా కేనాడూ చెప్పలేదు. వాళ్ళు, ముఖ్యంగా తల్లి నీ కోసం ఎంత దిగులుపడుతుందో నీవు అర్థం చేసుకోలేవు. త్వరగా ఇంటికి వెళ్ళిపో నాయనా," అన్నది.

సరళ ముఖంమీద ప్రస్ఫుటమయే విచారం, కళ్ళల్లో గూడుకట్టుకున్న అశ్రువులూ చూసి విజయ్, "మీకు బిడ్డలున్నారా?" అని అడిగాడు.

"ఒకబిడ్డ వుండేవాడు. వా డిప్పుడు ఎక్కడున్నాడో నాకు తెలియదు. అసలు బతికే వున్నాడోలేదోకూడా చెప్పలేను," అన్నది సరళ రుద్ధకంఠంతో.

ఆ సమయంలో గుడ్డివా డొకడు కర్రను నేలకు తాటిస్తూ ఇంటిముందుకు వచ్చి, "అమ్మా, కబళం వెయ్యమ్మా. నిన్ను క్షమా భిక్ష వేడుతున్నాను, తల్లీ. గుడ్డివాణ్ణి నీ దగ్గరకు పంపిన ఆ దేవుడే, కళ్ళుగల దాన్ని నిన్ను నీ కొడుకు దగ్గరకు ఏదో ఒకనాడు చేర్చకపోడు," అన్నాడు.

గుడ్డివా డిలా అనగానే విజయ్ అతడి మాటలవెనక ఏదో కథ వున్నదనుకొని "ఏమోయ్, అలా అంటున్నా వేమిటి? నీ మాటలవెనక ఏదో రహస్యవిషయం వున్నట్టున్నదే," అన్నాడు.

ఆ సమయంలో ఘంటీ పెరట్లోనుంచి అక్కడికి వచ్చింది. గుడ్డివాడు గడప కిందగా వత్తిగిలి కూర్చుని యిలా చెప్పసాగాడు: "రహస్యం ఏం వుంది, బాబూ. చేసినపాపం చెప్పుకుంటే పోతుందని, అడిగిన వాళ్ళందరికీ నా కథ చాలాకాలంగా చెపుతున్నాను. మాది పేరుపొందిన పండితకుటుంబం. మాలో అలౌకికమైన రహస్యశక్తు లున్నవని, మా భక్తగణమంతా విశ్వసించేది. బహుశా అలాంటి శక్తులు, మా పూర్వీకుల్లో వుండేవేమోగాని, నాలోమాత్రం లేవు. నేను శాస్త్రాలు అవీ చదివిన పండితుణ్ణికూడా కాను. కాని టక్కుటమారాలతో దయ్యాలను వదలకొట్టేవాణ్ణి, గొడ్రాళ్ళకు సంతానం కలిగించేవాణ్ణి.

"మా పాలిగ్రామంలో నా శిష్యుడికొడు కొకడు ప్రమాదవశాన వరదల్లో కొట్టుకుపోయాడు. అతడికి భార్యా, ఒక నెలవయసుగల కూతురూవున్నది. ఆ విధవ చాలా ధనవంతురాలు. తనకుమారైను కొడుగా మార్చమని నన్నుకోరింది. నా అలౌకికశక్తుల్లో ఆమె కంతనమ్మకం అన్నమాట! ఆమెనుంచి నాకు డబ్బు బాగా ముట్టేలా కనిపించింది. సరే, అని ఆమెను పిల్లతో మకరసంక్రాంతి రోజున గంగాసాగరం దగ్గరకు తీసుకుపోయాను. అక్కడ ఆమెను జనంలో ఒకచోటవదిలి పసిపాపతో ఆ పక్కనున్న అరణ్యంలోకి వెళ్ళి, కొద్దిసేపటి తరవాత, "పెద్దపులి! పెద్దపులి!" అంటూ జనంలోకి పరిగెత్తుకుంటూ వచ్చాను. జనం నాకేకలు విని చెల్లా



చెదరైపోసాగారు. ఆ తరుణంలో, నదీతీరాన ఒకచోట చిరిచాపమీద పడుకుని వున్న నాలుగైదు నెలల పిల్లవాడు కనిపించాడు. నా దగ్గిరవున్న శిశువును ఆ చాపమీద పడుకోబెట్టి ఆ మగశిశువును ఎత్తుకుని పారిపోయి, ఆ విధవరాలికిచ్చాను. నేను వదిలివచ్చిన పిల్లను ఎవరు ఎత్తుకుపోతారో చూసేందుకు, ఆ ప్రాంతాలే తిరగసాగాను. ఆ పిల్లను ముందు పోలీసులు తమస్వాధీనం చేసుకున్నారు. కాని, ఎంత ప్రయత్నించినా దాని తలిదండ్రులు కనబడక పోయేసరికి, దాన్ని చౌబాగారి భార్య గోవిందీ చౌబాయి పెంచుకుంటూనని తీసుకుపోయింది. ఈ రోజున భిక్షకొచ్చి యీ ఇంటి సరళ పోయిన తనకొడుకుకోసం, ఎప్పుడూ ఏడుస్తూండటం చూశాను "

గోవిందీచౌబాయి అన్నపేరు వింటూనే ఘంటీ ఉలిక్కిపడి, "ఆమె పేరేమన్నావ్, గోవిందీచౌబాయా?" అని గుడ్డివాణ్ణి అడిగింది.

"అవును. గోవిందీచౌబాయే. ఆ విధవరాలి పిల్లను పెంచుకున్న ఆమె పేరదే." అన్నాడు గుడ్డివాడు.

"మా అమ్మపేరు గోవిందీచౌబాయే. 'నిన్ను నా బిడ్డలాగే పెంచాను' అనేది" అన్నది ఘంటీ.

"అలా అయితే ఘంటీ నీ అసలు అమ్మ ఎవరో తెలుసుకోవచ్చు. ఏయ్, గుడ్డివాడా! నువ్వు మార్చిన పిల్లతల్లి ఎక్కడుందో నీకు తెలుసా?" అని అడిగాడు విజయ్.

"ఇప్పు డెక్కడుందో చెప్పలేను నేను దొంగిలించి యిచ్చిన పిల్లవాడితో ఆమె సుఖపడలేక పోయింది. పోయిన కూతురుకోసం దిగులుపడసాగింది. ఆ స్థితిలో హరిద్వారంనుంచి ఒక బ్రాహ్మడు వచ్చి ఆ విధవరాలింట దిగాడు. ఆమె ఓ రెండు వారాల తరవాత అతడితోకలిసి హరిద్వారం వెళ్ళిపోతూ, కుర్రవాణ్ణి నా పరంచేసి, పట్టణంలో ఎక్కడైనా అనాధశరణాలయంలో చేర్చమన్నది. అలాగే చేశాను. ఆవిడపేరు నందా," అని చెప్పాడు గుడ్డివాడు.

"సరే, నువ్వు గుడ్డివాడివై పోయి, ఈ దుస్థితిలో ఎలాపడ్డావు?" అని అడిగాడు విజయ్.

"అదంతా తమరు విని ప్రయోజనంలేదు, బాబూ! నే చేసిన పాపకృత్యాలకు ఫలితం అనుభవిస్తున్నా. అందుకే అడిగిన వా రందరికీ, నా పాపంకథ చెబుతూంటాను. ఇక వెళ్తాను, భిక్షంపెట్టమ్మా!" అన్నాడు గుడ్డివాడు.

అప్పటివరకూ అంతా వింటూకూర్చున్న సరళ గుడ్డివాణ్ణి, "నువ్వు దొంగిలించుకుపోయిన బాలుడిమెడలో ఒకపెద్ద బంగారుతాయత్తున్నది. అది వాడిమెళ్ళోనే వుంచావా, అమ్ముకున్నావా?" అని అడిగింది.

"అమ్ముకోలేదమ్మా, వాడి మెడలోనేవుంచాను. వాణ్ణి అనాధాలయంలో ఒప్ప చెప్పేప్పుడు, ఆ తాయత్తు జాగ్రత్త అనీ, దాని ద్వారానే ఏనాటికైనా వాడి తలిదండ్రులు వాణ్ణి గుర్తిస్తారనీ అధికార్లను ఒకటికి రెండుసార్లు హెచ్చరించాను." అన్నాడు గుడ్డివాడు.

విజయ్ ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా సరళకేసి తలతిప్పి, "ఆ తాయత్తు మీద ఏవైనా అక్షరాలు-సంస్కృత భాషలో వున్నవేమో మీకు గుర్తున్నదా?" అని అడిగాడు.




"ఆ భాష సంగతి నాకు తెలియదు, అక్షరాలేవో వున్నవి. ఆ తాయెత్తు మాలో వంశానుగతంగా వచ్చే రక్షక కవచం లాటిది. దాన్ని పిల్లలకు ఒక ఏడాది గడిచే వరకూ మెళ్ళో కట్టటం ఆచారం," అన్నది సరళ కన్నీళ్ళు కార్చుతూ.

విజయ్‌కి ఆ జవాబుతో వున్న కొద్ది అనుమానం తీరిపోయింది. మంగళ్‌దేవ్ మెడలో అలాంటి తాయెత్తొకటి వున్నది. అతడు అనాధశరణాలయంలో పెరిగాడు. కాని - యీ సంగతి యిప్పట్లో సరళకు చెప్పటంవల్ల కీడా, మేలా? విజయ్ ఎంత ఆలోచించీ ఒక నిశ్చయానికి రాలేకపోయాడు.

# 5

బృందావనానికి కొంచెం దూరంగా, చెట్టు చేమలతో పచ్చగా కంటికి ఆహ్లాదం కలిగిస్తూ ఒక కొండ వున్నది. దానిని అనుకునే యమునానది ప్రవహిస్తూంటుంది. ఆ కొండమీద శ్రీకృష్ణ మందిరం ఒకటి వున్నది. ఆ మందిరానికి అధిపతి గోస్వామీ కృష్ణదాస్. ఆయనకు డెభ్భై అయిదేళ్ళ వయసుంటుంది. ఆయన స్వచ్ఛమైన తెల్లని వస్త్రాలు ధరించి, తెల్లని నిడుపాటి గడ్డంతో, ఎర్రని దేహచ్ఛాయతో, భక్తి ప్రపూర్ణాలయిన నయనాలతో - చూపరులకు ఒక అలౌకిక వ్యక్తిలా అను

భూతి కలిగిస్తాడు. ఆయన తరచుగా మందిరంలోని శ్రీకృష్ణ విగ్రహానికి ముందు కూర్చుని వుంటాడు. మందిరానికి ఆనుకునివున్న వసారాగదులలో వృద్ధ సాధువులూ, వయసుమళ్ళిన స్త్రీలూ వుంటుంటారు. యమునకూడా కొంతకాలంగా అక్కడే వుంటున్నది.

గోస్వామి కృష్ణదాస్ ఒకనాటిసాయంత్రంవేళ కృష్ణ విగ్రహంముందు కూర్చుని వుండగా ఒక బ్రహ్మచారి వచ్చి, ఆయనకు నమస్కరించాడు. గోస్వామి అతడి కేసి దృష్టి తిప్పి, "మంగల్‌దేవ్! మీ బ్రహ్మచారులు వచ్చారా? సరే, ఎవరికి తగిన పని వారికి ఒప్పచెప్పు. ఇవాళ భారతకథ వినేందుకు శ్రోతలు చాలామంది రావొచ్చు," అన్నాడు.

ఆయన ఊహించినట్టుగానే ఆ రాత్రి కథ వినేందుకు భక్తులు అధికసంఖ్యలో వచ్చారు. యాదవుల కష్టాలుబాపి, వారిని శ్రీకృష్ణుడు ఉద్ధరించినప్పటికీ, వాళ్ళు వ్రజభూమిలో సుఖంగా వుండలేకపోవటం గురించి చెప్పి, గోస్వామి కన్నీళ్ళు తుడుచుకుంటూ, "ఆ శ్రీకృష్ణ పరమాత్మ చివరికి యాదవ వంశాన్ని వెంటబెట్టుకుని, నూతన వలసప్రదేశం వెతుకుతూ పశ్చిమానికి వెళ్ళాడు. కాని ... గోపికలు విరహంతో బాధపడుతూ, కృష్ణుడితో తమ ప్రణయానుభూతుల్ని గురించి ఒకరికొకరు కథలుగా చెప్పుకోసాగారు,'' అని, కళ్ళంట అశ్రుధారలు ప్రవహిస్తుండగా, గోపికల విరహబాధలను వర్ణించసాగాడు. శ్రోతలుకూడా దుఃఖించసాగారు.

కొద్దిసేపటి తరవాత భారతకథ చెప్పటం, ఆరోజుకు ముగించాడు గోస్వామి. ఆ సమయంలో మంగల్‌దేవ్ ఆయనదగ్గిర కొచ్చి, భక్తులలో ఎవరికో కావలసిన ఒక వస్తువుగురించి ఆయన్ని అడిగాడు. గోస్వామి మంగల్‌దేవ్‌తో, వెళ్ళి యమునను అడగమన్నాడు. యమునపేరు వింటూనే మంగల్‌దేవ్ అదిరిపడ్డాడు.

యమున ఒక పొగడచెట్టుకింద కూర్చుని, పైటచెంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటున్నది. మంగల్‌దేవ్ తడబడుతున్న అడుగులతో ఆమెను సమీపించి, "యమునా!" అని పిలిచాడు.

యమున తల ఎత్తి అతడికేసి చూడకుండానే "ఎవరు?" అన్నది.

"గోస్వామిగారి ఆజ్ఞ ఏమంటే..." ఆపైన మంగల్ మాట్లాడలేకపోయాడు.

"ఆ సంగతేదో భండారీగారితో చెప్పండి, నాకేం తెలియదు," అన్నది యమున తల ఎత్తకుండానే.

"మీతోనే చెప్పమని వారి ఆజ్ఞ," అన్నాడు మంగల్‌దేవ్ బొంగురుపోయిన గొంతుతో.

ఈసారి యమున అతడి గొంతు గుర్తుపట్టింది. తలఎత్తి మంగల్‌కేసి చూసింది. ఆమె గుండెలు చిక్కపట్టినట్టు విలవిలలాడింది. తనను గుర్తించే అంతగా అసహ్యపడుతున్నదనుకుని, మంగల్ అక్కడినుంచి మారుమాటాడకుండా వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి గోస్వామి వ్యాసపీఠంమీద కూర్చుని భారత కధ సవ్యాఖ్యానంగా చెప్పటం, విజయ్, ఘంటీలిద్దరూ విన్నారు. విజయ్‌కి కొన్ని అనుమానాలు వచ్చినా, గోస్వామిని ప్రశ్నించడానికి ధైర్యం చాలలేదు. శ్రోతలందరితోపాటు అతడూ తృప్తుడై సరళ ఇంటికి వెళ్ళిపోయాడు.

* * *

కాశీలో భార్యాబిడ్డల్ని వదిలివచ్చిన తరువాత చాలా ఏళ్ళపాటు అమృత్‌సర్‌లో శ్రీచంద్ర్ వ్యాపారం చాలా లాభసాటిగానే సాగింది. కాని, గత రెండేళ్లుగా అతడు అందులో నష్టపోతూ వచ్చాడు. చివరకు తను పెద్ద మొత్తంలో కొని నిల్వచేసిన దూది ధర పూర్తిగా పడిపోవటంతో అతడు సొంతం దివాళా ఎత్తిపోయాడు. కాని, శ్రీచంద్ర్ యుక్తిపరుడు, తెలివిగల ఘటం. వ్యాపారం తీరు అంత బాగా లేదని గుర్తించగానే, అతడు గత రెండేళ్ళనుంచీ, నగరంలోవున్న ఒక ధనిక వితంతువుతో ప్రేమసంబంధం పెట్టుకున్నాడు. ఆవిడపేరు చందా. ఆవిడకు లాలీ అనే పదహారేళ్ళ కూతురూ, కట్టుకుపోగలిగినంత ఆస్తీవున్నది.

శ్రీచంద్ర్ వ్యాపారంలో గట్టి దెబ్బతిన్నాడని తెలియగానే, ఈ చందా అతణ్ణి రుణదాతలనుంచి కాపాడటానికి అంగీకరించింది. కాని, ఒక షరతు పెట్టింది. తనను వివాహం చేసుకోవాలన్నది. తన పునర్వివాహం పెళ్ళికాని కూతురు భవిష్యత్తుకు ప్రమాదకారణం అయే అవకాశం వుందికనక, ఆ పిల్లకు అతడే ఎక్కడైనా మంచిసంబంధం చూసి ముడిపెట్టాలన్నది.

శ్రీచంద్ర్‌కు తాను అప్పులబాధనుంచి బయటపడటానికి యింతకన్న మంచి మార్గం వున్నట్టు కనబడలేదు. అతడు చందా చెప్పినదానికంతకూ ఊఁ కొట్టి, తాను ఎంతోకాలంగా విడిచిపుచ్చిన భార్యకొక కొడుకున్నాడనీ, తల్లి గొప్ప ఆస్తిపరురాలనీ, లాలీకి అతడి సంబంధం చేద్దామనీ చెప్పాడు. చందా యిందుకు సంతోషంగా అంగీకరించింది

ఒక మంచిరోజున శ్రీచంద్ర్, చందా, లాలీలను వెంటబెట్టుకుని కాశీకి ప్రయాణమయ్యాడు. అతడికీ ప్రయాణం కాస్త భయకారణంకూడా అవుతున్నది. నిరంజన్‌ను తాను ముఖాముఖీ కిశోరీ యింట కలుసుకోవలసి వస్తుంది ...

కాని, శ్రీచంద్ర్‌కు యీ ప్రమాదం తేలిగ్గా తప్పిపోయింది. అతడు కాశీ చేరి

కిశోరీ యింట కాలుపెట్టేదానికి నెలరోజులు ముందుగానే నిరంజన్, కిశోరీ పోరు పడలేక కొడుకు విజయ్‌ను వెతికి ఇంటికి తీసుకువచ్చేందుకు మధురా ప్రాంతం వెళ్ళాడు. అతడి వెంట భండారీకూడా వెళ్ళాడు.

నిరంజన్ బృందావన ప్రాంతమంతా విజయ్‌కోసం గాలించసాగాడు. అతడికి కొండమీది గోస్వామి కృష్ణమందిరం పక్కనున్న ఒక చిన్న కుటీరంలో చోటు దొరికింది. ఒకనాటి తెల్లవారుజామున అతడు, భండారీతోకలిసి పడవమీద యమునా నదిలో బయలుదేరాడు. పడవ కొండప్రాంతాన్నిదాటి కొంతదూరం పోయాక, ఒక చిన్నరేవులో వాళ్ళకు మరొక పడవ కనిపించింది. నీటి ఒడ్డున కూర్చొని ఒక కుర్రవాడూ, కుర్రదీ లోకాన్నే మరిచి పాటలు పాడుకుంటున్నాడు. పడవవాడు దూరంగా ఒక చెట్టు నానుకొని కునికిపాట్లు పడుతున్నాడు.

నిరంజన్ ఆ యువకుణ్ణీ, యువతినీ వెంటనే గుర్తించాడు. వాళ్ల విజయ్, ఘంటీలు. వాళ్ళను యీ ఆనంద సమయంలో సమీపించటమా, మానటమా అని కొంచెం సేపు తర్కించుకుని, నిరంజన్ పడవవాణ్ణి, పడవను కొంచెం దిగువగా ఒడ్డుపట్టించ మన్నాడు.

కొద్దిక్షణాలు గడిచాయి. ఒకస్త్రీ నదికి స్నానానికి వచ్చి, విజయ్ వాళ్ళున్న చోటుకు కొంచెం ఎడంగా నదిఒడ్డుకు దిగుతున్నది. ఆ సమయంలో ఘంటీ విజయ్‌ను భుజం పట్టుకుని గట్టిగాకుదిపి, అల్లంత దూరంలోవున్న చెట్లకేసి పరుగెత్తింది. మరుక్షణంలోనే ఆమె కెవ్వుమంటూ అరవటం వినబడింది. విజయ్ అటువైపుకు పరిగెత్తాడు. ఇంతలో అతడికేసి ఘంటీ వగరుస్తూ పరిగెత్తుకు రాసాగింది. ఆమెను తరుముతూ గుర్రబ్బండీ నవాబ్ వస్తున్నాడు.

"అరే, బద్మాష్, ఆగు!" అంటూ హుంకరించాడు, విజయ్. నవాబ్ బాగా తాగినమైకంలో వున్నాడేమో, వెనకాముందులు చూడకుండా వచ్చి, విజయ్‌మీద కలియబడ్డాడు. విజయ్ వాడిముఖంమీద గట్టిగాకొట్టి, తూలిపడబోతున్న వాణ్ణి ఒడిసి పట్టుకున్నాడు.

నవాబ్ బొడ్లోనుంచి చప్పున చాకు లాగాడు. అది గమనించిన విజయ్ అతణ్ణి చప్పున వదిలి అందుబాటులోవున్న రాయొకటి తీసుకుని, అతడి తలమీద బలంగా కొట్టాడు. నవాబ్ కిక్కురుమనకుండా, వెనక్కు విరుచుకుపడ్డాడు. అతడి తల బద్దలై రక్తం కారసాగింది. ఘంటీ యీదృశ్యం చూసి, భయపడిపోయి పడవ ఎక్కింది. పడవవాడుకూడా బెంబేలుపడిపోతూ, పడవను నదిలోకి నడిపాడు.

విజయ్, కిందపడివున్న నవాబ్‌కేసి చూస్తూ, నిశ్చేష్టుడైపోయాడు. అప్పు దేం



చేయటమో అతడికి తోచలేదు. అంతలో నదికి స్నానానికి వచ్చిన స్త్రీ అతణ్ణి సమీపించి, "విజయ్‌బాబూ! మీరు తక్షణం యిక్కణ్ణించి వెళ్ళిపొండి," అన్నది.

విజయ్ ఆమెకేసి ఆశ్చర్యంగా చూశాడు. ఆమె యమున. పడవలో వుండి యిదంతా చూస్తున్న నిరంజన్. భండారీలు పరుగుపరుగున విజయ్‌దగ్గరకువచ్చారు. నిరంజన్, విజయ్ చేయి పట్టుకుని, "విజయ్, నువ్వెంత ఘోరం చేశావో అర్థమవుతున్నదా? హత్య," అన్నాడు ఆవేశంగా.

"అవును, హత్య! బహుశా ఉరిశిక్ష పడుతుంది. భయపడవలసిన అవసరం ఏముంది?" అన్నాడు విజయ్, నిరంజన్‌కేసి కోపంగా చూస్తూ.

యమున మృదువుగా విజయ్ భుజం పట్టుకుని, "అస్తమానం కుర్రతనం ధోరణి మంచిదికాదు, విజయ్‌బాబూ! వెంటనే యిక్కణ్ణించి వెళ్ళిపొండి," అన్నది.

విజయ్, చచ్చిపడివున్న నవాబ్‌కేసి మరోసారి చూశాడు. అతణ్ణి భయం ఆవహించింది. మారుమాట్లాడకుండా వెనక్కి తిరిగాడు నిరంజన్ అతడి చేయి పట్టుకుని మౌనంగా నావమీదికి తీసుకుపోయాడు అతడు నావవాడికి సంచీలోంచి గుప్పెడు రూపాయలు తీసి యిచ్చాడు. నావ బయలుదేరింది. యమున, నవాబ్ శవందగ్గిరే నిలబడి పోతున్న నావకేసి చూస్తున్నది. హఠాత్తుగా నిరంజన్, భండారీలు నావలోంచి, "బాబోయ్, హత్య! హత్య!" అంటూ కేకలు పెట్టారు. యమున వాళ్ళ కేకలు విన్నది. హత్య, హత్య అని అరిచేవాళ్ళలో ఒకరు – భండారీ, తన తండ్రి. కాని అతను తన తండ్రి అన్నభావం ఆమె హృదయంలో ఏనాడో యింకిపోయింది.

నిరంజన్, భండారీల కేకలు వింటూనే, నదికి స్నానానికివచ్చిన కొందరు యమునదగ్గిరకు పరిగెత్తుకు వచ్చారు. తల పగిలి చచ్చిన వాడి పక్కన యమున. వాళ్ళడిగినదానికి యమున ఎలాంటి జవాబులూ చెప్పలేదు. పావుగంటలో పోలీసులు వచ్చారు.

పోలీసు ఇన్‌స్పెక్టర్, యమునను, "ఇతణ్ణెవరు చంపారు?" అని ప్రశ్నించాడు.

"ఇత నొక స్త్రీమీద అత్యాచారం చేసేందుకు ప్రయత్నించాడు," అన్నది యమున.

"అలాగా! అయితే యితణ్ణి చంపిందెవరు?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఇత డెవర్ని అవమానించాలనుకున్నాడో, వారే," అన్నది యమున.

"అయితే, ఆ స్త్రీవి నువ్వేనన్నమాట." అన్నాడు ఇన్‌స్పెక్టర్, హంతకిని పట్టానన్న సంతోషంతో. యమున జవాబివ్వలేదు.

"నిన్ను హత్యానేరానిగాను అరెస్టు చేస్తున్నాను," అని ఇన్‌స్పెక్టర్ యమును ను తనవెంట పోలీసుస్టేషనుకు తీసుకుపోయాడు.

నావ నదిలో వేగంగా ప్రయాణిస్తూ, నిర్జనంగావున్న ఒక అరణ్యప్రాంతాన్ని చేరగానే, నిరంజన్ నావను ఒడ్డుకు పట్టించాడు. ముందు చేయవలసిందాన్ని గురించి విజయ్‌తో మాట్లాడి, ఒక గట్టి నిర్ణయానికి రావటం మంచిదని అతడికి తోచింది.

నావనుంచి ముగ్గురూ దిగారు. నిరంజన్, తలవంచుకుని మౌనంగావున్న కొడుకుతో, "ఇప్పు డేంచేయదలిచావ్? ఈ తరుణంలో నీ తల్లిదగ్గిరకు పోవటం ప్రమాదం గదా," అన్నాడు.

"నే నసలు మనుషులమధ్య వుండటమే ప్రమాదం. వాళ్ళంటే నాకు అసహ్యం వేసిపోయింది. ఈ అరణ్యంలో తలదాచుకుంటాను," అంటూ విజయ్ తండ్రి జవాబుకోసం ఆగకుండా, దాపులనున్న గుబురుచెట్లలోకి పరిగెత్తాడు.

నిరంజన్, భండారీలు యిలా జరుగుతుందని వూహించలేదు. వాళ్ళు తమ ఆశ్చర్యాన్నుంచి తేరుకుని చెట్లకేసి పరిగెత్తారు. విజయ్ కనిపించలేదు. ఇద్దరూ తలలు వంచుకుని నావదగ్గిరకు వచ్చేశారు.

ఆ తరవాత నిరంజన్ బృందావనం చేరి, గోస్వామికృష్ణదాస్‌కు జరిగినదంతా చెప్పాడు. అంతా విని ఆ వృద్ధుడు, నిర్దోషురాలైన యమునను ఎలాగైనా రక్షించాలన్నాడు. అందుకు అవసరం అయిన ఏర్పాట్లు—ఎంత ధనవ్యయంతో కూడుకున్నవయినా, తాను చేస్తానని నిరంజన్, గోస్వామికి మాట యిచ్చాడు.

జరిగిన ఘోరంగురించి కిశోరీకి రాయటమా, మానటమా అని ఓ నెలరోజుల పాటు మధనపడి, చివరకు వాస్తవం ఆమెకు తెలియపర్చటమే మంచిదనుకుని, నిరంజన్ కాశీకి వుత్తరం రాశాడు. ఆ వుత్తరం చదివిన కిశోరీకి చీమకుట్టినంత బాధ అయినా కలగలేదు. కారణం, ఆమె యిప్పుడు ప్రథమభర్త శ్రీచంద్ర్ ప్రేమ మైకంలో మునిగితేలుతున్నది. తన కుమార్తెకు మంచి సంబంధం దొరుకుతుందని ఆశపడి వచ్చిన, అమృతసర్ ధనిక వితంతువు చందా, తన ప్రియుడు శ్రీచంద్ర్‌లో వచ్చిన మార్పు చూసి, కూతురును వెంటబెట్టుకుని ఇంటికి తిరిగిపోయింది. శ్రీచంద్ర్ ప్రోత్సాహంతో యిప్పుడు కిశోరీ, అనాథశరణాలయంలో కొన్నాళ్ళు పెరిగి, ప్రస్తుతం నందా అనే బీదరాలి ఇంట వుంటున్న మోహన్ అనే కుర్రాణ్ణి దత్తు చేసుకోబోతున్నది. ఈ కుర్రవాడు యమున హాస్పిటల్లో వదిలిపోయిన శిశువే అన్న సంగతి వారెవరికీ తెలియదు.

దాదాపు ఇరవై ఏళ్ళ తర్వాత జీవితంలో వచ్చిన యీ హఠాత్పరిణామాలవల్ల, కిశోరీకి నిరంజన్ అంటే పూర్తిగా ఏహ్యభావం ఏర్పడిపోయింది. అతడివల్ల కన్నబిడ్డ, విజయ్ అన్నా ఆమె హృదయంలో ఎలాంటి వాత్సల్యమూలేదు. ఆ కారణంగా ఆమె నిరంజన్‌కు జవాబుకూడా రాయలేదు. నిరంజన్ కాశీలోవుండే తన భక్తులద్వారా సంగతిసందర్భాలు తెలుసుకుని, జీవితం అంటే విరక్తిచెంది, బృందావనంలో గోస్వామి కృష్ణదాస్‌దగ్గిరే కాలం గడపాలని నిశ్చయించుకున్నాడు.

ఇక, అరణ్యంకేసి పరిగెత్తిపోయిన విజయ్, ఆ సాయంకాలానికి ఆకలితో నకనకలాడుతూ గుజార్లనబడే బందిపోటుదొంగల తండా నివసించే ప్రాంతం చేరాడు. గుజార్లనాయకుడైన వృద్ధ బదన్ కుమార్తె గాలా, అడవిలో పశువుల్ని మేపుతూ విజయ్ దుర్దశ చూసి, జాలిపడి తమ ఇంటికి తీసుకువచ్చింది.

విజయ్ గుజార్లనాయకుడి ఇంట పశుపోషణలో సాయపడుతూ కాలం గడప సాగాడు. అతణ్ణి యమునను గురించిన దిగులు కుంగదీస్తున్నది. తాను చేసిన

హత్యను యమున తనపై వేసుకున్నది. ఇందుకు తన తండ్రీ, ఆమె తండ్రీ కలిసి హత్య, హత్య అంటూ వేసినకేకలు మంచి సాక్ష్యంగా పనిచేసివుంటవి. ఆమె కిసరికే నవాబ్‌ను హత్యచేసిన హంతకిగా ఉరిశిక్ష పడివుంటుందా?

విజయ్ యిలాంటి సమస్యలతో సతమతమవుతున్న దశలో, మంగల్‌దేవ్, గోస్వామి ఆజ్ఞ మేరకు అడవిజాతుల పిల్లలకు చదువు సంధ్యలు నేర్పేందుకు బయలుదేరి బదన్‌ముతా గుజార్లున్న ప్రాంతానికే వచ్చాడు. బదన్ మొదట్లో అనుమానించినా, మంగల్‌దేవ్ చెప్పినదంతా విన్నతరువాత అన్ని సంశయాలూ తీరి, అతడు గుజార్లపిల్లలకు చదువునేర్పేందుకు అనువుగా ఒక కుటీరం కట్టించి యిచ్చాడు.

మంగల్‌దేవ్ శాస్త్రోక్తంగా వివాహం ఆడకపోయినా, అతడు యమున భర్త అన్న సంగతి విజయ్‌కు తెలుసు. కాని, వాళ్ళిద్దరూ ఒకళ్ళకొకళ్ళు బాగా దూరమై పోయారు. దానికి మూలమైన కారణాలూ, ఆ వివరాలూ విజయ్‌కు తెలీవు. మంగల్ ద్వారా, అతడు యమున హత్యానేరం మోపబడి అరెస్టయిన సంగతీ, కోర్టులో విచారణా, ఆమెను రక్షించేందుకు నిరంజన్, గోస్వామీ చేస్తున్న ప్రయత్నాలూ అన్నీ తెలుసుకున్నాడు. అంతేకాక, బదన్ కుమార్తె గాలాకూ, మంగల్‌కూ పరస్పరాకర్షణ వృద్ధి అవుతున్నట్టుకూడా అతడు గమనించాడు.

యమునను ఎలాగైనా ఉరిశిక్షనుంచి తప్పించాలన్న పట్టుదలతో విజయ్ ఒక రాత్రి వేళ ఎవరికీ చెప్పకుండా, మధురకు బయలుదేరాడు. ఈ లోపల కోర్టులో యమున విచారణ పూర్తయింది. ముద్దాయి తరపు వకీలూ, ప్రాసిక్యూషను తరపు వకీలూ తమతమ వాదనలను జడ్జీకీ, అయిదుగురు జ్యూరీలకూ వినిపించారు.

ఆ తరువాత జడ్జీ, జ్యూరీలనుద్దేశించి, "ఈ నవాబ్ హత్యకేసులో ముద్దాయి అయిన యమున అతణ్ణి చంపటం కళ్లారాచూసిన సాక్షి ఎవరూలేరు. ఉన్న సాక్షులు చెప్పేదేమిటంటే, తాము చూసినప్పుడు, ఆమె చచ్చిపోయినవాడి పక్కన నిలబడి వున్నదని. ముద్దాయి చెప్పేదేమిటంటే, నవాబ్ ఒక స్త్రీని చెరచనున్న సమయంలో చంపబడ్డాడని. ప్రాసిక్యూషన్‌వారు చెప్పేదేమంటే – ముద్దాయి ఆ మాటలద్వారా తాను హత్యచేసినట్టు ఒప్పుకుంటున్నదని. ముద్దాయి మాటలనుంచి, యీ అర్థం తీయటం ఏ మాత్రం సరికాదు. స్త్రీ తన మర్యాదను కాపాడుకునేందుకు హత్యచేయవచ్చా లేదా అనేది మరొక విషయం. ఇక్కడి సమస్య అదికాదు. ఈ సంగతి సందర్భాలు మీరు దృష్టిలో వుంచుకోవాలని నేను కోరుతున్నాను." అన్నాడు.

జ్యూరీలు పక్కగదిలోకి పోయారు. న్యాయస్థానంలో చాలా మంది ప్రేక్షకులు



వున్నారు. వాళ్ళల్లో నిరంజన్, గోస్వామి కృష్ణదాస్‌కూడా వున్నారు. యమున ఎలాంటి తొట్రుపాటూ లేకుండా నిశ్చలంగా జడ్జీగారికేసి చూస్తున్నది. ఆ సమయంలో కోర్టు గదిబయట చిన్న కోలాహలం బయలుదేరింది. డ్యూటీలో వున్న పోలీసులు, "నిశ్శబ్దం! నిశ్శబ్దం!!" అంటూ జనాన్ని హెచ్చరించసాగారు. అంతలో జ్యూరీల్లో ఇద్దరు గదినుంచి బయిటికివచ్చి, "యమునసవతిని హత్యచేసిందని మేం భావిస్తున్నాం. కాని, శిక్ష సాధ్యమైనంత తక్కువగా విధించమని కోరుతున్నాం." అన్నారు.

మిగతా ముగ్గురు జ్యూరీలుకూడా గదినుంచి బయిటికివచ్చి, "యమున హత్య చేసిందనేందుకు కేసులో తగినంత సాక్ష్యం లేదు..." అంటూ వాళ్ళు యింకా ఏమో చెప్పబోయేంతలో, చిన్న గడ్డం, మీసాలూగల యువకుడొకడు, గొంగళి

ఒకటి భుజాన వేసుకుని, జనాన్ని తోసుకుంటూ ప్రాసిక్యూషన్ వకీలుదగ్గిర కొచ్చి, "నే నే హంతకుణ్ణి. ఆ స్త్రీ నిరపరాధి. నాకు ఉరిశిక్ష వెయ్యండి,'' అన్నాడు. ఆ యువకుడు విజయ్.

జడ్జీ తన బంట్రోతుల కేసి కోపంగా చూస్తూ, "పిచ్చివాళ్లనకూడా కోర్టులోకి రానిస్తున్నారా?'' అన్నాడు. అంతలో జనంగొడవమధ్య ముగ్గురు జ్యూరీలూ పెద్ద గొంతుకతో, "యమున నిరపరాధి అని మా వుద్దేశ్యం!" అన్నారు.

పిచ్చివాడిలా జడ్జీకి కనిపించిన విజయ్ జనాన్ని తొలగదోసుకుని కోర్టుగదినుంచి బయటికి వెళ్ళిపోసాగాడు. జడ్జీ, ''నేను యీ ముగ్గురు జ్యూరీలతోనూ ఏకీభవించి యమునను నిర్దోషి అని విడిచిపెడుతున్నాను." అన్నాడు.

మంగల్‌దేవ్ ఆ సమయంలో కోర్టులో ఒక మూల నిలబడివున్నాడు. తీర్పు అనగానే అతడు యమునను సమీపించి ఏమో చెప్పబోయాడు. కానీ, యమున అతడిమాటలు వినేందుకూడా నిరాకరించింది. పరిస్థితి గమనించిన నిరంజన్, గోస్వామీ కృష్ణదాస్‌లు ఆమెను తమ ఆశ్రమానికి తీసుకుపోయారు.

గోస్వామీ అధ్వర్యంలో నడుస్తున్న బృందావన ప్రాంతంలోని కొండమీది కృష్ణమందిరం క్రమంగా ప్రసిద్ధికి వచ్చి, కాశీనుంచీ, హరిద్వారంనుంచీ చాలా మంది భక్తుల్ని ఆకర్షించింది. నిరంజన్ భక్తుల్లో చాలా మంది అతణ్ణి వెతుక్కుంటూ అక్కడికి రాసాగారు. అలా వచ్చిన వాళ్ళలో నందా ఒకతె. ఈమెకన్న ఆడశిశువునే గుడ్డివాడు గంగాతీరంలో వదిలి, అక్కడవున్న మగబిడ్డను ఎత్తుకుపోయి ఆమె కిచ్చాడు. ఆ మగబిడ్డ మంగల్‌దేవ్, సరళ పుత్రుడు. అతడు నందా చేత విసర్జించబడి అనాధశరణాలయంలో పెరిగాడు. ఇక ఆడశిశువు ఘంటీ.

నవాబ్ హత్యచేయబడిన తరవాత ఘంటీ మతిపోయిందానిలా అనేక ప్రాంతాలు తిరిగి, చివరకు బృందావనం చేరుకున్నది. అక్కడ కృష్ణ మందిరం దర్శనానికి వచ్చిన నందాతో ఆమెకు పరిచయం ఏర్పడి, మాటల సందర్భంలో తాను, గోవింద్‌చౌబాయ్ ఇంట పెరిగానని చెప్పి, గుడ్డివాడు చెప్పిన కథ సంగతికూడా ఆమెకు చెప్పింది. నందా తన కూతుర్ని గుర్తించింది. ఆమె ఆనందానికి అవధులు లేవు. ఇదే విధంగా సరళకూడా, మంగల్‌దేవ్ మెడలోవున్న తాయెత్తు చూసి, అతణ్ణి తన పుత్రుడుగా తెలుసుకున్నది. ఈ ఆనందఘటనలకన్నిటికీ మూలకారణం కృష్ణమందిరం, గోస్వామీ కృష్ణదాసులు.

కాలం గడుస్తున్నది. గుజార్లనాయకుడు మునలిబదన్ తన అవసానదశలో, గాలా అభిప్రాయం తెలుసుకుని, మంగల్‌దేవ్‌తో ఆమె వివాహానికి సమ్మతించి,

తను దాచిన ధనాన్నంతా వాళ్ళపరం చేశాడు. వాళ్ళిద్దరి వివాహం గోస్వామీ అధ్వర్యంలో కృష్ణమందిరంలోనే జరిగింది. మంగళ్‌దేవ్ వివాహం జరిగిన మర్నాడే యమున కృష్ణమందిరం వదలి ఎక్కడైనా పోవాలన్న నిశ్చయానికి వచ్చి, బయలుదేరింది. ఆమెకు నదీతీరంలో విజయ్ కనిపించాడు. అతణ్ణి లోగడ ఎరిగివున్న వారెవరూ అంత తేలిగ్గా గుర్తించలేరు. పొడవాటిజుట్టూ, గడ్డం, చింపిరిగుడ్డలూ, బక్కచిక్కిన దేహం — అతడు చూపరులకు భిక్షుకుడిలా కనిపిస్తాడు. కాని, యమున అతణ్ణి చూస్తూనే గుర్తించి, నవాబ్ హత్యకేసులో అసలు హంతకుడికోసం పోలీసు లింకా గాలిస్తున్నారనీ, కనుక, యీ ప్రాంతాల వుండటం క్షేమం కాదనీ చెప్పి, అతణ్ణి తన వెంట తీసుకుపోయింది.

ఇక కాశీలో, కిశోరీ దత్తపుత్రుడు మోహన్‌ను ప్రేమించలేకా, దేశాలుపట్టి పోయిన కొడుకు విజయ్‌ని మర్చిపోలేకా, మనోవ్యాధితో అవస్థపడసాగింది. క్రమంగా ఆమె మనోవ్యాధి శరీరాన్నికూడా ఆవహించి, ఆమెను దీర్ఘరోగిగా తయారుచేసింది. భర్త శ్రీచంద్ తనకు చేతనైనంతలో ఆమెకు సపర్యలు చేస్తూ, వైద్యులచేత మందులిప్పిస్తున్నాడు. అయినా, కిశోరీ ఆరోగ్యం దినదినానికీ క్షీణించసాగింది.

వేసవికాలం వచ్చింది. ఉదయం పదిగంటలకే తీవ్రమైన వేడిగాడ్పులు ప్రారంభమయినాయి. శ్రీచంద్ బజారుకి పోయి, ఇంటి కవసరమయిన వస్తువులకొని, ఒక దాసీమనిషిని వెంటబెట్టుకుని తిరిగి వచ్చి, మంచంలో కళ్ళుమూసుకు పడుకుని వున్న కిశోరీతో, "పంఖాలాగేందుకు మనిషి కావాలనుకున్నాం కదా. దాసీ దొరికింది. తీసుకువచ్చాను. ఇక్కడే వుండిపోతుంది. తిండీ, బట్టాయిస్తే చాలు," అన్నాడు.

కిశోరీ నీరసంగా తలవూపింది. దాసీవచ్చి కిశోరీ మంచం పక్కగా కూర్చున్నది. కిశోరీ మూలుగుతూ కళ్ళుతెరిచి, దాసీ కేసి చూసింది. ఆమె యమున.

## 6

వేసవి గడిచి వర్షాకాలం ప్రారంభమయింది. గంగాతీరంలోని దశాశ్వమేధ రేవు దగ్గిర, ఒక పెద్దరావిచెట్టున్నది. అది అనేకమంది అనాధజీవులకు ఆశ్రయంగా వుపయోగిస్తున్నది. గంగానదిలో స్నానానికి వచ్చిపోయే వాళ్ళు, ఆ చెట్టుకింద నివసించే బిచ్చగాళ్ళకు గుప్పెడు గుప్పెడు బియ్యం వేసిపోతూంటారు. బిచ్చగాళ్ళు రెండు ఇటుకలమీద కుండపెట్టి, చెత్తాచెదారాన్ని వంట చెరుకుగా ఉపయోగించి, ఆ బియ్యాన్ని జావగాచేసి తాగుతూంటారు.

ఆ రావిచెట్టుకింద పడుకునివున్న బిచ్చగాళ్ళలో విజయ్‌కూడా వున్నాడు. అతడు చిరిగిపోయిన గొంగళికింద ఇటుక ఒకదాన్ని తలగడగా పెట్టుకుని పడుకుని వున్నాడు. అతడి రొమ్ము, పక్కటెముకలు పైకి పొడుచుకు వచ్చాయి. మోకాళ్ళ మీది పుళ్ళనుంచి చీముకారుతున్నది. అతడు కేవలం అస్థిపంజరంలా వున్నాడు. అతడి పెంపుడుకుక్క భాలూ కాళ్ళదగ్గిరపడుకుని జోగుతున్నది.

క్రమంగా చీకటి పడసాగింది. ఒకపెద్దమూట భుజానపెట్టుకుని బిచ్చగా డొకడు రావిచెట్టుకిందికి వచ్చాడు. వాడు విజయ్‌కేసి కోపంగా చూస్తూ, "ఒరే, బద్మాష్! నా చోటు ఆక్రమించుకున్నావా? లేస్తావా, కర్రపెట్టి బుర్రబద్దలు కొట్టమంటావా?" అన్నాడు.

విజయ్ మాట్లాడకుండా ఆ బిచ్చగాడి ముఖంకేసి పరీక్షగా చూడసాగాడు. బిచ్చగాడు ఓ క్షణం ఆగి పళ్లుకొరుకుతూ, కర్రపైకెత్తాడు. భాలూ భొయ్‌మంటూ లేచి వాడిమీద పడపోయింది. విజయ్ దాని తలపట్టుకుని ఆపుతూ, "భాటా! పాపం; అతడిమీదపడకు. మధురలో ఠాణేదారు ఉద్యోగం చేస్తూ లంచంపట్టి, జైలుశిక్ష అనుభవించి, యీ దశకు వచ్చాడు," అన్నాడు.

"ఆఁ ఎవర్రా, నువ్వు?" అంటూ బిచ్చగాడు, విజయ్ ముఖంలోకి గుచ్చిగుచ్చి చూసి, చల్లగా అక్కణ్ణించి జారుకున్నాడు. విజయ్ మత్తుగా కళ్ళుమూసుకున్నాడు. నిద్రవస్తున్నది. కాని, కాళ్ళమీది గాయాలు సలుపుతూ బాధపెడుతున్నవి.

ఓ అరగంట గడిచీ గడవకముందే యమున ఒక చిన్నమూటతో విజయ్ దగ్గిరకు వచ్చింది. వస్తూనే, "తమ్ముడూ!" అని పిలిచింది.

ఆ పిలుపు విని విజయ్, "అక్కా!" అంటూ లేచికూర్చున్నాడు.

యమున మూటలోంచి రొట్టెలుతీసి విజయ్ కిచ్చి, "తమ్ముడూ, నాకు నౌకరీ దొరికింది. ఇక నువ్వు ఆకలితో బాధపడ నవసరంలేదు," అన్నది.

"నౌకరీ దొరికిందా? ఎక్కడ?" అన్నాడు విజయ్

"శ్రీచంద్ర్‌బాబుగారి ఇంట్లో."

విజయ్ చేతిలోంచి రొట్టెలు జారి కిందబడినై. అతడు తలవంచుకుని కొద్దిసేపు మౌనంగా వూరుకుని, "ఇవాళ నువు నాకు చాలా బాధకలిగించావుఅక్కా," అన్నాడు.

"అంతగా బాధపడకు, తమ్ముడూ. నీ తల్లి మరణశయ్యమీద వుంది. ఒకసారి చూస్తావా?" అని అడిగింది యమున.

విజయ్ తుళ్ళిపడ్డాడు. అతడి తల గిర్రున తిరుగుతున్నది. అతడు నిరసించిన



గొంతుతో, "అమ్మ, అంత ఇబ్బుస్థితిలో వున్నదా? చూస్తాను, అక్కా. కాని..."
ఆ తరవాత అతడిగొంతుక పెగలలేదు.

యమున కన్నీళ్లు తుడుచుకుంటూ, "నేను దుర్బలురాలిని, తమ్ముడూ. ఆడదాని హృదయం చాలా దుర్బలం అయినది. నన్ను నేను సమదాయించుకోలేక పోయాను. నాకు కావాలంటే, యీ దాసీపని మరొకచోట దొరుకుతుంది. కాని .... నీకు తెలియదు. తమ్ముడూ. శ్రీచంద్ర్ బాబుగారి దత్తపుత్రుడు మోహన్, నా సంతానమే." అన్నది.

"నిజమా?" అన్నాడు విజయ్ నిర్విణ్ణుడయిపోతూ.

"నిజం. తమ్ముడూ! మోహన్ నా గర్భంనుంచే జన్మించాడు. ఆ కథంతా నీకు తరవాత చెపుతాను." అన్నది యమున రుద్ధకంఠంతో.

"అక్కా నువ్వు నన్ను ఎంతో మానసిక వేదన నుంచి కాపాడావు. మోహన్

చేతిరొట్టె తినటానికి నా కభ్యంతరం లేదు. అమ్మ...చావుబతుకుల మధ్యవుందా? నేను లోనా...వాళ్ళు నన్ను లోపలికి రానివ్వకపోతే?" అన్నాడు విజయ్ బాధగా.

"ఎందుకు రానివ్వరు. శ్రీచంద్ర్‌బాబు యీ మధ్య బాగా దానధర్మాలు చేస్తున్నాడు. మనం యిద్దరం భిక్షకులమే కదా!" అన్నది యమున.

ఇద్దరూ బయల్దేరారు. చాలా వీధులుగడిచి శ్రీచంద్ర్ యిల్లు చేరుకున్నారు. వాళ్ళు వెళ్ళేసరికి, కిశోరీ బయట వసారాలో పడుకోబెట్టబడి వున్నది. శ్రీచంద్ర్ యమున రావటం చూస్తూనే," యమునా, నా మనస్సేమీ బాగాలేదు. మోహన్‌ను తీసుకుని యీ పక్కగదిలో కొంచెంసేపు విశ్రాంతి తీసుకుని వస్తాను," అంటూ మోహన్‌తో వెళ్ళిపోయాడు.

విజయ్ వెళ్ళి తల్లికిశోరీ కాళ్ళదగ్గిర కూర్చున్నాడు. యమున ఆమె చెవిలో, "తమ్ముడు వొచ్చాడు," అన్నది.

కిశోరీ కళ్ళు తెరిచింది. విజయ్ తన తలను ఆమెకాళ్ళకు ఆనించాడు. కిశోరీ ఏదో మాట్లాడాలని ప్రయత్నించింది. కాని మాట్లాడలేకపోయింది. ఆమె కళ్ళ నుంచి అశ్రువులు ప్రవహిస్తున్నాయి. కొంచెం ఆగి ఆమె బాగా కళ్ళుతెరిచి విజయ్ కేసి చూసింది. అంతే. ఆ కళ్ళు అలానే వుండిపోయాయి. విజయ్ లేచి నిలబడ్డాడు. తల్లి ముఖంలోకి అశ్రుపూరిత నేత్రాలతో ఓ క్షణకాలంచూసి, మనసులో – "ఈ దుఃఖమయ శరీరాన్ని కన్న దుఃఖమయ మాతృమూర్తివి నువ్వు; నీ రుణం నేను తీర్చలేనిది," అనుకున్నాడు. అతడు తడబడే అడుగులతో ఇంటిబయటికి నడిచాడు. యమున, కిశోరీ శరీరాన్ని తాకిచూసి కెవ్వుమంటూ అరిచింది. శ్రీచంద్ర్ గది నుంచి బయటికి వచ్చి, భార్య మృతదేహాన్ని చూసి గొల్లుమన్నాడు.

*　　*　　*

రెండు మూడునెలలు గడిచినై. విజయ్ గంగాస్నానఘట్టం దగ్గిరున్న రావిచెట్టు కిందనే వుంటున్నాడు. రోజూ అతడికి యమున రొట్టెలు తెచ్చియిస్తూనేవుంది. కాని, అతడు క్రమంగా క్షీణించిపోతున్నాడు. మరణకాలం మరెంతో దూరానలేదని అతడికి తెలుస్తూనేవున్నది. ఒకనాటి సూర్యోదయ సమయాన కళ్ళు తెరుస్తూనే అతడు దేహాన్ని ఏదో మైకం కమ్ముతూండటం, గుండెలు వేగంగా కొట్టుకోవటం గమనించాడు. యిది మృత్యువు పిలుపు అనుకున్నాడతను. ఈ అంతిమ ఘడియల్లో తనకోసం విచారించేవాళ్ళూ, కన్నీళ్లు కార్చేవాళ్ళూ ఎవరూ దగ్గిర లేనందుకు అతడికి కొంచెం సంతోషం కలిగించింది. అతడు ఎండుపుల్లల్లావున్న చేతులు రెండూ పైకెత్తి, "భగవాన్ ! ఈ అంతిమఘడియల్లో నిన్ను స్మరిస్తున్నాను. ఇంతవరకూ

విన్నేనాడూ స్మరించలేదు. అయినా, నన్ను ఎంతగా కాపాడావు! ఎంతగా రక్షించావు! హే భగవాన్, ఈ నాస్తికుడి వందనాన్ని స్వీకరించు!" అన్నాడు. అదే క్షణంలో అతడి హృదయస్పందన నిలిచిపోయింది.

ఓ గంటతరవాత ఆ ప్రాంతానికి భారత్ సేవాసంఘ స్వయంసేవకులు వచ్చారు. ఈ సంఘాన్ని గోస్వామీకృష్ణదాస్, నిరంజన్‌లు నడుపుతున్నారు. వాళ్ళు భక్తి ప్రచారం చేసుకుంటూ కాశీ వచ్చారు. వాళ్ళు దశాశ్వమేధ ఘట్టం చేరేసరికి జనం గుంపులుగాకూడి వాళ్ళను చూడసాగారు. ముందు స్త్రీల దళం వున్నది. వాళ్ళను ఘంటీ నడుపుతున్నది. కరుణారసపూర్ణమైన పాటలను వాళ్ళు చక్కగా ఆలాపిస్తున్నారు. ఘంటీ రావిచెట్టు ప్రాంతానికి వచ్చి అక్కడవున్న బిచ్చగాళ్ళను చూసి జాలిపడుతూ, గుంపులోని వాళ్ళతో, "చూడండి, ఇక్కడ ఎంతమంది అనాథులు అన్నవస్త్రాలు లేక, మందుమాకులు లేక మరణిస్తున్నారో! పుణ్యాత్ములారా! వీరిని మరవకండి. భగవంతుడు వీరిలోనే వున్నాడు. ఇవ్వి ఈశ్వర మందిరాలు నాశనమైపోతున్నాయి. ఇకనైనా కళ్లు తెరవండి," అన్నది.

హఠాత్తుగా ఘంటీ దృష్టి బిచ్చగాళ్ళకు కొంచెం ఎడంగా కదలాడలేక పడి వున్న ఒక అస్థిపంజరంలాంటి మానవాకారంమీద పడింది. ఆమె ఆ ఆకారాన్ని సమీపించి, "చూడండి, పాపం, తిండికిలేక చచ్చిపోయినట్టున్నాడు. ఇతనికి దహన సంస్కారక్రియలు ..." ఆమె మాట పూర్తిచేసేలోపలే జనంలో కొందరు, "ఈ దహనసంస్కారక్రియలు రోజూ జరుగుతుండేవే. ఈ స్వల్పవిషయాల గురించి ఆలోచించకండి," భక్తి ప్రపూర్ణమైన మీ అమృతగానాన్ని వినిపించండి అంటూ కేకలు వేశారు. ఘంటీ అక్కణ్ణించి కదిలి ముందుకుపోయింది.

ఆ సమయంలో శ్రీచంద్ర్ తన దత్తుకొడుకుతో, దాది యమునతో ఆ ప్రాంతానికి వచ్చాడు. మోహన్, యమునకు రావిచెట్టుదగ్గిర చేరిన జనాన్ని చూపించి, తనను అక్కడికి తీసుకు వెళ్ళమన్నాడు. జనం కాస్త తగ్గినతరవాత తీసుకుపోతానంటూ యమున మోహన్‌ను బుజ్జగించి; జనం అక్కణ్ణించి వెళ్ళిపోగానే చెట్టుకింద పడి వున్న శవాన్నిచూసి, నిలువెల్లా కంపించిపోతూ, దేవసుందరందగ్గిర నిలబడివున్న శ్రీచంద్ర్‌ను సమీపించి, "బాబుగారూ, పదిరూపాయ లివ్వండి," అన్నది బొంగురుపోయిన గొంతుతో.

"ఇప్పుడు డబ్బుతో ఏం పనొచ్చింది?" అని అడిగాడు శ్రీచంద్ర్.

యమున, మోహన్‌ను శ్రీచంద్ర్‌దగ్గిర వదిలి, విజయ్ శవందగ్గిరకు పరిగెత్తి

పోయి, దానిపక్కన కూలబడింది. ఆమె కళ్ళవెంట నీటిధారలు ప్రవహించ సాగాయి. ఆమె ఓ నిమిషం అస్థిపంజరంలావున్న విజయ్‌కేసి కన్నార్పకుండా చూసి, చప్పున లేచి శ్రీచంద్ర్ దగ్గిరకు మళ్ళీ పరిగెత్తిపోయి, "బాబుగారూ! నా జీతంలో తగ్గించుకోండి పదిరూపాయ లివ్వండి. బతికినన్నాళ్ళూ మీకు రుణపడి వుంటాను," అన్నది.

"అసలు సంగతేమిటి? వినాలని వుంది," అన్నాడు శ్రీచంద్ర్ కుతూహలంగా.

"నా కొక తమ్ముడుండేవాడు. అతడు బిచ్చమెత్తి జీవించేవాడు, చనిపోయాడు. అతడికి దహనసంస్కారం చెయ్యాలి," అన్నది యమున.

ఆమెకు దుఃఖం ఆగలేదు. ఏడ్వసాగింది. మోహన్ అదిచూసి తండ్రితో, "దానికి పదిరూపాయి లివ్వు, నాన్నా. ఏడుస్తున్నది," అన్నాడు. శ్రీచంద్ర్ జేబు లోంచి పదిరూపాయలనోటు తీసి యమున కిచ్చాడు

యమున, విజయ్ శవందగ్గిరకు వెళ్ళింది. శవాన్ని శ్మశానందగ్గిరకు మోసుకు పోయేందుకు ఎవరి సహాయం అయినా కావాలి ఆమె దిక్కులు చూడసాగింది. ఆ సమయంలో ఘంటీ నలుగురు స్వయంసేవకులతో అక్కడికి వచ్చింది. స్వయం సేవకుల్లో ఒకడు ఘంటీకి శవాన్ని చూపుతూ, "ఇదేనా, దేవీ! అని అడిగాడు.

"అవును," అన్నది ఘంటీ. యమున తలమీద బాగా ముసుగు కప్పుకుని, స్వయంసేవకుని చేతిలో పదిరూపాయిలనోటు పెట్టింది. అదిచూసి, ఘంటీ, "పుణ్యాత్మురాలు! దానం చేస్తున్నది ఆ డబ్బుతో అవసరం అయిన సామానులు కొని తెచ్చి, శవానికి దహనసంస్కారం చెయ్యండి," అన్నది.

స్వయంసేవకులు వెళ్ళిపోయారు. యమున తలమీది ముసుగుతో శవంపక్కనే కూర్చున్నది. ఆ సమయాన అక్కడికి మంగల్‌దేవ్, గాలాతో హడావిడిగా వచ్చి, "ఘంటీ, నేను నీ సేవాతత్పరతకు చాలా సంతోషిస్తున్నాను. సరే, యికపద. చాలా ముఖ్యమైన పనులున్నాయి." అన్నాడు.

"మానవుల లెక్కల పుస్తకాల్లో ఎప్పుడూ చేయవలసిన ముఖ్యకార్యాలే మిగిలి వుంటాయి," అనుకుని ఘంటీ, మంగల్‌దేవ్‌కు విజయ్ శవాన్ని వేలితో చూపుతూ, "పాపం, ఎంత భయంకరమైన దుర్దశ అనుభవించాడో," అన్నది.

మంగల్‌దేవ్ యీసారి శవంకేసి పరీక్షగా చూశాడు. ఒక స్త్రీ మాసిన బట్టలతో మట్టిలో కూర్చునివున్నది. ఆమె ముసుగు కన్నీటితో తడిసిపోతున్నది. ఆమె ముందు ఒక శవం–కేవలం అస్థిపంజరం.

# "ఫర్‌గెట్ మి నాట్"

స్పెషన్ ట్రిప్ కావటంవల్లనో యేమో నాలాంటి స్టాండింగ్ ప్యాసింజె ర్సుతో బస్సు మరీ రద్దీగావుంది. డ్రైవర్ సడన్ బ్రేకు వెయ్యటంతో, నేను నా ముందున్న రెండు జడలమ్మాయిపైకి ఒరగటం, ఆ అమ్మాయి నా అవస్థ తెలుసుకోకుండా కళ్ళురచేయటంతో నాకు అరకాలిమంట నెత్తికెక్కింది. "ఈ ఆడవాళ్ళందరూ ఇంతే..." కావాలని వాళ్లని అందరూ రాచుకుంటూ పోయే వాళ్ళే అని వాళ్ళ వుద్దేశ్యం.

అయినా పబ్లిక్ బస్సులో మడికట్టుకున్నట్లుగా కూర్చోవాలంటే యెలా సాగుతుంది? ఆమె అవస్థకి జాలేస్తూనే వుంది. సాధ్యమైనంతదూరంగా నిలుచోవాలని ప్రయత్నించినా వెనకనుంచున్న జనం నెట్టుకురావటంతో ఆమెకుదగ్గరగా జరగక తప్పటంలేదు. నా బూటుకాలు మీద ఆమెకాలు ఎంతసేపటినుంచో వున్నా, నేను ఎంతో వోపిగ్గా సహిస్తున్నా, ఆమె తన కాలును కాస్త అవతలికి తీసుకోటానికి విశ్వప్రయత్నం చేసి, సాధ్యంకాక నా వైపు కొరకొరా చూసి ఒకచేత్తోహాంగర్‌ని గట్టిగపట్టుకుని రెండోచేత్తో జారిపోయే పమిటని అదిమి పట్టుకోటానికి వ్యర్థప్రయత్నంచేస్తోంది.

ఆ అమ్మాయి అవస్థచూస్తే మనసు వున్న ఏ మగాడైనా కాస్త "ఫీ" లవక తప్పదు. పాపం ఆమెకి ముందూ వెనుకా ప్రక్కనా అంతా మగవాళ్ళే. ఆమె అవస్థని సీటులో కూర్చున్న వాళ్లు యికిలిస్తూ చూస్తున్నారు. అసలే జనం క్రిక్కిరిసి వుండటంతో గాలి ఏమాత్రం లోపలికి రావటంలేదు.

"టికెట్ట్ ప్లీజ్" కండెక్టర్ జనం లోంచి దూరి చెయ్యి ముందుకి చాచాడు.

నేను పర్స్ తీయటానికి ప్రయత్నిస్తుండగా, డ్రైవర్ సడన్ బ్రేక్ వెయ్యటంతో నా మీద వచ్చిపడింది ఆ అమ్మాయి. "టికెట్" అంటూ ఆమె వైపు చెయ్యి చాచాడు కండెక్టర్.

---

*గోవిందరాజు సీతాలక్ష్మి*

---

ఆమె నా వైపు చూపించటంతో ఆశ్చర్యంగా నోరు తెరిచాను. "ఒక్క టిక్కెట్టే అంటారేం సార్ ..మీలాంటి చదువుకున్న వాళ్ళే ఇలా చేస్తే ఎలా?" కాస్త విసుగూ కాస్త కోపం ధ్వనిస్తూ రెండు టికెట్లూ చించి మిగతా చిల్లర నా చేతిలో పెట్టి ముందుకు వెళ్లాడు. నా ఇష్టా ఇష్టాలతో సంబంధం లేకుండానే గళ్ళపట్టు కుర్రాడు కిస్సుక్కుమన్నాడు నా అవస్థ. ఒక్కక్షణం స్థంభించినా, మరుక్షణంలోనే పట్టలేనంత కోపం వచ్చింది. ఒక్కసారి ఆ అమ్మాయివైపు పరిశీలనగా చూశాను. గౌరవకుటుంబానికి చెందిన అమ్మాయిలానే కన్పిస్తోంది.

"ఏం ప్రపంచంరా బాబూ... ఇదే నేను ఆమెవైపు చూపించి "రెండు టికెట్లూ తీసుకో" అంటే సహిస్తుందా? అల్లరిచేసి విడుస్తుంది. క్షణం ఆలోచించి అసలు ఎవరు ఈ అమ్మాయి? ఏ ఉద్దేశ్యంతో తన టికెట్టు కూడా తీసుకోమందీ? బహుశా బజారురకం కావచ్చు. ఇలా ఆకర్షించేందుకు ప్రయత్నించే వాళ్ళు పట్నవాసంలో వుండొచ్చు... కాని ఏమంత బస్తీకాని ఈ ఊళ్ళో కూడా వుంటారా?

ఆలోచిస్తూ ఉండగానే దిగవలసిన స్టాప్ రావటంతో ఆలోచనలు కట్టిపెట్టి బస్సు దిగి లాడ్జింగ్ హోమ్‌లోకి దారితీశాను.

నా బిజినెస్ పనుల్లో ఈ వూరికి రావటం మామూలే. నౌకరుకుర్రాడు పరుగెత్తుకుంటూ వచ్చి చేతిలోని సూట్‌కేస్ అందుకున్నాడు. ఎప్పుడు వచ్చినా వాడికి మంచి "ఈనాము" ముడుతుంది. అందుకే నేనంటే వాడికి చాలా ఇష్టం.

స్నానం పూర్తి చేసుకుని, కాఫీ తాగి వూళ్ళో నేను కలుసుకోవలసిన వాళ్ళ అడ్రెస్‌లు చూసుకుని వెళ్ళి తిరిగి వచ్చే సరికి రాత్రి ఏడుగంటలయింది. "ఇంకా కొంత పని మిగిలిపోయింది. రేపు కూడా వుండక తప్పదల్లే వుంది" అనుకుంటూ పరధ్యానంగా తలుపు తెరిచాను. ఎదురుగా కన్పించిన దృశ్యానికి ఈ ప్రపంచంలోకి వచ్చాను.

జాకెట్టు విప్పి చేతులు రెండూ ఎత్తి అద్దంలో "బ్రేజియర్సు" లోని తన అందాన్ని పరీక్షగా చూసుకుంటున్న "స్త్రీ" మూర్తి.

"అరే. ఇది ..నా రూము కాదా? పొరపాటుకి చింతిస్తూ ఒక్క అడుగు వెనక్కి వేసి "వెరీ...సారీ" అన్నాను.

"ఛీ.. ఇలా లోపలికి రావటానికి... బుద్ధిలేదూ?" అంది నా వైపు మింగేసేట్టుగా చూస్తూ. ఖంగారుగా పమిట వంటినిండుగా కప్పుకోటానికి ప్రయత్నం చేస్తూ. ఆమె ఎంత ప్రయత్నించినా అతిపల్చటి చీరె కావటంవల్ల ఆమె ప్రయత్నం వ్యర్థమే అయింది. సాలార్ జంగ్ మ్యూజియమ్‌లోని చలువరాతి




శిల్పంలాంటి ఆ అందం నా హృదయాన్ని ఆవరించింది. కాని "బుద్ధి లేదూ ?" అన్న మాటతో వళ్లు మండి పోయింది.

"ఎవరికీ బుద్ధి లేంది ... ఈ మాట నేను అడగాలి మిమ్మల్ని" అన్నాను. ఆ అందమైన కళ్ళు అగ్నిగోళాల్లాగా కోపంతో సెగలు గక్కుతున్నాయి.

"ఆ...నా గదిలోకి వచ్చి...నన్నే బుద్ధి లే దంటున్నావా?" అంది రొప్పుతూ.

"అవును...అసలు తలుపు లోపల వేసుకోకుండా... మీరు...ఇలా ..."

ఆమె నా మాట విన్పించుకోకుండా "యూ...షటప్... గెటవ్ ట్" అంది వెట్టింపు కంఠంతో.

అంతవరకూ ఆ అమ్మాయిమీద నా మనస్సులో యేమూలోవున్న కాస్త సదభిప్రాయం యెగిరిచక్కాపోయింది ఈ సంఘటనతో.

"హూ..." ఆగ్రహంతో నా రక్తం వుడికెత్తిపోయింది. అలా రంకెలు వేస్తూ "గెటవ్ ట్" అంటూ అరుస్తున్న ఆమెని దగ్గరకివెళ్ళి నా బలమైన చేతులతో... ఒక్కసారి... అలా... ఛీ... ఏమిటి నా మనస్సు కూడా సంకీర్ణభావాలకి గురైంది. యేనాడూ చెదరని నా మనస్సు ఈ

రోజు ఇలా... నా స్వాదీనం తప్పుతున్నదేమిటి? ఛీ... ఆ అమ్మాయి తొందరపడి నన్ను కించపరిచిందని... నేనూ వివేకం పోగొట్టుకుంటూనా? అసలు సిటీబస్సు దిగింతర్వాత ఈ అమ్మాయి మాటే మరిచిపోయాను. ఆమె ఈ "లాడ్జింగ్‌లోనే, నా రూము ప్రక్క రూములోనే వున్నట్లుగాకూడా తెలియదు.

"మర్యాదగా మాట్లాడటం.... చాలాఅవుసరం, గుడ్‌నైట్" అంటూ వత్తిపలికి నా రూములోకి వచ్చేశాను.

నా జవాబుకి ఆమెముఖం పాలిపోయింది. అసలు తప్పెవరిది? ఇలాంటి "స్త్రీ"లు ఏ రకానికి చెందుతారు? ఇది నా వూహాకి అందని విషయం. అసలు ఇలా వంటరిగా తిరగటం యెందుకో? అమె పరిస్థితి యేమిటో? బహుశా యెవరైనా నమ్మించి తీసుకువచ్చి మోసంచేసిన బాపతా? కాదు... ఆ అమ్మాయి ముఖంచూస్తే అలా అన్పించటం లేదు.

అయినా ప్రయాణాల్లో సహజంగా ఇలాంటివాళ్ళు తరుచుగా కన్పిస్తూనే వుంటారు. వీళ్ళని గురించి ఆలోచిస్తూ కూర్చుంటే అయినట్లే అనుకుని ట్రావెలింగ్‌బాక్సు తెరిచి రికాడ్సు చూచుకోవటంలో మునిగిపోయాను.

"పదకొండుగంట లయినా యిలా లైటు వెలుగుతుంటే ప్రక్కరూములో యెలా నిద్రపోయేది. కాస్తకూడా మేనర్సు తెలియదులా వుంది మీకు" యెదురుగా అపర కాళిగా గర్జిస్తూ నిలబడింది ఆ అమ్మాయి.

ఒక్కక్షణం చేతివాచీ వైపు చూశాను. పదకొండుకి అయిదు నిమిషాలు తక్కువ. నా గదిలో "లైటు" ఈమెని యెలాబాధించింది? తలయెత్తి చూశాను. ఆ రూముకీ నా రూముకీ మధ్యనవున్న గోడ పూర్తిగా లేదు. గ్లాస్‌షీటింగ్ రూఫింగ్ చేర్చటం మూలాన ఈ గదిలోని వెలుగు ఆ గదిలోకి పడటానికి అవకాశం వుంది. అందుకే ఈ ప్రళయం "యక్స్యూజ్... మీ.. వన్ మినిట్" అంటూ కాగితాలన్నీ సర్దేసి లైటుతీసి బెడ్‌మీద వాలాను.

కాని యెందుకో నిద్ర వచ్చేటట్లుగా లేదు. డిశంబరు కావటంవల్ల చలి విపరీతంగా వుంది. కిటికీ తెరిచి నిలుచున్నాను. చలిగాలి "రైల్వే"యిన వీస్తోంది. దూరంగా మినుకు, మినుకు, మనే నక్షత్రాలు, యెక్కడికో రైలు వెడుతున్న శబ్దం. ప్రజలంతా నిద్రాదేవివడిలో విశ్రాంతి తీసుకుంటన్నారు. మనిషి వంటరితనంలోనే యేవేవో భావాలతో సతమతమౌతూ వుంటాడు. తీయటి తలపులకూ, విషాద గాధలకూ మనసు క్రీడాస్థల మవుతుంది.

యెంత ప్రయత్నించినా నిద్ర రావ






టం లేదు. వచ్చీరాని నిద్ర దోబూచులాటగా వుంది. నిద్ర కలను చేరదీస్తే మెళుకువ బలవంతాన యదార్థంలోకి దింపుతోంది. కలా నిజాల సమ్మిశ్రమం అపూర్వం. మానవు డప్పుడే యెక్కడికెక్కడికో తేలిపోతూ వుంటాడు.

సన్నగా, మెల్లగా మాటలు విన్పించటంలో మెళుకువ వచ్చేసింది. అవి ప్రక్కగదిలోంచే... ఎవరో పురుషుడి కంఠస్వరంలాగా వుంది. అయినా ఇలాంటి హోటళ్ళలో యేంజరిగినా జరగవచ్చు. ఇది సహజమే. ఎంతకాదనుకున్నా ఆలోచనలు ఆ అమ్మాయివైపె పరిభ్రమిస్తున్నాయి. అంతమంది జనంలో ముక్కూ ముఖం యెరక్కపోయినా టికెట్టు కొనిపించి, ప్రక్క రూములోనే వుండి ప్రతిదానికీ తగూకి సిద్ధమవుతూన్న ఈమె ప్రకృతి యెంత ఆలోచించినా అర్థంకావటం లేదు.

ఇంతలో సన్నగా... అలా ..అలా అలలపై తేలివస్తున్న మృదుమధుర గానం నన్ను మైమరపింప జేసింది. ఎక్కడనించబ్బా ఈ గానం? ఎవరు యింత బాగా పాడేవాళ్లు? నిద్రమత్తు పూర్తిగా వదిలిపోయింది. రగ్గు కప్పుకునే తలుపు తెరిచాను. పాట ప్రక్క గదిలోంచిలాగా విన్పిస్తోంది. ఈ "చండిక" యింత బాగా పాడటంకూడా వచ్చా ఏమో ఎలా తెలుస్తుంది. పోనీ సౌమ్యంగా నైనా మాట్లాడితే యేదైనా అడగవచ్చు. మాట్లాడటమే కరుస్తున్నట్లుంటుందయ్యె.

పాట క్రమేపీ తగ్గసాగింది. "ఇంత అర్ధరాత్రి పాటలు పాడుతూ అందరి

నిద్రనూ చెడగొట్టటానికి యెవరిచ్చారు నీకీ అధికారం? మీకు మేనర్సు వుందా ?" అని అడగాలని ఆమె గది తలుపు తట్టాలని తలుపుమీద చెయ్యి వేయ్యగానే తలుపు తెరుచుకుంది.

"అరే... తలుపు వేసుకోవటం ఈమెకి అలవాటు లేదల్లే వుంది... అయినా ఈ అర్థరాత్రి...వంటరిగా... ఈ లాడ్జింగ్ హోమ్‌లో?" ఆశ్చర్యం గానే ముందుకి ఒక్క అడుగు వేశాను. జీరోబల్బు కాంతి పల్చగా గదిఅంతా పరుచుకుంది. యెదురుగా చలికి ముదుచుకుని పడుకున్న ఆమె పెద వులు యింకా అస్పష్టంగా కదులు తున్నాయి. యెంత సుందరదృశ్యం... నేనే చిత్రకారుడినైతే అలాగే ఆమెను చిత్రించేసేవాడిని. ఉచ్ఛ్వాస, నిశ్వాస లతో నెమ్మదిగా స్పందించే వక్షోభాగం పాలభాగంమీద చిందరవందరగా పడి వున్న ముంగురులు "ఫాన్" గాలికి మెల్ల మెల్లగా కదులుతున్నాయి. అంత చలిలోనూ ఆమె ముఖంమీద ఎందుకో సన్నగా ముత్యాలలాగా పోసిన చిరుచెమట? సీరియస్‌గా ఆలో చించి ఆలోచించి అలిసినట్లుందా ఆకృతి చూడగానే పసిపాపలాగ ముదుచు కొని పడుకున్న ఆమెను చూడగానే యెందుకో నా హృదయం ద్రవించింది.

ఆ గదిలోకి వచ్చేప్పుడున్న ఆవేశం ఆవిరిలాగా యెగిరి చక్కాపోయింది. చలికి కప్పుకోవాలనైనా తెలియదూ? వయస్సు ఇరవై సంవత్సరాలు వుండ వచ్చు. అయినా యింకా పసితనపు ఛాయలుమాత్రం పోలేదు. నా రగ్గు తీసి ఆమెకు కప్పి మెళుకువ వచ్చిందా! అనిచూస్తే ఇంకా అలాగే నిద్ర పోతుంది. "పిచ్చి పిల్ల" అనుకుని తలుపు దగ్గరగావేసి నా గదిలోకివచ్చి పడు కున్నాను.

... ... ...

రాత్రి సరిగా నిద్రలేకపోవటంతో, లేచేసరికేకాస్త ఆలశ్యమైంది వుదయం. ప్రక్క గదిలో "యే సందడీ విన్పించటంలేదు అయినా యింత త్వరగా ఆ "చండిక" లేస్తుందా? అనుకుంటూ నారాయణరావుగార్ని కలుసుకోటానికి గబగబా స్నానం పూర్తిచేసుకుని క్రిందకి దిగివచ్చాను. కాని యెదురుగా కన్పించిన దృశ్యం నన్ను నిర్ఘాంతపరచింది.

ఆమె మరొక యువకుడితో కలిసి మేనేజర్‌కి బిల్లు చెల్లించి గేటుదగ్గర వున్న జట్కా దగ్గరకి వెళ్ళిపోతోంది. అరే... నన్ను చూసికూడా చూడ నట్లు... అసలు యెరగనట్లుగా...ఎలా వెళ్ళిపోతోంది... కావాలని కాస్త దగ్గుకూడా తెప్పించుకున్నాను. ఆమె ప్రక్కన నడుస్తున్న యువకుడు వెనక్కి తిరిగి చూశాడు గాని ఆమె మాత్రం తిరిగి చూడలేదు.




"హూ... కృతఘ్నురాలు... రాత్రి రగ్గు కప్పిన విషయం కనీసం తెల్లవారైనా గుర్తించలేదా?

"రాత్రి సమయంలో వంటరిగా వున్న నా దగ్గరకి యెందుకు వచ్చావ్' అని విరుచుకు పడుతుందో? లేక చలి బాధని నివారించినందుకు కృతజ్ఞతే తెలుపుతుందో?" అనుకుంటూ అప్పుడు నేను గంభీరంగా నవ్వి రాత్రి దృశ్యం వర్ణిస్తున్నప్పుడు ఆమె ముఖంలో మారే రంగులు చూసి సంతృప్తిపడాలని ఆశిస్తే చివరికి జరిగింది మరోలాగా.

పోనీ వెళ్లేప్పుడు....ఒక్కసారి..ఒకే ఒక్కసారి..."వెడుతున్నాను"అని ఒక్క మాట చెప్పివుంటే అంతబాధ కలగక పోను.

యెదురుగా ఆ జంట యెక్కిన గుర్రపుబండి టకటకా శబ్దం చేసుకుంటూ వెళ్ళిపోయింది. అతన్ని యింకా యింకా దగ్గరగా అతుక్కు కూర్చుని నావైపు అపరిచితులని చూచినట్లు చూస్తూ వెళ్ళిపోయింది. నా హృదయం ఒక్కసారి బాధగామూలిగింది. యెవరో ఆత్మీయులు దూరమయినట్లు "ఫీ" లౌతూ "ఇంక ఈరోజు నేనేంచేయలేను. పని పూర్తి కావటానికి యింకోకరోజు పట్టనీ" అనుకుంటూ రూములోకివచ్చి "బెడ్" మీద వాలిపోయాను.

"ఏం.... బాబూ... కాఫీ... కావాలా? బైటకి వెళ్ళకుండా వెనక్కి వచ్చేశారేం" అంటూ ప్రశ్నించాడు హోటల్ కుర్రాడు.

"తల నొప్పిగా వుంది... ఒకకప్పు స్పెషల్ కాఫీ తీసుకురా... అరేయ్ ఇలారా... రాత్రి యిక్కడ పాట పాడింది యెవరు?" అన్నాను కుతూహలంగా.

"ఓ... అదా బాబూ... కిష్టిగాడి అమ్మలేదూ సార్ అది మన హోటల్లో పప్పు రుబ్బుతుందే అది... పాడింది. నేనే పాడిస్తా అప్పుడప్పుడూ. చాలా బాగా పాడుతుందండీ. తీసుకురమ్మన్నారా?" అంటూ వెళ్ళబోయాడు.

"వద్దు.... వద్దు" అన్నానేకాని నా ఆశ్చర్యానికి అంతులేదు.

"అరే... ఆ అమ్మాయి కాదూ పాడింది? చాలా విచిత్రం. కిష్టూగాడి అమ్మ ఇంత మధురంగా పాడుతుందా?

నేను ఆ లో చి స్తూ వుండగానే "బాబూ ఈ వుత్తరం మీ కిమ్మని ఆ పక్క రూములో దిగిందే ఆ అమ్మాయిగారు యిచ్చారండీ...మరిచేపోయాను. ఆ అమ్మాయిగారు ఇప్పుడే గది కాళీ చేసి వెళ్ళారు. బలే మంచి అమ్మాయి. సినీమాకెళ్లు అని రూపాయిచ్చింది బాబూ. "కాఫీ" క్షణంలో తెస్తా" అంటూ కవరు చేతిలోపెట్టి లోపలకి పరుగెత్తాడు.

నాకా? ఆ చండిక వుత్తరం రాసి... ఇవ్వమని వెళ్ళిందా? ఆశ్చర్యంనుంచి తేరుకుంటూ కవరు తెరిచాను.

"నమస్తే...

మిమ్మల్ని ఏమని సంబోధించాలో తెలియటంలేదు. మీ గురించి ఎక్కువ తెలియకపోయినా సహృదయులని గుర్తించాను. ఇక నా గురించి చెప్పాలంటే...మిగతా విషయాలు ఎలా వున్నా అసలు నేను యిలా వంటరిగా ఎందుకు ప్రయాణించానో చెప్తాను.

నేనూ, ఆనంద్ B. Sc. ఫస్టియర్ నుంచీ స్నేహితులం. బాగా అర్థంచేసుకున్నాం. ఒకరిని ఒకరం ప్రేమించుకున్నాం. కాని వివాహం చేసుకోవాలనుకునేప్పటికే వచ్చింది చిక్కంతా! ఏముందీ? మామూలే! అతని తల్లిదండ్రులూ, నా తల్లిదండ్రులూ ఆమోదించలేదు. కులమూ, అంతస్తులూ, అడ్డువచ్చాయి. మేము మాత్రం చిలుకా గోరువంకల్లాగా స్వేచ్ఛా జీవితాన్ని గడపటానికి నిశ్చయించుకున్నాం. కాని నిర్ణీతసమయానికి "ట్రైను" దగ్గర ఆనంద్ నన్ను కలుసుకోలేకపోయాడు. ఎంత చదువుకున్నా స్త్రీ వంటరిగా, ఈ ప్రపంచంలో మనగలగటం కష్టసాధ్యమని రెండురోజుల్లోనే గుర్తించాను.

ట్రైల్లోనే నా సూట్ కేసు దొంగిలించబడింది. పర్సు మాత్రం జాకెట్టులో వుండటంవల్ల భద్రంగానే వుంది... "దగ్గర డబ్బువుండీ నా చేత బస్ టికెట్ ఎందుకు కొనిపించిందీ?" అని మీరు ఆశ్చర్యపోతున్నారు గదూ? అసలు సంగతి ఏమిటంటే నేను వంటరిగా వున్నానని "రౌడీ"లు పసికట్టి నావెంట పడ్డారు. వాళ్ళకి మస్కా ఇచ్చేందుకే అలా ప్రవర్తించాను. మీ అప్పటి గాభరా చూస్తే, నాకు బోలెడంత

జాలేసింది. కాని యేంచేయను? మీ మంచితనం కళ్ళల్లో కన్పిస్తున్నా నాకే,.. యేదో ... భయం. "టికెట్టు కొన్నాను గదా?" అనే చులకనతో యేమైనా...ఇలా యేదో భయంతోనే మీతో సరిగా మాట్లాడలేక లేని ఆగ్ర హాన్నీ, రాక్షసత్వాన్నీ ప్రదర్శించి నన్ను నేను కాపాడుకోవా లను కున్నాను.

కాని...నా ఆలోచనలన్నీ ఆధార రహితమేనని రాత్రి మీరు...నా గది లోకి వచ్చి చలిలో, ముడుచుకు పడు కున్న నాకు మీ "రగ్గు" కప్పి ఆ చలి బాధను మీరు అనుభవించారంటే మీది సంస్కారయుతమైన హృదయం కాదన టానికి ఎవరికి ధైర్యం వుంది?

నేను మొదట కావాలనే తలుపు తెరిచి పడుకున్నాను. కాని మీరు తిరిగి వెళ్ళింతర్వాత తలుపు గట్టిగా బిగించి పడుకున్నానని మీకు తెలియదుకదూ? మీతో కాస్త చనువుగా మాట్లాడాలనీ, కృతజ్ఞత తెలియజెయ్యాలనీ యెంతో అనుకున్నాను. కాని అలా దగ్గరగా వస్తే వివరాలన్నీ అడిగి తెలుసుకుని చులకనగా చూస్తారేమో అని భయ పడ్డాను.

ఆనంద్ ఆ "ట్రైన్" కి రాలేదు. "నమ్మించి మోసంచేశాడు" అని ఎంతో కుళ్ళి కుళ్ళి ఏడిచాను. కాని అదంతా నా పొరపాటే. తర్వాత ట్రైన్ కి వచ్చి ఎంతో కష్టపడి నన్ను ఈ హోటల్లో కలుసుకున్నాడు. ఇక మా అదృష్టం పండినట్లే. నా జీవితబాట కొక సహ బాటసారి...కాదు...కాదు .. ప్రేమిం చిన భర్త లభించినందుకు నా సంతోషం వర్ణనాతీతం.

మీకు ఈ విషయాలన్నీ స్వయంగా తెలియజేయా లనుకున్నాను... బహుశా ఎదురుగా అయితే ఇలా... నా మనస్సు విప్పి చెప్పలేనేమో? మే మిద్దరం దూరంగా వెళ్ళిపోతున్నాం. తల్లిదండ్రులనీ, ఆత్మీయులనీ, వదిలి ఒకే ఒక వ్యక్తి కోసం నా సర్వస్వాన్నీ అర్పణ చేసుకుంటున్నాను. భవిష్యత్తు ఎలా వుంటుందో? మీ జ్ఞాపకచిహ్నంగా మీ రగ్గు కూడా నాతో తీసుకువెడు తున్నాను. మీరు అలా చలి అనుభ వించాలిసిందే. మీకు ఈ భావంలో కూడా ఒకవిధమైన తృప్తి ఉంటుందని నాకు బాగా తెలుసు.

ఆఖరుసారిగా మీకు నా హృదయ పూర్వక నమస్కారాలు.

రౌడీల బారినుంచి రక్షించినందుకు "థ్యాంక్స్". రగ్గు ప్రజంట్ చేసినందుకు డబుల్ థ్యాంక్స్.

ఈ కాలంలో కూడా మీలాంటి సహృదయులున్నారంటే అది నిజంగా వండర్!

ఫర్‌గెట్ మి నాట్.

సుచిత్ర."




-పాఠాలన్నీ నేర్చుకున్నాను
నానా! అందుకే ఇవ్వాళ
బడికివెళ్లను- నేర్చుకుని
రాని వాళ్లందరూ నన్ను
చంపేస్తారు!


ఛ-ఏవిట్రా నీ
హాండ్ రైటింగ్
అలా
ఉంది?
అందుకే
గద
నాన్నా
నేను
డాక్టరు కావాలను
కుంటున్నది!


-జవాబుతెలిసుండి కూడా
ఎందుకువాయ్ మరి
నన్నడిగావ్? —
Anjan


-చూడు బాబూ! పుట్టుకతో
వచ్చినంత
మాత్రాన
-చాలదు-
కృషి కూడా
చెయ్యాలి!



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

"అయిందా రాజా!"

సమాధానంగా, నాతోపాటు మంచంమీద కూర్చుని వున్న రాజేశ్వరి లేచి నిలబడింది

ఒక్క క్షణం కృష్ణ కళ్లు చురుగ్గా రాజేశ్వరిని ఆసాంతం పరీక్షించినాయి. ఆ కళ్ళల్లో ఆనందం, ఆశ్చర్యం, సంతృప్తి కదలాడటం నేను గమనించకపోలేదు. కానీ వెంటనే ముఖం చిట్లించాడు. కనుబొమలు ముడుచుకున్నాయి. చిరచిరలాడుతున్నట్టు చూస్తూ —

"యీ అలంకారం అంతా ఏమిటి? యిదంతా చేసుకోమని ఎవరు చెప్పారు నీకు?" అన్నాడు.

నేను తెల్లబోయాను.

రాజేశ్వరి పిడుగుపడినదానిలా చూసింది.

"తీయ్. తీయ్. ఆ లోలాకులూ, గాజులూ, గొలుసూ అన్నీ తీసేయి. ఆచీరకూడా విప్పు," అన్నాడు.

అతని నోటినుంచి ప్రశంసావాక్యాలు వస్తాయని ఎదురు చూస్తున్న నేను హఠాత్తుగా అతనలా చిరాకుపడటం చూసి ఏమనాలో తోచనిదానిలా నిలబడిపోయాను.

ఇంతలో అత్తయ్య గదిలోకి వచ్చింది. ఆవిడవెంట మంగమ్మగారుకూడావుంది.

కృష్ణ గిరుక్కున అత్తయ్యవైపు తిరిగి కోపంగా అన్నాడు, "ఏమిటమ్మా!

యిదంతా నువ్వు చూశావా? యింత చిన్న విషయంకూడా నేను మీకు చెప్పాలన్న మాట. దాన్ని ఎలా తయారుచేయాలోకూడా తెలియదా నీకు?''

అత్తయ్య తెల్లబోయినదానిలా మాట్లాడలేదు.

కానీ మంగమ్మగారు వూరుకోలేదు. ఆవిడ అందుకుంది, "అమ్మాయి కేమైందిరా? అచ్చు లక్ష్మీదేవిలా వుంటేను."

"ఆ! వుంటుంది. కానీ కట్నం యివ్వలేమని బేరాలాడుతున్న మనం పిల్లని ఇన్ని నగలతో చూపిస్తే ఎంతయినా బాగుంటుంది. అసలయినా యింత అలంకారం దేనికి? యిదేమైనా బ్యూటీ కాంటెస్టా? పిల్ల యింట్లో ఎలా వుంటుందో అలా చూపాలిగాని! రాజూ, ఎవరికో మతిలేదనుకో, నీకెలా లేకపోయిందే!–" అంటూ గబగబా పిల్లలందరూ బట్టలుపెట్టుకునే పెట్టెదగ్గరకి వెళ్ళి, దాన్ని తెరచి, అందులోంచి రాజుకున్న ఒకేఒక మంచిది – తెలుపుమీద చిన్నచిన్నపూలున్న తెల్లచీర తీసి మంచంమీద గిరాటేస్తూ, "రెండు నిముషాల్లో తయారవాలి. ఆ నగలన్నీ తీసేయి. చేతులకి నీ ఎర్ర మట్టిగాజులు వేసుకో. నేను మళ్ళీ యీ గదిలోకి వచ్చేసరికి నువ్వు సిద్ధంగా వుండాలి," అని ఆజ్ఞాపించి, "రా అమ్మా. ఈలోపల వాళ్ళకి కాఫీ, ఫలహారాలు యిచ్చేద్దాం" అన్నాడు.

అత్తయ్య, మంగమ్మగారు కృష్ణ వెనక వెళ్ళిపోయారు.

నేను రాజేశ్వరివైపు చూశాను. రాజేశ్వరి ఏడుపు ఆపుకుంటున్నట్టుగా క్రింద పెదవి పళ్ళతో నొక్కిపట్టి గబగబా గొలుసూ, గాజులు అన్నీ తీసేసింది. చకచకా ఎర్రరంగు మట్టిగాజులు నాలుగేసి రెండుచేతులకీ వేసుకుంది. నేను కట్టిన చీర, శాటిన్ లంగా విప్పి, తన లంగామీద కృష్ణ పడేసిన చీరకట్టేసుకుంది. జడలో గులాబీకూడా పీకి మంచం మీద పడేసింది.

షైమ్ లేకపోయింది. లేకపోతే జడవిప్పి బిగువుగా వేసుకునేదేమో! ఓడిపోయినట్టువ్న నాకు ఈ అవమానం రాజేశ్వరిదా, నాదా అన్పించసాగింది. విశ్లేష్టురాలిని అయిపోయిన నేను నీరసంగా మంచంఅంచున కూర్చుని గోళ్ళు కొరకసాగాను.

బైటగదిలో కృష్ణ పెళ్ళివారిని "మంచినీళ్ళు కావాలా! యింకోరెండు పకోడీలు తీసుకోండి" అంటూ ఎంతో నమ్రతగా, మర్యాద పుట్టిపడుతున్న కంఠంతో బలవంతం చేస్తున్నాడు.

క్షణంక్రితం కోపంతో ఊగుతూ, ఎదుటివాళ్ళని విమూఢుల్ని చేసిన కంఠానికి, యిప్పుడీ స్వరానికి పోలికలేదు.




కృష్ణసంగతి తెలియనివాళ్ళంతా, మొదట నేను అనుకున్నట్టే, ఎంత మెత్తటి మనిషో అని ఆపోహపడే అవకాశం వుంది.

ఐదు నిమిషాల్లో కృష్ణ చెప్పివెళ్ళినట్టుగా మళ్ళీ గదిలోకి వచ్చాడు.

రాజేశ్వరి భయంభయంగా అతనివైపు చూసింది.

ఈసారి కృష్ణకళ్ళు సంతృప్తిగా చూసినాయి.

దగ్గరగావచ్చి, రాజేశ్వరి ముఖంపట్టి పైకెత్తి "ఏదీ యిలా చూడు. వుండు యీ చివరకంటికి కాటిక ఎక్కువ కొస వచ్చేసింది" అంటూ తన జేబురుమాలు తీసి తుడిచాడు. పవుడర్ అడిగి తీసుకుని తనే ఆ కాటుక కన్పించకుండా సరిదిద్దాడు.

తర్వాత హఠాత్తుగా నవ్వుతూ, రాజేశ్వరి నెత్తిమీద చిన్నగా మొట్టి, "ఏం భయంలేదు. మరీ బిగుసుకుపోయినట్టు కూర్చోకు. వాళ్ళు నిన్ను తినటానికిగాని, ఎత్తుకుపోవటానికిగానీ రాలేదు. ఏదయినా అడిగితే బెదిరిపోయి తడబడ్డావంటే నీకు నత్తివుందని నచ్చలేదంటారు. చక్కగా సమాధానం చెప్పు. నీకేదయినా భయం వేస్తే నావైపుగాని, అమ్మవేపుగాని చూడు. తెలిసిందా" అన్నాడు.

రాజేశ్వరి ఎర్రబడిన ముఖాన్ని దించుకుని అలాగేనన్నట్టు తలూపింది.

కృష్ణ హఠాత్తుగా నా వైపుతిరిగి, "యిదేమిటి? నువ్వు జడయినా వేసుకోకుండా యిలా కూర్చున్నావు?" అన్నాడు.

"నాకు తలనొప్పి పోలేదు," అన్నాను కోపంగా.

కృష్ణ రాజేశ్వరిని వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు.

ఆరోజు ప్రత్యేకంగా, పెళ్ళివారు వస్తున్నారని, మరుగువుండదని ముందుగదికి, యీగదికి ఎవరినో అడిగి పరదా ఒకటి తెచ్చి కట్టారు. అది ఎప్పటిదో. ఏ యిక్ష్వాకులనాటిదో! గుడ్డ పాతబడి, చిరగటానికి సిద్ధంగావుంది. కుడివైపున ఒకచోట ఎలక కొట్టేసింది. పరదానిండా ముదురురంగుతో పూవులుండటంవల్ల పరీక్షగా చూస్తేతప్ప అక్కడ చిరుగువున్నట్టు కన్పించటంలేదు.

రాజేశ్వరి వెళ్ళిపోయిన తర్వాత నేను ఆపరదాదగ్గరికి వచ్చి ఆ కన్నంలోంచి చూడసాగాను.

పరదా చాలా పొడవుగా వుండటంవల్ల నేలకి అనుకుని వేళ్ళాడుతోంది. కాబట్టి నేనుగానీ, నా పాదాలుగానీ వాళ్ళకి కన్పిస్తాయనే భయం ఏమీలేదు.

ముందుగదిలో మామూలుగా పట్టెమంచం వేసివుండేచోట అది తీసేసి మూడు కొయ్యకుర్చీలు వేశారు. ఆ కుర్చీల ప్రక్కన యింకో చిన్న స్టూలువుంది.

వాటికెదురుగా గదిమధ్యగా, ఓ చాప వేసివుంది. ఆ చాపమీద రాజేశ్వరికాక, యింకో వయసుమళ్ళినావిడ, మరోముగ్గురు ఆడపిల్లలూ కూర్చుని వున్నారు.

కుర్చీల్లో మూడింటిలో తలుపుదగ్గరగా, రాజేశ్వరి కెదురుగా పెళ్ళికొడుకు కాబోలు ఓ పాతికేళ్ళ పడుచువాడు, అతని ప్రక్కన అతని పోలికలు స్పష్టంగా కనిపిస్తున్న మరో ముసలాయన, ఆయన తర్వాత ఆచార్లుగారు కూర్చునివున్నారు.

కృష్ణ గోడవారగా ఓ ప్రక్కగా నిలబడివున్నాడు. అతనిలో ఓ విధమైన హుందాతనంతోపాటు, బాగా పెద్దమనిషితరహాకూడా కన్పిస్తోంది.

ఆడవాళ్ళు రాజేశ్వరిని మ్యూజియంలో కూర్చోబెట్టిన బొమ్మని చూసినట్టు పరీక్షగా చూస్తున్నారు.

నేను పెళ్ళికొడుకుని పరీక్షగా నఖశిఖపర్యంతం విమర్శగా, దీక్షగా, రెప్పవాల్చకుండా చూడసాగాను.

అతను ఒక్కమాటలో చెప్పాలంటే జూలో జంతువులా విచిత్రంగా, వినోదంగా వున్నాడు.

శరీరఛాయ చామనఛాయకి ఒకరంగు తక్కువే.

కనుబొమలు వత్తుగా, పొదల్లా వున్నాయి.

ముక్కు దృఢంగా, పొడుగ్గా మొహానికి మించివుండటంతో ముఖంవైపు చూడ గానే ఒక ముక్కే కన్పిస్తోంది.

కళ్ళు చిన్నవిగా వున్నాయి.

పెదవులు బండగా, మోటుగా, సిగరెట్ కాల్చే అలవాటున్నట్టు నల్లగా, లోపలికి ఎర్రగా వున్నాయి.

ప్రక్కపాపిడి తీసుకుని, వేస్ లైన్ బాగా రాసుకుని అణిచినట్టు దువ్వినా ఆ జుట్టు దట్టమైన వంకీలతో, ఓ పక్క కొండలా, మరోపక్క మామూలుగా వుంది.

నల్లటి టైట్ పాంటు వేసుకున్నాడు.

చారలచారల బుష్ షర్ట్ ఛాతిమీద రెండుగుండీలు వదిలేసి ధరించాడు.

కాళ్ళకి వేసుకున్న పుల్ బూటు, మేజోళ్ళు కొత్తవికాబోలు. అందరికీ కన్పించేలా కాలిమీద కాలేసుకుని కూర్చున్నాడు.

అతను కూర్చున్నతీరే నచ్చలేదు నాకు.

మగవాళ్ళలోకల మగసిరి, హుందాతనం అసలు వాళ్ళు కూర్చోవడంలోనూ, మాట్లాడటంలోనే కన్పిస్తుందని నా నమ్మకం.

అతన్ని చూడగానే ముఖం మాడ్చుకుని, చురచురా చూసి గిరుక్కున లేచి లోపలికి రాకుండా, ఓపికగా అక్కడే కూర్చున్న రాజేశ్వరి సహనానికి నేను అచ్చెరు వొందాను.

రాజేశ్వరి చుట్టూకూర్చున్న ఆడవాళ్ళు దాన్ని ప్రశ్నలతో చంపేస్తున్నారు.

"వంట వచ్చునా అమ్మాయి?" వయసుమళ్ళిన ఆవిడ అడిగింది.

రాజేశ్వరి తల ఎత్తకుండానే వచ్చునన్నట్టు తలూపింది.

గుమ్మంవద్ద నిలబడివున్న మంగమ్మగారు అందుకుంది.

"అబ్బో! వంటమాటే అడిగారూ! మా అమ్మాయి ములక్కాడ వేసి సాంబారు చేసినా, దానిచేత్తో వండిన గుత్తివంకాయ కూర తిన్నా అమృతం తిన్నట్టేవుంటుంది."

"అలాగా! వంటకేముందిలెండి. ఆడపిల్లన్నతర్వాత అందరికీ వస్తుంది. కుట్లూ, అల్లికలులాటి వేమైనా—" ఈసారి ప్రశ్న అడగటం తన ఛాన్సు అన్నట్లు టక్కున అడిగింది ముగ్గురిలో ముదురురంగు ఎరుపుచీర కట్టుకున్న ఒకమ్మాయి.

రాజేశ్వరి మాట్లాడలేదు.

మంగమ్మగారే మళ్ళీ అందుకుంది.

"కుట్లుమాట చెప్పారూ! దానికి రాని కుట్టేలేదు. ఏ పుస్తకం చూసినా యిట్టే

నేర్చుకుంటుంది. వూళ్ళో ఆడపిల్లలంతా మధ్యాహ్నం దాని చుట్టూచేరి క్షణం వూపి రాడనివ్వరు."

"కుట్టినవేమైనా వున్నాయా?"

"బోలెడన్ని మీకు చూసే ఓపికవుండాలిగాని." మంగమ్మగారు లోపలికి వెళ్ళి అత్తయ్యని అడిగి రెండుమూడు తెచ్చింది.

వాళ్ళు వాటిని పరీక్షగా చూసి పక్కన పెట్టేశారు.

"పాటలేమైనా వచ్చా? మా అన్నయ్యకి పాటలంటే యిష్టం." కీచుగొంతుతో వున్న ఒకమ్మాయి హుషారుగా ముందుకు వంగి అడిగింది.

పెళ్ళికొడుకు ముసిముసినవ్వులు నవ్వాడు.

రాజేశ్వరి రానన్నట్టు తలూపింది.

మంగమ్మగారు గండుమన్నట్టు కసిరింది.

"రానంటావేమే! యిప్పుడు సిగ్గుపడితే యింకెప్పుడూ నువ్వు పాడేది? పాడు ఒకటి" అని వాళ్ళతో, "చక్కగా పాడుతుంది. సంగీతం చెప్పించలేదుకానీ అపర సరస్వతి అంటే నమ్మండి" అంది.

"సినిమా పాటలేమైనా పాడించండి." అన్నాడు పెళ్ళికొడుకు.

రాజేశ్వరి మంగమ్మగారి బలవంతంమీద, అత్తయ్య చెప్పగా, చివరికి కృష్ణ కూడా, "పాడమ్మా, ఏదన్నా ఒకటి" అనగా చివరికి రేడియోలో తరుచుగా వినిపించే కృష్ణశాస్త్రిగారి భావగీతం ఒకటి పాడింది.

నేను నిస్పృహగా నుదురు కొట్టుకున్నాను.

"ఖర్మ! ఎందుకే పిచ్చిమొహందానా, యింకా ఎక్కడ [illegible]ర్యుని పాట పాడలేవు, లేచి [illegible] వాళ్ళ మొహాలకి నీపాట వినే అర్హతకూడా లేదు" అనుకున్నాను.

రాజేశ్వరి కంఠం తీగెలా, సున్నితంగా, స్పష్టంగా [illegible] అలవోకగా గానమాధుర్యాన్ని రుచిచూపిస్తుంటే సర్వం మరిచి దానివైపు చూడాల్సిన పెళ్ళికొడుకు తలెత్తి పైకి చూసేసి, గుమ్మాలకేసి పరీక్షగా చూడసాగాడు. పాట అయిపోయింది.

"నువ్వేదైనా మాట్లాడవయ్యా" అన్నాడు ఆచార్లుగారు.

జంతువులాంటి పెళ్ళికొడుకు కాళ్ళు నేలకితన్ని పెట్టి కుర్చీలో వెనక్కి వాలి, ఛాతీని వుబ్బించి కూర్చుని, "నీ పేరేమిటి?" అన్నాడు.

"రాజేశ్వరి." తల ఎత్తకుండానే అంది రాజేశ్వరి.

ఇంతలో ఆచార్లుగారు కృష్ణని దగ్గరకి పిలిచి చెవిలో ఏదో అడిగారు. కృష్ణ

నే నున్న గదివైపు రావటం చూసిన నేను చటుక్కున పారిపోయి వచ్చి మంచం మీద పడుకుని, తలనొప్పి భరించలేనిదానిలా వేళ్ళతో కణతలు నొక్కుకోసాగాను.

లోపలికి వచ్చిన కృష్ణ, నా తలవైపునవున్న అల్మేరాదగ్గిరికివెళ్ళి చేతిలోవున్న స్టీలుభరిణలో యింకొంచం వక్కపొడి వేసుకుని వెళ్ళిపోయాడు.

నేను మళ్ళీ పరదాదగ్గరకు వెళ్ళలేదు.

పెళ్ళిచూపులు అయిపోయినాయి కాబోలు.

ఆచార్లుగారు "మంగమ్మగారూ ! అమ్మాయిని లోపలికి తీసుకువెళ్ళండి'' అన్నారు.

వాళ్ళంతా రాజేశ్వరితో వంటయింట్లోకి వెళ్ళినట్టున్నారు.

అక్కడినుంచి మంగమ్మగారి కంఠం ఖంగుమని విన్పిస్తోంది.

"చూశారా యివన్నీ. ఈ మొక్కలన్నీ అమ్మాయి పెట్టినవే. దానికి రానిపని లేదనుకోండి."

కృష్ణ జాగ్రత్తగా, శ్రద్ధగా పెంచిన మొక్కలని రాజేశ్వరి పనితనం అన్నట్టు చూపుతున్న ఆవిడ మాటలకి నేను నవ్వుకున్నాను.

పెళ్ళికి ముందే యివన్నీ నేర్చుకుని వుండాలా ?

పెళ్ళి అయిన తర్వాత నేర్చుకోకూడదా ?

వీళ్ళ ప్రశ్నలు, సమాధానాలు చాలా గమ్మత్తుగా వున్నాయి.

వచ్చినవాళ్ళు వెళ్ళిపోతున్నట్టున్నారు

నమస్కార ప్రతినమస్కారాలు జరుగుతున్నాయి.

ఆచార్లుగారు తనకి తొందరపని వున్నందువల్ల వాళ్ళతో రోడ్డువరకూ రాలే నందుకు నొచ్చుకుంటూ క్షమార్పణ కోరుకుంటున్నాడు.

''లేదులెండి. అబ్బాయి వస్తున్నాడుగా,'' అంటున్నారు వాళ్ళు.

''తమని ఎల్లుండి నేను బందరు వచ్చినప్పుడు కలుస్తాను.''

"అలాగే.'' అంగీకరించారు వాళ్ళు.

"వెళ్ళొస్తామండీ." ఆడవాళ్ళు ఒక్కొక్కరే చెబుతున్నారు.

నా కెలాగోవుంది.

సారథితో నాకూ ఒకరకంగా పెళ్ళిచూపులు జరిగాయి.

కానీ దానికి, దీనికీ పోలికేలేదు.

అమ్మ ఆరోజు నా ప్రాణంతీసి నన్ను బొమ్మలా అలంకరించింది.

యిక్కడ కృష్ణ రాజేశ్వరిని ఎలాంటి అలంకరణా లేకుండా యింట్లో మామూ లుగా ఎలావుంటుందో అలా చూపించాడు.

దిట్టమైనది...
ఖచ్చితమైన —
నిర్మాణము...
విశిష్టమైన రచన






# హెర్క్యులిస్

## మీ కొరకే నిర్మించబడింది

హెర్క్యులిస్ 135 దేశాలలో ప్రసిద్ధిగా అభిలషించేది. భారతదేశంలో ఎక్కువగా అమ్ముడు పోయేదికూడా ప్రపంచంలో పెద్ద సైకిల్ తయారీదారులైన ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ లిమిటెడ్. యు.కె.వారి నూతన సాంకేతిక విజ్ఞాన కౌశల్యాన్ని వినియోగించి సౌత్ ఈస్ట్ ఏషియాలో అతి ఖచ్చితంగా నిర్మింపబడింది.

సైకిల్ మీద పెట్టుబడి ఎంతో అమూల్యమైనది. హెర్క్యులిస్‌ను వాడండి. మీరిచ్చే సరసమైన వెలకు ఇది అమోఘమైన సైకిలు.



## హెర్క్యులిస్

—సైకిల్‌కంటే జీవితకాలపు నేస్తము

ఇండియాలో తయారీ: టి.ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూర్—మదరాసు 53
ప్రొప్రైటర్లు ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మదరాసు 1
హెర్క్యులిస్ సైకిల్ & మోటార్ కంపెనీ యు.కె.వారి రిజిష్టర్డు ట్రేడ్ మార్కును ఉపయోగించుటకు రిజిష్టరు కావించబడినవారు.

TIC/M/4033

సారథికి నేను నచ్చాను. నిజమే! కానీ యిప్పుడు అన్పిస్తోంది సారథికి నచ్చింది నేనా? లేక అమ్మ నాకుచేసిన అలంకరణా!

కళ్ళు మూసుకుని పరధ్యానగా ఆలోచిస్తున్న నాకు గదిలోకి ఎవరో వచ్చినట్టు అలికిడి అవటంతో కళ్ళు తెరిచి చూశాను.

కృష్ణ లోపలికి వచ్చాడు.

క్షణంసేపు మా యిద్దరికళ్ళు కలుసుకుని అంతలోనే మెరపులా విడిపోయినాయి. నేను మళ్ళీ కళ్ళుమూసుకున్నాను.

వుదయంనుంచీ భోజనం లేని నాకు, ఆ క్షణంలో నిజంగానే అలసటగా అన్పించింది.

ఆల్మేరాదగ్గిరకి వెళ్ళి ఏదో తీసుకున్న కృష్ణ వెళ్ళబోతూ, నా మంచందగ్గర ఆగి "మీనా" అని పిల్చాడు. నేను పలకలేదు.

"తలనొప్పి తగ్గలేదా?"

తగ్గలేదన్నట్టు తల తిప్పాను.

అతను హఠాత్తుగా, నేను కల్లోకూడా వూహించనివిధంగా చెయిజాచి నా నుదుటిమీద ఆనిస్తూ "జ్వరంవుందా?" అన్నాడు.

అతని స్పర్శకి నా ఒళ్ళు ఝల్లుమంది. మెరపుదెబ్బ తిన్నదానిలా కళ్లు తెరిచాను.

"ఒళ్లు వేడిగాలేదు. ఒట్టి తలనొప్పి అయివుంటుంది. నేను వాళ్ళని పంపి రావటానికి వెళుతున్నాను. వస్తూ శారిడన్ తెస్తాను. అది వేసుకుని వేడివేడి కాఫీ తాగితే తగ్గిపోతుంది" అన్నాడు చెయి తీసేస్తూ.

"ఏం? నీదగ్గర చాలా మందులున్నాయిగా!" అన్నాను వెక్కిరింతగా.

"అవి నీలాటి మొండివాళ్ళకి పనిచేయవులే" అన్నాడు నవ్వుతూ,

క్షణంసేపు నేను నవ్వుతున్న అతనివైపు అలాగే చూస్తూండిపోయాను.

అతనికూడా ఏమైందో ఏమో! రెప్పవాల్చకుండా నా ముఖంలోకి చూడసాగాడు.

తర్వాత-అంతలో తననుతాను సర్దుకున్నవాడిలా, "అనవసరంగా భోజనం మానేశావు. చూడు, ముఖం ఎలా వాడిపోయిందో. అమ్మతోచెప్పి వెళ్తాను. త్వరగా వంటచేస్తుంది, భోజనం చేసేయి. శారిడన్ అంతగా అయితే పడుకోబోయేటప్పుడు వేసుకుందువుగానిలే" అని నానుంచి యింకెలాంటిమాటలు వినటానికి యిష్టపడనివాడిలా చటుక్కున వెనక్కు తిరిగి అక్కడనుంచి బైటకి వెళ్ళిపోయాడు.

నేను చాలాసేపు అతను వెళ్ళిపోయిన ఆ గుమ్మంవైపే చూస్తూండిపోయాను.

# తలనొప్పి?



# అవేదన్



# తీసుకొని చిటికిలో పోగొట్టుంది

SQUIBB
SARABHAI CHEMICALS





ఆశ్చర్యకరమైన "ఎపెస్" కల అవేదన్ తలనొప్పి, జలుబు, యితర శరీర నొప్పులను త్వరగా, సురక్షితముగా, విశ్వాసముగా నివారణచేస్తుంది.

"ఇప్పుడేం కాఫీ తల్లీ. నే నింకా స్నానంచేసి సంధ్యావార్చలేదు. యీ వార్త మీకు చెప్పాలనే ఆత్రంతో చీకటితోలేచి మొదటి బస్సుకే చక్కావచ్చాను."

"దేవుడు మిమ్మల్ని చల్లగాచూస్తాడు. మీ పుణ్యం వూరికేపోదు బాబాయిగారూ."

అత్తయ్య వంటఇంట్లోంచే అంది.

స్నానంకోసం పెట్టిన మరుగుతున్న నీళ్ళలోంచి కాసినితీసి ఇత్తడి గ్లాసునిండా చిక్కగా, వేడి వేడిగా పొగలుగక్కుతున్న కాఫీ తెచ్చియిచ్చింది.

స్నానం చేయలేదని, తాగనని చెబుతున్న ఆవార్లుగారి బెట్టు ఆ కాఫీ చూడగానే సడలిపోయింది. వద్దంటూనే కాఫీగ్లాసు తీసుకుని రుచిచూస్తూ, తల పంకిస్తూ, "కాఫీ తాగాలంటే నీ చేత్తో కాచిందే తాగాలమ్మా. యెన్నిచోట్ల తాగాను తానీ, ఈ రుచి రానేరాదు. నీ చేతిలో ఏముందో ఏమో" అన్నాడు.

ఆయన ఆ గ్లాసుడు కాఫీ వూదుకుంటూ ఒక్కొక్క గుక్కే తాగేలోపల అత్తయ్య లాంఛనాల విషయం గురించి ఏమిస్తే బాగుంటుందో సలహా సంప్రతింపులు చేసింది

ఆయన చాలా తేలికగా చెప్పేసాడు.

"ఆ! ఏముందమ్మా? ఆడపిల్లలందరికీ కలిపి వెయినూటపదహార్లు. అత్తగారికి రెండు నవర్సుల బంగారం, నూటపదహార్లు. పిల్లాడికి వెండికంచం, చెంబు, పట్టుబట్టలు. మిగతావి మనకి తెలిసినవేగా. పానకం బిందెలు, బొట్టుపెట్టెలు, కాళ్ళగడుగు పళ్ళెం యివన్నీను. కుర్రాడుమాత్రం ఏ మిచ్చినా ఏ మివ్వకపోయినా తనకి రేడియో కావాలని నోరుతెరిచి చెప్పాడు. రేడియోది ఏముంది? ఈ రోజుల్లో ఎంత పెట్టినా వస్తుంది. యిచ్చినా మన అమ్మాయికే వుంటుందిగా! ఆ! మర్చిపోయాను. అప్పగింతబట్టలు కుటుంబంలో అందరికీ కాకుండా మరో నాలుగు జతలు ఎక్కువ కావాలన్నారు. పిల్లాడికి ముగ్గురు మేనత్తలున్నారట. వాళ్లు పెద్ద హోదాల్లో వున్నారు. వాళ్ళకి అప్పచెప్పకపోతే బాగుండదు! తర్వాత – పిల్లాడి అమ్మమ్మ తాతయ్యా వున్నారుట వాళ్ళకున్న ఎకరం పొలం వాళ్ళ తదనంతరం యీ కుటుంబానికే రాసారుట. వాళ్ళకీ పెట్టకపోతే బాగుండదు. ఆ! ఇంకో విషయం ఏమిటంటే – వాళ్ళు ప్రస్తుతం పిల్లకి నగలేమి పెట్టము చెప్పారు. వాళ్ళ యిబ్బందులేవో వాళ్ళు చెప్పారు. కాలం కలిసివచ్చి, అమ్మాయి పేరుబలంమీద ఏదయినా డబ్బువస్తే అప్పటికి చేయిస్తారుట."

"దానికేముంది లెండి," అంది అత్తయ్య. పిల్ల నచ్చిందని ఆవార్లుగారు చెప్పగానే పెట్రొమాక్సు లైటులా వెలిగిన ఆవిడ ముఖం కట్నాల జాబితా వినగానే కొడిగట్టిన దీపంలా అయిపోయింది. అక్కడే నిలబడి ఇదన్నీ వింటున్న నాకు

ఒళ్లు మండిపోయింది. ఆ కోతి ముఖానికి ఇన్ని కావాలా? అత్తయ్య ఏమైనా అనుకుంటుందేమోనని వెనక్కు తగ్గాను కానీ లేకపోతే, 'ఇవి చాలండీ! ఇం కేమీ అవసరం లేదా?" అంటూ వెక్కిరించి హేళనచేసేదాన్ని.

ఆచార్లు ఖాళీచేసిన గ్లాసు క్రిందపెట్టి, సంచీ, గొడుగు తీసుకుంటూ "మరి నే వస్తానమ్మాయి. కృష్ణుడు రాగానే అన్నీ చెప్పు. నువ్వూ వాడూ ఆలోచించుకుని నాకు కబురుచేయండి," అన్నారు.

ఆయన వెళ్ళిపోయిన తర్వాతకూడా, చాలా సేపటివరకూ అత్తయ్య దీర్ఘాలోచనలో పడినట్టు కూర్చున్నచోటినుంచి కదలనేలేదు. వంటమాటకూడా మర్చిపోయి ప్రతిమలా అక్కడే కూర్చుండిపోయింది. వంటయింట్లో మిగిలిన పనిని రాజేశ్వరి పూర్తి చేసింది.

భోజనం వేళకి కృష్ణ వచ్చాడు. అత్తయ్య అతనికి అన్నం పెడుతూ ఆచార్లుగారు చెప్పినవన్నీ చెప్పింది. లాంఛనాలమాట వినగానే నేను వూహించినట్టుగా మండిపడలేదతను. నెయ్యివేయించుకుంటున్నవాడల్లా నవ్వుతూ తలెత్తి, "చాలా ఆ కోరికలు. ఇం కేమైనా వున్నాయా? కట్నం వద్దంటూ మంచి బేరమే. బాన్లే, ఇటు

కట్నం తీసుకోలేదని పేరూ దక్కుతుంది. అటు కానుకల రూపంలో అసలు కావల్సింది ముట్టనూ ముట్టుతుంది. మంచి పద్ధతి. తెలివైన పని " అన్నాడు.

"ఏమోరా నాయినా! నాకు తెలిసినవరకూ ఇంతకుమించిన సంబంధం రాదనే అనిపిస్తోంది. ఒక వేళ వచ్చినా వాళ్ళ కోర్కెలకి మనం అందుకోలేం, భగవంతుడి దయవల్ల ఇదయినా స్థిరపడి, అది ఒక ఇంటిదైపోతే?–" అత్తయ్య కంఠం వణికింది.

"ఏమిటమ్మా నువ్వనేది. ఒక ఇంటిదికాక ఎప్పుడూ మన ఇంటినే పట్టుకుని కూర్చుంటుందనుకున్నావా?'' అన్నాడు.

అత్తయ్య బ్రతిమిలాడుతున్నట్టుగా అంది.

"నువ్వు యీ సంబంధం విషయంలో అభ్యంతరాలేమీ చెప్పకురానాయనా. మనం ఎలాగో రెండు మూడు వేలు కట్నం ఇవ్వటానికి సిద్ధంగానే ఉన్నాము. పోనీ అది యీ రూపంలో అనుకో.''

"ఎందు కనుకోవాలమ్మా. ఒక విషయాన్ని మరో విషయంగా ఎందుకు చూడాలి. కావాలంటే కట్నం తీసుకోమను. నా కభ్యంతరం లేదు.''

అత్తయ్య విస్మయంగా అంది. ఆవిడ కళ్ళలో అసహనం తొంగిచూసింది.

"నాకు తెలుసు. నేను ఇంతక్రితంనుంచీ ఇదే గుంజాటన పడుతున్నాను. నీ మొండితనం నాకు తెలియంది కాదుగా. నాకీ భయం వుండనేవుంది. నువ్వు ఒప్పుకోవని నాకు ముందే తెలుసు ఏం చేస్తాం దాని ఖర్మ. పెళ్ళయేరాత దాని మొహాన వుందో లేదో."

"అమ్మా! ఏమిటి నువ్వనేది – నేను – దానికి –'' ఆవేశంగా ఏదో అనబోయిన కృష్ణ హఠాత్తుగా తగ్గాడు

అతని స్వరం అనుకోకుండా మృదుగంభీరంగా మారింది. నిదానంగా చెప్పాడు.

"నీ కిష్టమైతే, రాజు ఒప్పుకుంటే నా కేం అభ్యంతరం లేదమ్మా. నువ్వెలా చేయమంటే అలా చేస్తాను. నువ్వు మాత్రం కంట తడిపెట్టకు." మరేం మాట్లాడకుండా భోజనం ముగించి లేచి వెళ్ళిపోయాడు.

కృష్ణ అంగీకరించగానే అత్తయ్య మెడలమీదనుంచి మోయలేని బరువు దించుకున్నదానిలా కనిపించింది నాకు. ఆవిడ ముఖం ఎలాటి బాధలేకుండా సంతోషంతో కళకళలాడటం, యీ వూరు వచ్చిన ఇన్నాళ్ళకి నేను ప్రప్రథమంగా ఇప్పుడు చూసాను. ఆనందంతో, ఉంగారుతో, కాలూ చెయ్యీ ఆడనిమనిషిలా, తిరగసాగింది. నాకు నెయ్యి వడ్డించబోయి పెరుగు వడ్డించింది. రాజేశ్వరికి కూరవేయబోయి

పులుసు పోసింది. చివరికి, 'ఏమిటోనే! నాకు మతిలేకుండా వుంది' అంటూ అన్నీ మా దగ్గిర పెట్టి అక్కడనుంచి వెళ్ళిపోయింది. మధ్యాహ్నం ఆచార్లుగారు వచ్చారు. మళ్ళీ లాంఛనాలగురించి చర్చ జరిగింది వాద ప్రతివాదాలు జరిగినాయి. కృష్ణ అత్తయ్య బలవంతంవల్ల చివరికి అన్ని విషయాల్లో ఆచార్లుగారు చెప్పేలా చేయటానికి ఒప్పుకున్నాడు. రాజేశ్వరి వివాహం దాదాపు స్థిరపడిపోయినట్టే.

అత్తయ్య ఆనందం చెప్పనవసరం లేదు.

కృష్ణ కూడా సంతృప్తిగా వున్నట్టే కన్పించాడు.

కానీ నాకు ఎందుకో రాజేశ్వరి ముఖమే చిన్నబోయినట్టుగా కన్పించింది.

పెళ్ళి స్థిరపడిందనే ఆనందం ఆ ముఖంలో నా కెక్కడా కన్పించలేదు.

అక్కడికీ పరీక్షగా, యిది నా అనుమానమా లేక నిజమేనా అన్నట్టు ఒకటికి పదిసార్లు చూసాను

ఇంకా సందేహం ఎందుకు? దానికి ఆ పెళ్ళికొడుకు నచ్చలేదు. కానీ దాని అభిప్రాయం కనుక్కునే నాథు డేడి?

రాజేశ్వరిపట్ల జాలితో, సానుభూతితో నా గుండెలు కరిగి నీరయినాయి. కృష్ణ మీద అత్తయ్యమీద పట్టరానంత ఆగ్రహం కలిగింది.

ఏం మనుష్యులు వీళ్ళు!

అత్తయ్య రాజేశ్వరిని కన్నతల్లి.

కృష్ణ చెల్లెల్ని కనుపాపకంటే అపురూపంగా చూసుకుంటున్నట్టు కన్పించే ఆదర్శసోదరుడు.

ఆడపిల్ల జీవితానికి ఆయువు పట్టులాటి యీ విషయంలో దాని అభిప్రాయం యిద్దరిలో ఏ ఒక్కరూ అడగరే? వాళ్ళ మెళ్ళో ఖరించవేసిన గుదిబండలా. ఎప్పుడు ఎలా దీన్ని వదిలించుకుందామా అని ఎదురుచూస్తున్న మనుష్యుల్లా ప్రవర్తిస్తారేం!

నాకు మండిపోతోంది. ఆపుకోలేనంత ఆవేశంగా వుంది. నా స్వభావం చిన్నప్పటి నుంచీ అంతే. ఎక్కడ ఏ కాస్త అన్యాయం చూసినా నా మనసు అగ్గిమీద గుగ్గిలం అయిపోతుంది. లేచి చూస్తూ వూరుకోలేను. రాజేశ్వరిని తిరగబడమని ప్రోత్సహిస్తాను. ఎదురుతిరిగి దాని యిష్టాన్ని నిక్కచ్చిగా చెప్పగల ధైర్యసాహసాలు నూరిపోస్తాను. నోటమాట రానట్టుండే యీ అమాయకురాలిలో అవసరమైన రోషం, అభిమానం, పట్టుదల సృష్టించటం నా కనీసధర్మం అన్పించింది.

యింకా నయం! ఈ సమయంలో నేనిక్కడ వుండటం ఎంత అదృష్టం. నేను కేవలం రాజేశ్వరిని యీ బలవంతం పెళ్ళినుంచి తప్పించటానికే యిక్కడికి వచ్చానేమో ఎవరికి తెలుసు?

కానీ రాజేశ్వరితో యీ విషయం మాట్లాడాలంటే యీ యిద్దరిమధ్యా కాస్త ఏకాంతం కావాలి. ఏకాంతం యీ యింట్లో లభించటం కష్టం. ఎప్పుడూ ఎవరో ఒకరుంటారు. ఇక్కడికి ఒకటి రెండు సార్లు ప్రయత్నించి చూసి విఫలమైనాను. విఫలమైనకొద్దీ నా మనసులో ఆరాటం ఎక్కువ కాసాగింది.

సాయంత్రం అయిపోయింది.

ఆ సాయంత్రం పంట కూడా రాజేశ్వరే చేసింది.

చీకటిపడుతుండగా అత్తయ్య పళ్ళెంలో ఒక కొబ్బరికాయ, నాలుగు అరటిపళ్ళు, కొసిని సన్నజాజిపూలు, హారతికర్పూరం, అగరొత్తులు పెట్టి 'రాజూ! గుడికి వెళ్ళి యీ కొబ్బరికాయకొట్టి దేవుడిదగ్గర బొట్టుపెట్టుకురావమ్మా' అంది.

రాజేశ్వరి త్వరత్వరగా పని ముగించుకుని కాళ్ళూ చేతులూ కడుక్కుని, చీర మార్చుకుని పళ్ళెం తీసుకుని బైలుదేరింది.

"వుండు రాజూ. నేనూ వస్తున్నా" అంటూ చీర మార్చుకుని నేను కూడా రాజేశ్వరి వెంట బైలుదేరాను.

బైట బాగా చీకటిపడింది.

పీఠమ్లో పంచాయితీబోర్డు నౌకరు వీధిదీపాలని వెలిగిస్తున్నాడు.

రాజేశ్వరి, నేను మౌనంగా, మాటలురాని వాళ్లలా, ఎవరి ఆలోచనల్తో వాళ్ళం గుడికి నడుస్తున్నాం.

వేణుగోపాలస్వామి ఆలయం.

కృష్ణగర్భంలో ఉంచంపిన గుడి చూస్తే కన్పించేది గోపురం శిఖరం దీపమే. గుడిచుట్టూ ఎత్తుగా వున్న ప్రహరిగోడ వుంది.

ఆ గోడకి లేతగులాబిరంగు, తెలుపులో పూసిన చారలున్నాయి.

సింహద్వారం చాలా ఎత్తుగా, విశాలంగా వుంది.

లోపల విశాలంగా వున్న ఆవరణలో వున్న దేవాలయం చిన్నది. గుడికి ఎడమ వైపున రాతికట్టడంతో కట్టిన మెట్లతో కోనేరు, కుడివైపున పెద్దమండపం ఉన్నాయి.

రాజేశ్వరి నేను కోనేటి మెట్లమీద నిలబడి కాళ్ళు కడుక్కున్నాం. మేం వెళ్ళే సరికి పూజారి సంధ్యాదీపం వెలిగించి, గంట వాయిస్తున్నాడు. రాజేశ్వరి యిచ్చిన పళ్లూ పూలు దేవుడిముందు పెట్టి కొబ్బరికాయ కొట్టి హారతి యిచ్చి శఠగోపం తెచ్చి మా యిద్దరి నెత్తిన పెట్టాడు

హారతి భక్తిగా కళ్ళకద్దుకుంటూ రాజేశ్వరి చెంగుముడి విప్పి రెండు 5 పైసలు తీసి ఒకటి నాకిచ్చి రెండోది తను పళ్ళెంలో వేసింది.

"సత్వరకళ్యాణ ప్రాప్తిరస్తు. దీర్ఘ సుమంగళీభవ. సుపుత్ర పౌత్రాభివృద్ధిరస్తు" ఆశీర్వచనాలు కూడా మంత్రాలతోపాటు కలిపి చదివేసాడు పూజారి. ఆయన ఇచ్చిన కుంకం పూలు యిద్దరం తీసుకున్నాం.

"ప్రసాదం తీసుకున్న తర్వాత కొద్దిసేపు కూర్చోవాలి" అంది రాజు చుట్టూ చూస్తూ.

"అక్కడ కూర్చుందామా" అన్నాను మండపంవైపు చూపిస్తూ.

"పద" అంది.

ఇద్దరం వెళ్ళి మండపం ఎక్కి పై మెట్టుమీద పక్కపక్కగా, ఒకర్ని ఒకరు ఆనుకునేటంత దగ్గరగా కూర్చున్నాం.

పౌర్ణమి వెళ్ళిన విదియనాటి వెన్నెల గుడి ఆవరణంతా అప్పుడప్పుడే ఆవరించు కుంటోంది.

నేను చుట్టూ పరిశీలనగా చూసాను.

తెలుపు ఎరుపు చారలతోవున్న ఆ ప్రహరీగోడ, ఆ వెన్నెల, ఆ కోనేరు, యీ మండపం, నాకు చాలా ప్రశాంతంగా, ఆహ్లాదంగా కన్పించాయి. దేవాలయం అంటే యిలా నిశ్శబ్దంగా, నిర్మలంగా, శాంతిని కలిగించేలా వుండాలి

పట్నవాసంలో భగవంతుడిదగ్గర కెళ్ళినా ప్రశాంతత దొరకదు. అక్కడ కూడా క్యూలు, పూజార్ల చేజాపుళ్ళు, టికెట్లు కొనుక్కోటం, రద్దీగావుంటే నగలుపోతా యేమోననే భయం, జరగండి జరగండి, వెనకవాళ్ళకి చోటు యివ్వండి అనే అదిలింపులు – వీటితో చిత్తనైర్మల్యంతో రెండు నిముషాలపాటు భగవంతుడిని చూసే అవకాశమే వుండదు. ఎంత విసుగో, ఏ సినిమాహాలుకో, ఎగ్జిబిషన్ కో వెళ్ళినట్లుగా ఎప్పుడు బైటపడతాంరా భగవంతుడా అనిపిస్తుంది.

రాజేశ్వరి ఏం మాట్లాడకుండా మౌనంగా వుండటం చూసిన నేను, "ఏదయినా చెప్పు రాజూ" అన్నాను

"ఏం చెప్పను నేను? నువ్వే చెప్పు." అంది

"ఒకటి అడగనా?"

"అడుగు"

"మొన్న వచ్చిన పెళ్ళికొడుకు నీకు నచ్చాడా?"

రాజేశ్వరి హఠాత్తుగా వచ్చిన యీ ప్రశ్నకి చకితురాలయినట్టు తల తిప్పి నా వైపు చూసింది.

"నిజం చెప్పు రాజూ నీ అభిప్రాయం ఏమిటి? అతన్ని బాగా చూసావా నువ్వు" తల వంచుకున్న రాజేశ్వరి చూసానన్నట్టు తల వూపింది.

"నచ్చాడా నీకు ?"

సమాధానం చెప్పలేదు. పళ్ళెంలోవున్న పూలని వేళ్ళతో కదుపుతూ ఊరుకుంది.

"నా కెందుకో నీ కతను నచ్చలేదని బాగా అన్పిస్తోంది నా అభిప్రాయం నిజమౌనో కాదో తెలుసుకుందామని, నిన్ను అడగాలని పొద్దుటినుంచి తహతహలాడుతున్నాను నేను. చెప్పు రాజూ, మొహమాటం లేకుండా నీ మనసులో వున్నది బైట పెట్టేయి.''

''తెలుసుకుని ఏం చేస్తావు వదినా ?" రాజేశ్వరి కంఠం ఎలాగో అవటం నేను గమనించాను.

'నువ్వలా అంటే నేనేం చెప్పలేను నేనేమీ చేయలేనంతమాత్రాన తెలుసుకో కూడదని వుందా? స్నేహితురాలిగా, నీ సమవయస్కురాలిగా అడుగుతున్నానంతే. ఎందుకో చెప్పలేను. నీ వుద్దేశ్యం ఏమిటో గ్రహించాలని నా ప్రాణం కొట్టుకుపోతోంది. నన్ను ప్రశ్నలతో చంపక, నాతో తర్కానికి దిగక నీ అభిప్రాయం ఏమిటో చెప్పు రాజూ." బ్రతిమలాడుతున్నట్లుగా అన్నాను

---

"నా అభిప్రాయంతో పనేముంది వదినా ? దానికి విలువ ఏముంది ?"

"అదేమన్నమాట. పెళ్ళిచేసుకోవాల్సిన దానివి నువ్వు. ఆమూడు ముళ్ళూ పడి నప్పటినుంచీ యావజ్జీవితం అతనితో కాపురంచేయాల్సిన మనిషివి నువ్వు. పెళ్ళయిన తర్వాత ఎదురయ్యే కష్టనిష్ఠూరాలన్నీ భరింపవలసిందికూడా నువ్వే. నీ అభిప్రాయానికి విలువలేకపోతే యింకెవరి అభిప్రాయానికి విలువవుంటుంది ?" ఆవేశంగా అన్నాను.

రాజేశ్వరి నోటినుంచి ఎలాటి సమాధానం రాలేదు.

నామాటలు వినీ విన్నట్టుగా కూర్చుండిపోయింది.

"మీ అన్నయ్య నిన్నడక్కుండా వూరుకోవటం చాలా అన్యాయం. దరుణం." రాజేశ్వరి నవ్వుతూ నావైపుచూసింది.

"అన్నయ్య అంటే అలా ఒంటికాలిమీద లేస్తావేం నువ్వు ? అన్నయ్య నన్ను అడగలేదని నీకు ఎవరుచెప్పారు ? అడిగాడు నన్ను."

"అడిగాడా ? ఎప్పుడు ?" అబద్ధం అన్నట్టుగా చూసాను.

"మధ్యాహ్నం ఆచార్లుగారు వచ్చినప్పుడు. నేను కాఫీ తయారుచేస్తూ వంటయింట్లో వుండగా కాఫీగ్లాసులు తీసుకెళ్ళటానికి వచ్చినప్పుడు అడిగాడు."

"ఏమన్నావు నువ్వు ?"

'ఏమంటాను ? నాపరిస్థితుల్లోవున్న ప్రతి ఆడపిల్లా ఏమంటుందో అదే అన్నాను.'

"ప్రతి ఆడపిల్లా అని అందరినీ కలపకు. నాలాటిది అయితే నాకిష్టంలేదని ఖచ్చితంగా తెగేసినట్టు చెప్పివుండేది."

"నీ పరిస్థితులు వేరు వదినా. నువ్వు ఒక్కగానొక్క పిల్లవి. డబ్బున్నదానివి. నువ్వేదన్నా చెల్లుతుంది సామాన్య కుటుంబంలో, నలుగురిలో ఒకరుగాపుడితే అలాకాదు. తాము పుట్టిపెరిగిన పరిస్థితులు పిల్లలస్వభావాలని చాలా తీర్చి దిద్దుతాయి. నువ్వే నాచోటులోవుండీ, కుటుంబం ఆర్థికంగాదిగజారి – యిబ్బందులకి గురిఅయి వుంటే, కనీసం నాబరువుతగ్గినా వీళ్ళకిచాలు అని అభిప్రాయపడి వుంటే – నువ్వు అదేపనిచేసి వుండేదానివేమో !"

"బరువా ? నువ్వు బరువేమిటి ? నవ్వుతారెవరైనా వింటే. కన్నవాళ్ళకి పెంచాల్సిన బాధ్యతలేదా ?"

"వుంది. కాదనను. కానీ అది తలిదండ్రులకి మాత్రమే వర్తిస్తుంది అన్న

గార్కి - అందులో సవితి అన్నగార్కి అసలేవర్తించదు. మనం యికవెడదామా?" ప్రసంగం ఆపైన పొడిగించడం యిష్టంలేని దానిలా రాజేశ్వరి లేవబోయింది.

నేను చెయిపట్టుకునిలాగి కూర్చోబెట్టాను.

"సవితి అన్నగారంటావేం? మీ అన్నయ్యకి నువ్వు ప్రాణంకంటే ఎక్కువగా."

"యిప్పుడుమాత్రం కాదంటున్నానా? కాని వానిమంచితనం లోకువగా చేసుకుని, మోయలేనిభారం వానినెత్తిమీదవేసి మెడలువంచటం న్యాయమేనంటావా?"

నేను సమాధానం చెప్పలేకపోయాను.

నాకెందుకో రాజేశ్వరి తనమనసులో అభిప్రాయం తెలియనీకుండా దాచేస్తోందని అన్పించింది.

తెచ్చిపెట్టుకున్న కోపంతో, నిష్ఠూరంగా అన్నాను.

"ఏవేవో చెబుతున్నావుతప్ప నేను అడిగిందిమాత్రం చెప్పటంలేదు. నువ్వు చాలా గడుసుదానివని యిప్పుడు అర్థమౌతోంది నాకు. ఔన్లే నేనెంతయినా పరాయిదాన్నే. నువ్వన్నదినిజమే. నాలుగురోజులుండి పోయేదాన్ని. నాతో ఎందుకుచెప్పాలి. చెబితేమాత్రం ఏమొస్తుంది? అడగటం నాదేపొరపాటు. నాతెలివితక్కువ తనానికి క్షమించు." రాజేశ్వరి చప్పున నాచెయిమీద తనచెయి ఆనించింది

అభిమానం ఆప్యాయత పుష్కలంగా నిండిన స్వరంతో అంది.

"వదినా! అలా అనకు. నీకో సంగతి చెప్పనా? నువ్వు వచ్చినరోజున, మనిద్దరం ఒకర్ని ఒకరు చూసుకున్న ముహూర్తం ఎలాటిదోగానీ, నేను నిన్ను విడిచి వుండలేనేమో అన్పిస్తోంది. నువ్వెళ్ళిపోతే నాకు ఎంత శూన్యంగా, దిగులుగా అన్పిస్తుందో నువ్వు వూహించలేవు. నువ్వు యిక్కడినుంచి వెళ్ళగానే నీ స్నేహితుల గొడవలో పడి మమ్మల్ని మర్చిపోవచ్చు—"

"రాజూ! నీకు లక్షసార్లు చెప్పాను. నాకెవరూ స్నేహితులు లేరని—"

రాజేశ్వరి నామాట విన్పించుకోకుండానే అనేసింది.

"మనిద్దరం మళ్ళీ కలుసుకుంటామో లేదో! కానీ నామనసు నీకోసం ఎప్పుడూ కలవరిస్తూనే వుంటుంది. నువ్వు నాకొక తియ్యటికలలా ఎప్పటికీ మరుపురాని జ్ఞాపకంలా నామనసులో జీవితాంతం నిల్చిపోతావు. నువ్వు పరాయిదానివి కానే కాదు"

రాజేశ్వరి చేతిని నేను గట్టిగా నొక్కాను.

నాకెందుకో ఆక్షణంలో రాజేశ్వరి మెడచుట్టూ చేతులువేసి, ఆప్యాయంగా, అభిమానంగా, తనగుండెలకి గట్టిగా హత్తుకుపోవాలనిపించింది.

"రాజూ! నేనంటే నీకెంతో యిష్టమని చెబుతున్నావు. మరి ఆలాటినాతో నీ అభిప్రాయం చెప్పటానికేం?"

రాజేశ్వరిముఖం క్రిందకువాలింది.

"తెలుసుకుంటే నీకేం వస్తుంది?"

"ప్రతిదానికీ ప్రయోజనం వుండాలా?"

"వుండాలని అన్నయ్య అంటూ వుంటాడు."

"మీఅన్నయ్యంత మూర్ఖుడు, దౌర్జన్యపరుడు యీలోకంలో యింకెవరూ లేరని నానమ్మకం."

"మా అన్నయ్యంత సమర్థుడు, మంచివాడు యీ ప్రపంచంలో యింకెవరూ వుండరని నావిశ్వాసం."

రాజేశ్వరితల సగర్వంగా పైకిలేచింది.

కన్నెళ్ళల్లో మిలమిలలాడుతున్న ఆకళ్ళలో అన్నగారిపట్ల ఆరాధన, గర్వం తొణికిసలాడటం గమనించాను నేను.

"ఔను పాపా! అందుకే చెల్లెల్ని పసిపాపలాటిదో ఊహించకుండా, కోతిలాటి

ఆమనిషికి ఈందనపు బొమ్మలాట నిన్ను కట్టబెట్టాలని చూస్తున్నాడు. మీ అన్నయ్య మూర్ఖుడేకాదు, గుడ్డివాడుకూడా.''

"కాపురాలు సవ్యంగా జరగటానికి అందచందాలకంటే, మనిషి గుణగణాలు ఎక్కువముఖ్యం అని మా అన్నయ్యకి, బాగాతెలుసు.''

"అయితే యిక నీకర్మ అనుభవించు-అనుకుంటాను నేను"

"కృతజ్ఞురాలిని."

నేను ఓడిపోయినదానిలా మొహం తిప్పుకుని బైట వెన్నెట్లోకి చూడసాగాను.

లాభంలేదు. దీనితో తర్కించి ప్రయోజనంలేదు అన్పించింది. రాజేశ్వరి నాకు నచ్చచెబుతున్నట్టుగా అంది.

"వదినా! నలుగురిలో పుట్టినవాళ్ళు తమ ఆశలకి, సుఖాలకంటే కుటుంబ క్షేమానికి ఎక్కువ ప్రాధాన్యత యివ్వాలి. ఎవరిసుఖం వాళ్ళు చూసుకుంటే ఎలా? వ్యక్తుల స్వార్థపరత్వంతో విండిన ఏ సమష్టి వ్యవస్థలోను సుఖశాంతులుండవు."

"అమ్మో! ఏమో అనుకున్నాను. మీ అన్నయ్య నీకు చాలా నేర్పాడే. జీవితాన్ని గురించి యింకా ఏమేం నూరిపోశాడు చెల్లెలుగారూ''

రాజేశ్వరి నావ్యంగ్యానికి బాధపడలేదు. చిరునవ్వుతో సమాధానం యిచ్చింది.

"అందని ఆశలకిపోయి బ్రతుకు అశాంతి చేసికోకూడదు. వున్నదాంతో తృప్తి పడాలి మనం. మనకి వీలయినంతవరకూ ప్రక్కవాళ్ళ సుఖశాంతులకి చేయూత యివ్వాలి. మనవల్ల ఏరూపంగానైనా యితరులకి ప్రయోజనం వుండాలి. యిది మొదటిపాఠం. కావాలంటే నువ్వుకూడా నేర్చుకోవచ్చు.''

"నాకేం అవసరంలేదు. కాని నువ్వు యీపెళ్ళి చేసుకున్నందువల్ల జరిగేలాభం ఏమిటట?"

"నాబరువు వాళ్ళకి తీర్తుంది."

అదీ! అసలుసంగతి. నా అనుమానమే నిజమైంది. దానికిష్టంలేదు. లేకపోయినా కుటుంబంకోసం ఒప్పుకుంటోంది. రాజేశ్వరి నిర్ణయం నాకు నచ్చలేదు.

అందుకే భయపెడుతున్నట్టుగా, బెదిరిస్తున్నట్టుగా అన్నాను.

"బరువు తీరుతుందని నువ్వు అనుకుంటున్నావు. అదిచాలా పొరపాటని నేను అంటున్నాను. ఆర్థిక పరిస్థితులు సరిగ్గాలేకపోతే అసలు పెళ్ళిచేసుకోవటమే మానేసేయి. పెళ్ళికి ఎంతఖర్చుపెట్టాలి? అంతటితో ఆగుతుందా? పెళ్ళయిన తర్వాత పండగలకి, పబ్బాలకి అల్లుడుగారి రాకపోకలు, ముద్దులు ముచ్చట్లు వుంటాయి. తర్వాత నీకు పురుడూ - పుణ్యం, పిల్లా - జెల్లా, ఎంతఖర్చు!'' (సశేషం)

Printed and published by A. Sudnakara Rao for Yuva Publications, Hyderabad-4
and printed at Yuva Press, Public Garden Road - Hyderabad - I. Phone 36336
Controlling Editor: Sri "CHAKRAPANI"

# బ్రూక్ బాండ్
# బ్రూ
# కాఫీ చికరి మిక్స్చరు

ఇన్‌స్టెంట్

ఇదిగో ఇక్కడే ఉంది! బ్రూ! బ్రూక్ బాండ్ వారినుండి యిది క్రొత్త క్షణంలో అయే కాఫీ చికరి మిక్స్చరు.

బ్రూ తయారు చేయుట చాలా సులభం! బ్రూ క్షణంలో తయారవుతుంది! ఒక్క కప్పులో అర చెంచాడు వేసి వేడినీళ్ళు పొయ్యండి. పిమ్మట పాలు పంచదార కలపండి. నిజమైన కాఫీ చికరి సువాసనతో మీకు హాయి కొలిపే బ్రూ క్షణంలో తయారవుతుంది!

జ్ఞాపకం ఉంచుకోండి, హడావిడి గాని, గొడవగాని, వడపోయుటంలో సమయ నష్టంగాని బ్రూ తో లేదు.

అంతేగాక మీ రుచికి తగినట్లుగా, కప్పుకి కొంత హెచ్చుగాని తక్కువగాని కలిపి ఏ రీతిగా చేసుకోవచ్చు.

బ్రూ కొరకు అడగండి — కాఫీ చికరి ఎలా రుచించాలో తెలిసిన బ్రూక్ బాండ్ నిపుణులచే జాగ్రత్తగా కలుప బడినది.

బ్రూక్ బాండ్ వారిచే ఎంతో శ్రద్ధతో చేయ బడినది.




ఇది క్షణంలో అయేది!
సమయం మిగిలిస్తుంది!
డబ్బు ఆదా చేస్తుంది!



Bensons/33BA/1 TEL